# లక్ష్యము - కార్యము





దత్తోపంత్ ఠేంగ్డే



ప్రచురణ :

భారతీయ మజ్దూర్ సంఘ్
ఆంధ్రప్రదేశ్

ముద్రణ :
3-10-1988

ప్రచురణ :
భారతీయ మజ్దూర్ సంఘ్
ఆంధ్రప్రదేశ్

అనువాదం :
M.G. శ్రీనివాసమూర్తి, M A., B.Ed.
V. రాం మాధవ్

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడా, హైదరాబాదు - 500 029.

ప్రతులకు :
సాహిత్యనికేతన్
బరకత్‌పురా, హైదరాబాద్.

సాహిత్యనికేతన్
ఏలూరు రోడ్డు, విజయవాడ-2

వెల : రూ. 20-00

Acc No 21910

సంపూర్ణజాతి క్షేమంలోనే కార్మికుల క్షేమం కూడా నిహితమై ఉన్నది. జాతి సుదృఢంగా ఉంటే కార్మికుడు పతనం కాడు. జాతి పతనం చెందితే కార్మికుడు సుదృఢంగా ఉండజాలడు. అలాగే కార్మికుడు తాను సుదృఢంగా ఉన్నంత కాలం జాతిని పతనం కానివ్వడు. అట్టి కార్మికుడే పతనమైతే ఇక జాతిని సంరక్షించే వారెవ్వరుంటారు?

మన ఉద్దేశం హిందూ దేశంలో కార్మికోద్యమంలోని లోపాలను సవరించడమే. 'శ్రామికులు', 'యజమానులు' అనే రెండు వర్గాలే ఉన్నాయని ప్రజలింత వరకు అనుకొంటున్నారు. అత్యంత ప్రధానమైన 'జాతి' అనేది కూడ ఉన్నదనే సంగతిని వారు విస్మరించారు.

విదేశీ పెట్టుబడికి దేశాన్ని అప్పగించడమంటే సార్వభౌమత్వం నుండి బీదరికానికి, దేశాన్ని ఆర్థిక సంక్షోభానికి గురిచేయడానికి తల యొగ్గటం, దానికి తగిన అవకాశాన్ని కల్గించడమే. ఈ కుతంత్రం వలన కలిగే హాని బీదసాదలకు మాత్రమే గాక అసలు ప్రజా తంత్రానికే వ్యతిరేకమైనది. దీనితో మన ఆర్థిక స్వాతంత్ర్యం పూర్తిగా హరించుకు పోతుంది. మన సార్వభౌమత్వం నశిస్తుంది.

సుఖం కావాలనుకోవడం సరియైనదే. పాశ్చాత్యులే గాక, మన జాతి ద్రష్టలు, ఋషులు, సాధుగణములు కూడా సంపూర్ణ జీవన లక్ష్యం సుఖమేనని ప్రకటించారు. దీనిలో ఏ మాత్రమూ అనుమానం లేదు. కాని ఆ సుఖాన్ని పొందటం ఎలాగా అనే విషయం పైననే జీవన సిద్ధాంతమంతా ఆధారపడి యున్నది.

అర్థమూ, కామమూ అందరికీ సమానమూ, సహజమూ కూడ. ఇది లోపిస్తే మానవుడు దుఃఖిస్తాడు. కాని ఇది ఉన్నంత మాత్రాన సుఖంగానే ఉంటాడని చెప్పజాలము.

అర్థము, కామము ఎవరికీ లోపింపక జాగ్రత్త పడుటయే సమాజ వ్యవస్థకు గల బాధ్యత. అర్థము, కామము మనసుపై దుష్ప్రభావము కలిగించకుండ జాగ్రత్త పడుటయే వ్యక్తి యొక్క బాధ్యత.

జీవితాన్ని విడిభాగాలుగా చేయడం సాధ్యం కాదు. జీవితమంతా కలిసి ఒక్కటే. దానిలో గమనించాల్సిన అంశాలు వేర్వేరుగా ఉంటాయి.

# మనవి

ఏదైన లక్ష్యాన్ని సాధించడానికి సాధనం వ్యక్తి. సమాన లక్ష్యం, ప్రేరణలతో కలిసి, మెలసి పనిచేసే వ్యక్తుల సమూహాన్ని 'సంఘటన' అంటారు. సంఘటనను సజీవంగానూ, దిన దిన ప్రవర్ధమానంగానూ ఉంచడానికి కార్యక్రమాల నేర్పరచడం అవసరం. ఆ కార్యక్రమాల ద్వారా వ్యక్తుల మనస్సులపై మంచి సంస్కారాలను కలిగించడం అత్యావశ్యకం. ధ్యేయానికి అంకితమై, సంస్కారాలు పొంది, తన మరియు తన వారి స్వార్థం నుండి విముక్తులైన (కార్యకర్తలే) కార్యకర్తల సమూహముతోబాటు ఆత్మ సంయమనం, కలిగి ధైర్యవంతులై, అహంకారానికి దూరమై, సౌశీల్యవంతులై, దూరదర్శులై, ఆశా విశ్వాసాలతో ఉత్సాహవంతులై, కష్ట నిష్ఠూరాలను సరిగా అంచనా వేయ గలిగి, అందరికంటే కార్యరంగంలో ముందుకు దూకుచు, అందరికీ మార్గదర్శులై, తోటి సహచరులుగా ఆత్మీయులుగా, ప్రవర్తిస్తూ, అలసిపోక, నిరంతర సాధనా రతులై, కీర్తి ప్రతిష్ఠలకు ప్రాకులాడక, 'ఇదం న మమ' సూత్రబద్ధులైన నాయ కత్వము - ఈ రెండూ ఏదైనా లక్ష్యాన్ని పొందడానికి, స్వీకృత కార్యాన్ని సాధించడానికి అత్యంతావశ్యకాలు.

సామాజిక, సార్వజనిక క్షేత్రంలో పనిచేస్తున్న నాయకులు, కార్యకర్తలతో ఇట్టి అవసరాన్ని గుర్తింపజేసి, దానిని సాధించడానికి ప్రేరేపించుటయే ఈ పుస్తక లక్ష్యం. మరేమియూ కాదు. దీనికంటే ఎక్కువా కాదు, తక్కువా కాదు.

శ్రీ దత్తోపంత్ ఠేంగ్డేజీ ఈ పుస్తకాన్ని వ్రాయలేదు. అందుకు కావాల్సిన ఆలోచనను రేకెత్తించారు. ఈ పుస్తకాన్ని వ్రాయలేదు. ఉపన్యసింపబడింది. ఇందలి సామాగ్రియంతా వారి ఉపన్యాసాల సంకలనమే. 1984 వ సంవత్సరం అక్టోబరు 29 నుండి నవంబరు 2 వ తేదీవరకు ఇండోర్‌లో జరిగిన భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తల ఐదు రోజుల శిక్షణా వర్గంలో విశదీకరింపబడిన ఆలోచనా సరళియే ఈ పుస్తకం రూపంలో వెలువడింది.

చెప్పటానికీ, వ్రాయటానికీ కొంత భేదం ఉండటం సహజమే. అస్తవ్యస్తంగా ముద్రితమైన ఉపన్యాసాల సంపాదకత్వం సరళం కాదు గదా! అన్ని అంశాలనూ సందర్భోచితంగా జోడించటంలో సంపాదకుల అల్పజ్ఞానం కూడ అడ్డు వచ్చింది. అయినప్పటికీ, ఈ పుస్తక రూపంలో కన్పించేది 'ఎక్కువ భాగమే'. ఎక్కడైనా అస్పష్టత లేక అప్రాసంగికత కన్పిస్తే అది శ్రీ ఠేంగ్డేజీ ఆలోచనలోనివి గాక సంపాదక, ప్రకాశకుల లోపంగా భావించాలని మనవి.

శ్రీరామ నవమి
2043 విక్రమ శకము
1986 ఏప్రెల్, 17

జి. ప్రభాకర్ ఘాటే
మహామంత్రి, భారతీయ మజ్దూర్ సంఘ్

# పరిచయము

ఈ పుస్తకానికి ప్రేరకులైన శ్రీ దత్తోపంత్ ఠేంగ్డేజీ దేశవాసులందరికి సుపరిచితులు. వారు ఎమ్. ఎ., ఎల్.ఎల్.బి. చదివారు. ఏబది సంవత్సరాలకు పైగా వారు సార్వజనికమైన సమాజజాగరణ కార్యంలో చురుకుగా పనిచేస్తున్నారు. ముఖ్యంగా వారికి ప్రేరణనిచ్చింది రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్. 1935 నుండి 15 ఏండ్ల కౌమారదశ నుండియే వారు వర్ధాజిల్లాలోని ఆర్వీ తాలూకా వానరసేన అధ్యక్షులుగా తమ సార్వజనిక జీవన యాత్రకు లాంఛనంగా నాంది వాక్యం పలికారు. 1936 - 1938 వరకు వారు హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీలో కూడ చురుకుగా తమ పాత్రను నిర్వహించారు.

నిరాడంబర జీవనము, బహు వ్యాపకమైన చదువు సంధ్యలు, లోతైన ఆలోచనలు, ధ్యేయంపట్ల అంకితమైన ఆచరణము, స్పష్టమైన లక్ష్యం, ఆ లక్ష్య సాధనకు నిరంతర కృషి కార్యసాఫల్యంపట్ల దృఢ విశ్వాసం - ఇవ్వన్నీ కలిసి శ్రీ ఠేంగ్డేజీ వ్యక్తిత్వాన్ని ఏర్పరచాయి. ముప్పది కంటే ఎక్కువ చిన్న, పెద్ద పుస్తకాల ద్వారా మన దేశానికి సంబంధించిన శాశ్వత మరియు తాత్కాలిక సమస్యలపై మౌలికంగా చర్చను సాధించారు.

జాతిసేవకు అంకితమై స్ఫూర్తిదాయక వ్యక్తిత్వం గల్గిన శ్రీ ఠేంగ్డేజీ జీవితంలోని కొన్ని సోపానాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

1920- నవంబరు 10 న ఆర్వీ (వర్ధాజిల్లా) లో జన్మము.

1925- ఆర్వీ తాలూకా వానరసేనకు అధ్యక్షులు.

1936-1938-హిందుస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీ కార్యకలాపాలు.

1942- అధ్యక్షులు, కేరళ ప్రదేశ రాష్ట్రభాషా ప్రచారసభా రా. స్వ. సం. ప్రచారక్, ఉత్తరఖేడా (కేరళ).

1948-1949 రా. స్వ. సం. అస్సాం, బెంగాల్ ప్రాంత ప్రచారక్.

1949 సంస్థాపక సభ్యులు, అఖిల భారతీయ విద్యార్థి పరిషత్.

1949-1952 అధ్యక్షులు, అ. భా. వి. ప. విదర్భ ప్రాంతం.
1950-1951 సంఘటనా కార్యదర్శి, ఇంటక్, మధ్యప్రదేశ్.
1955 భారతీయ మజ్దూర్ సంఘ స్థాపనము.
1956-1957 సంఘటనా కార్యదర్శి, భారతీయ జనసంఘ, దక్షిణాంచలము.
1964-1976 రాజ్యసభ సభ్యులు.
1968-1970 రాజ్యసభ, ఉపాధ్యక్ష మండలి సభ్యులు-పబ్లిక్ రంగ పరిశ్రమల సమితి సభ్యులు -
1968-1969 సంయోజకులు, కేంద్రీయ శ్రామిక సంఘాల జాతీయ సమన్వయ సమితి.
1974 అధ్యక్షమండలి సభ్యులు, శ్రామికసంఘాల జాతీయ సమ్మేళనము.
1975 సంయోజకులు, జాతీయ శ్రమ సంఘర్షణ సమితి.
1976 కార్యదర్శి లోక సంఘర్షసమితి ('అత్యవసర పరిస్థితి' కాలంలో)
1979 భారతీయ కిసాన్ సంఘ స్థాపనము.

**విదేశాలలో :**

1969 పార్లమెంటు ప్రతినిధివర్గంలో సభ్యులుగా రష్యా పర్యటన.
1977 ద్వితీయజాతి, భేద వ్యతిరేక అంతర్జాతీయ సమ్మేళనం, జెనీవాలో ప్రతినిధి.
1979 అమెరికా ప్రభుత్వ ఆహ్వానం పై అక్కడి ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని అధ్యయనం చేయడానికి అమెరికా పర్యటన.
1985 ఏప్రిల్ 3 నుండి 19 వరకు-ఆల్ చైనా ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ ఆహ్వానంపై భారతీయ మజ్దూర్ సంఘ ప్రతినిధి వర్గ నాయకులుగా చైనా పర్యటన - డిశంబరు 4 నుండి 13 వరకు-ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ (ILO) ఆధ్వర్యంలో జకర్తాలో జరిగిన దశమ క్షేత్రీయ మహాసభలో ప్రతినిధి.

**వివిధ సంస్థలతో సంబంధాలు :**

అఖిల భారతీయ శ్రీ 'మా' జన్మశతాబ్ది ఉత్సవ సమితి ఉపాధ్యక్షులు.
భారతీయ శిక్షణ మండల్ - సంరక్షక్ సభ్యులు.
భారతీయ బౌద్ధమహాసభ - సహకార సభ్యులు.

భారతీయ ఆదిమజాతి సేవక సంఘ-సహకార సభ్యులు.

కర్మవీర హరిదాస్‌జీ ఆవలే స్మారక సమితి-మార్గ దర్శకులు.

పండిత్ దీనదయాళ్ ఉపాధ్యాయ స్మారక సమితి - సభ్యులు.

భారత మంగోలియా సాంస్కృతిక సమితి - సభ్యులు.

శ్రీ అరవింద సొసైటీ - సభ్యులు.

భారతీయ ఖేతీహర మజ్దూర్ సంఘ - మార్గ దర్శకులు.

విశ్వహిందూ పరిషత్ - మార్గ దర్శకులు.

పశుహింసా విరోధసమితి - ఆ జీవన సభ్యులు.

అఖిల భారతీయ విముక్తి జాతి సేవక సంఘ - ఆ జీవన సభ్యులు.

వనవాసీ కళ్యాణ పరిషత్ - కార్యకారిణీ సభ్యులు.

భారతీయ సాహిత్య పరిషత్ - కార్యకారిణీ సభ్యులు.

కేంద్రీయ నాగరిక పరిషత్ - సభ్యులు.

పం. దీనదయాళ ఉపాధ్యాయ జన్మభూమి స్మారక సమితి నగలా చంద్రభాన్ (మధురా) - సభ్యులు.

# 1. భారతీయ మజ్దూర్ సంఘ్

అఖిల భారతీయ శిక్షణ దక్షతా వర్గ ప్రారంభమైన పవిత్ర దినమిది. చదువు సంధ్యల విషయంలోనైతే డిగ్రీ, డిప్లొమాలు సాధించేవరకే చదువు అవసరమని, దాని తరువాత ప్రత్యేకంగా చదువుకోవాల్సిన అవసరం ఉండదని సాధారణంగా ప్రజల అభిప్రాయం. కాని మన పరంపరలో దీక్షాంత కార్యక్రమం (కాన్వొకేషన్ అడ్రస్) ఏర్పరచినప్పుడు, పరీక్షలో ఉత్తీర్ణులై స్వగృహాలకు వెళ్ళే విద్యార్థులకు 'స్వాధ్యాయాత్మా ప్రమదః' అంటే చదువు సంధ్యలలో ఎప్పుడూ వెనుకంజ వేయకుమని, పొరపాటు చేయవద్దని సుస్పష్టంగా ఆదేశించ బడింది. అంటే జీవితమంతా విద్యను సముపార్జిస్తూ ఉండవలెనని. జీవితం అప్పుడే సార్థకం కాగలదని స్పష్టమవుతుంది. కార్యకర్తలమైన మనకు గూడ ఈ సూత్రం వర్తిస్తుంది. అందుచేతనే మనము శిక్షణ వర్గలను ఏర్పరచుకొంటూ ఉంటాము.

**భారతీయ మజ్దూర్ సంఘ మరియు ఇతర సంస్థలలో ఉన్న తారతమ్యము:**

మరి ఈ శిక్షణ వర్గ ఎవరి కోసం? అనే ప్రశ్న ఉత్పన్నమౌతుంది. దీనికి సమాధానం సుస్పష్టం. ఇది భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యకర్తల కోసం. భారతీయ మజ్దూర్ సంఘ్‌లోని విశిష్టత ఏమంటే ఇక్కడ పాల్గొంటున్న ప్రతి కార్యకర్త భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యకర్తే. తన ఫెడరేషన్ లేక యూనియన్‌లో కూడ అప్రత్యక్ష రూపంలో అతడు భారతీయ మజ్దూర్ సంఘ్ ద్వారానే వాటి కార్యకర్తగా రూపొందుతాడు. ఇతర కేంద్రీయ శ్రామిక సంస్థల లోని పరిస్థితి దీనికి భిన్నంగా ఉన్నదని మనకు తెలుసు. అక్కడి కార్యకర్తలలో ప్రతి ఒక్కడు మౌలికంగా తన కర్మాగారానికి సంబంధించిన యూనియన్‌లలో కార్యకర్తయై, తన యూనియన్ ఏదో నొక కేంద్రీయ శ్రామిక సంస్థకు అనుబంధ మగుటచేతనే తన యూనియన్ లేక తన కార్మిక సమాఖ్య ద్వారానే (**Through his Union, through his federation**) అతడు కేంద్రీయ శ్రామిక సంస్థలో కూడ అప్రత్యక్షంగానే కార్యకర్తగా ఉంటాడు. అంటే తన యూనియన్ లేక కార్మిక సమాఖ్యలో ప్రత్యక్ష కార్యకర్తగాను, కేంద్రీయ శ్రామిక సంస్థలో

అప్రత్యక్ష కార్యకర్తగాను ఉంటాడు. ఇదీ ఇతర కేంద్రీయ శ్రామిక సంస్థలలోని వ్యవస్థ. కాని మన విషయంలో ఈ వ్యవస్థ తారుమారుగా ఉన్నది. మనలోని ప్రతి యొక్క కార్యకర్తయు ప్రత్యక్షంగా, మౌలికంగానే భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తగా పని చేస్తూనే, తన యూనియన్ లేక కార్మిక సమాఖ్య భారతీయ మజ్దూర్ సంఘానికి అనుబంధ సంస్థ కావటం చేతనే అతడు భారతీయ మజ్దూర్ సంఘ ద్వారానే యూనియన్ లేక కార్మిక సమాఖ్యలో కూడ అప్రత్యక్షంగా కార్యకర్తగా రూపొందుతాడు. ఈ విధంగా పరిశీలించినపుడు ఇక్కడకు వచ్చిన కార్యకర్తలందరు - వారు ఏదో నొక యూనియన్ లేక కార్మిక సమాఖ్యలో ప్రత్యేక బాధ్యత వహించినవారే కావచ్చు, సాధారణ కార్య కర్తలే కావచ్చు-భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తలే. మన వ్యవస్థ ఇటువంటి దని మనందరకీ బాగా తెలుసు కదా! ఈ విధంగా భారతీయ మజ్దూర్ సంఘ్‌లోని ప్రతి కార్యకర్తకు భారతీయ మజ్దూర్ సంఘ్‌లోని వ్యవస్థ కారణంగా రెండు రకాల బాధ్యత లుంటాయి.

భారతీయ మజ్దూర్ సంఘ శ్రామికుల సంస్థ, ట్రేడ్ యూనియన్. ఇది జాతీయ శ్రామిక సంస్థ. ఇది పూర్తిగా శ్రామిక సంస్థ. అంటే ఈ సంస్థ శ్రామికులది. శ్రామికుల కోసం, శ్రామికులచే నిర్వహింప బడుచున్నది. ఇది రాజకీయాలకతీతంగా నున్న శ్రామిక సంస్థ.

**కార్యకర్తల రెండు రకాల బాధ్యతలు :**

జాతి శ్రేయస్సు అనే పరిధుల్లో శ్రామికుల సంక్షేమం కోసమే కృషి చేస్తున్న సంస్థగా రూపొందుటచేత భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తలకు రెండు రకాల బాధ్యతలుంటాయి.

జాతీయస్థాయిలో అది శ్రామికులకు ప్రాతినిధ్యం వహిస్తుంది. 'శ్రామికులు చెబుతున్నదేమిటి? వారికి కలిగే కష్ట నిష్ఠూరాలేవి? వారు కోరే దేమిటి? లక్ష్యా లేమిటి? అనే అంశాలను సమాజంతో చర్చిస్తుంది. జాతీయస్థాయిలో అది శ్రామికు లకు ప్రాతినిధ్యం వహిస్తే, శ్రామికుల సమక్షంలో జాతికి ప్రాతినిధ్యం వహిస్తూ, 'జాతి ఎదుర్కొంటున్న సమస్యలేవి? జాతీయ ఆకాంక్షలేవి? జాతీయ సంక్షే మానికి మనం ఏఏపనులు చేయాలి?' అని శ్రామికులకు వివరిస్తుంది. ఈ విధంగా

రెండు వైపులా ప్రాతినిధ్యం వహించటం అతి కష్ట సాధ్యమైన పని. ఎవరిమటుకు వారు తమ తమ యూనియన్ సభ్యుల కోసం శ్రామికుల ఆర్థికపరమైన కోర్కెలను పురస్కరించుకొని, వారిని రెచ్చగొట్టె ఉపన్యాసాలు దంచటం అతి సులభం. కాని, భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్త శ్రామికుల సమక్షంలో జాతీయ శ్రేయస్సునకు జాతీయస్థాయిలో శ్రామికుల సంక్షేమానికి ప్రాతినిధ్యం వహించటం చేత, వారి పని అతి కష్టసాధ్యమైనది. అందువలననే మాటిమాటికీ ఇటువంటి శిక్షణ వర్గలు అవసరమనిపిస్తుంది.

**ఏకాత్మ మానవతా సాక్షాత్కారము :**

భారతీయ మజ్దూర్ సంఘం భారతీయమైనదని మనకు తెలుసు. 'భారతీయ' అనేది కేవలం భౌగోళికమైనదే కాదు ఇది సాంస్కృతికమైనది ఒకే సంస్కృతి, ఒకే పరంపర. ఈ విధంగా పరిశీలిస్తే భారతీయ ఆలోచనా సరళి కూడా ఒక టున్నది. పాశ్చాత్యులకు భిన్నంగా దీనిలో ప్రముఖంగా ఉన్న ప్రత్యేకత ఏమంటే భారతీయ ఆలోచనా సరళి విడివిడి భాగాలుగా (**Compartmentalised**) లేదు. ఏకాత్మంగా (**Integrated**) ఉన్నది. ఇక్కడ సమగ్రంగా ఆలోచన జరుగుతుంది. అందువలన శ్రామికుల విషయంలో కూడ మనము పాక్షికంగా ఆలోచించము, మానవుని కార్యకలాపాల సమగ్రవికాసం కావాలన్నదే మన దేశంలో అతి ప్రాచీనకాలం నుండి సాగుతున్న ప్రయత్నం. మానవుడు శైశవ దశలో తనను గురించి తప్ప ఇతరులను గురించి ఏ మాత్రమూ పట్టించుకోడు. కాని, పెద్దవాడయ్యే కొద్ది (అతనిలో) తల్లిదండ్రులు, సోదరీ సోదరులు, బంధు మిత్రులు మొదలైన వారిపట్ల ఆత్మీయతను పెంపొందించుకొంటాడు. తన పరిసరాల జ్ఞానం, స్పృహ పెరిగేకొద్ది అతడు సమాజంతో ఆత్మీయతా భావాన్ని పొందుతాడు. స్పృహ ఇంకనూ పెరిగితే జాతి జీవనంతో సమరసమౌతాడు. ఇంకనూ సామాజిక స్పృహ పెరిగేకొలదీ, అతడు సంపూర్ణ మానవ సమాజంలో విలీనమై పోతాడు. మానసిక వికాసం ఇంకనూ వృద్ధి పొందితే ఒకనాడు చరాచర విశ్వంతో ఏకాత్మతను సాధిస్తాడు. అతనికి స్వగృహంలోనే ముల్లోకాలు దర్శనమిస్తాయి. 'అతడు ప్రపంచ పౌరుడు'గానే కాక 'యావిద్విశ్వ పౌరుడుగా' వైశ్వికి నాగరికుడుగా రూపొందుతాడు. ఈ విధంగా తన వ్యక్తిగత స్థాయినుండి, విశ్వగత స్థాయివరకు ప్రతి వ్యక్తి వికసించుట ఇటువంటి ఏకాత్మతా అను

భూతియే - 'ఏకాత్మ మానవ సందర్శనం' అంటారు - పండిత దీనదయాళ్ ఉపాధ్యాయగారు. మనకు సనాతనంగానుండి వస్తున్న అనుభూతి. అందువలన మన ఆలోచనలు విడివిడి భాగాలుగా ఉండవు.

**జాతి, శ్రామికుల ఏకాత్మత :**

జాతీయ, అంతర్జాతీయ దృక్పథాలలో మనం భేదాన్ని పాటించము. ఎందుకంటే మానవుని పరిసరాల పరిజ్ఞానము ఒకస్థాయి వరకు వికసిస్తే అది జాతీయం అవుతుంది. ఆ స్థాయిని దాటి ఇంకను వికసిస్తే అది అంతర్జాతీయం అవుతుంది. అతని పరిజ్ఞానపు స్థాయిలో ఒకటి తరువాత రెండవ మెట్టు మాత్రమే అది. అవి పరస్పర విరుద్ధములు ఏ మాత్రమూ కావు. కాని పాశ్చాత్య దేశాలు ఆ రెండింటినీ పరస్పరం వ్యతిరేకమైనవిగా భావిస్తాయి. ఎందుకంటె అవి ఇంకా శైశవావస్థలో నున్న జాతులే. పరిపక్వం జెందినవికావు. బాలురు ఎగిరి గంతులేయ వచ్చు. కాని, ప్రౌఢత్వం అనుభవం మీదనే వస్తుంది. మనం ఏ సమస్యనైనా విడి విడి భాగాలుగా చీలదీసి పరిశీలించము. సమగ్ర స్వరూపంతో ఆత్మీయతను పొంది, ఏ విషయాన్నైనా పరిశీలించే స్వభావం గల్గియుండటం చేత, సంపూర్ణ జాతిలో శ్రామికుల క్షేమం కూడ విహితమై యున్నదని మనము గ్రహించాము. జాతి సుదృఢంగా ఉన్నంతకాలం శ్రామికుడు పతనం కాడు. అలాగే శ్రామికుడు సుదృఢంగా ఉన్నంతకాలం జాతిని పతనం కానివ్వడు. అట్టి శ్రామికుడే పతనమైతే ఇక జాతిని సంరక్షించే వాడెవ్వడు? అనే సవాలు ఎదురౌతుంది. జాతి శ్రామికుల మధ్య పరస్పరం ఇంతటి ఆత్మీయత ఉంటుంది. భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్త ఈ విషయంలో శ్రద్ధతో పనిచేస్తాడు. ఈ కారణం చేత భారతీయ మజ్దూర్ సంఘ ఇతర శ్రామిక సంస్థలకంటే విభిన్నమైనది, విశిష్టస్వభావం కల్గియున్నది. భారతీయ మజ్దూర్ సంఘ ప్రత్యేకత లేమిటో చెప్పాల్సిన అవసరం ఇక్కడ లేదనుకొంటాను. తనకు తానుగా ఏర్పరచుకున్న ఒక విశిష్టమైన పద్ధతిలో ఇది ఒక అపూర్వమైన సంఘటనా కార్యము. ప్రస్తుతానికి ఈ మాత్రం చెప్పటం సరిపోతుందనుకొంటాను.

**ప్రారంభంలోని అనుమానాలు :**

ప్రారంభ దశలో భారతీయ మజ్దూర్ సంఘం భోపాల్ (మధ్యప్రదేశ్) లో ఏర్పడింది. ఈ కార్యం ప్రారంభించినపుడు ఇతర ట్రేడ్ యూనియన్లలోని

కొందరు చాల అసమ్మతిని ప్రకటించారు. ఆ రోజులలో అక్కడ కమ్యూనిస్టుల ప్రభావం ఉండేది. మన కమ్యూనిస్టు మిత్రులు మనతో 'అయ్యా, ఈ పని మీకు కుదిరేది కాదు, ఇది నిక్కరు తొడుక్కోవటం వంటిదికాదు! ఈ క్షేత్రాలన్నిటి గురించి ఎంతో అధ్యయనం చేయవలసి యుంటుంది. ఎన్నో విషయాలు నేర్చుకో వలసి యుంటాయి. మీ జీవితంలో ఎప్పుడూ ఇటువంటి పనిచేయనేలేదు కదా! అందువలన ఈ పని మీకు ఏ మాత్రమూ కుదరదు. దీనిలో మీరు సాధించేది ఒక్కటే- దొరికిందల్లా మీరు స్వాహా చేయరు, ఇతరులనూ తిననివ్వరు! మాదారికి ఆటంకాలు కల్పించడం మాత్రమే మీరు సాధించే ఘనకార్యం! ఈ దేశ ములో కమ్యూనిజం స్థిరపడడం మీకు ఇష్టంకాదు గదా! అందుచేతనే కమ్యూ నిష్టుల కార్య క్షేత్రములో - శ్రామిక రంగంలో, కార్మిక రంగంలో యూని యన్లను ఏర్పరచాలని సంకల్పించారు. వాస్తవంగా చూస్తే మీరు శ్రామిక రంగంలో సాధించేదే ఉండదు. పనిచేయగలిగే సామర్థ్యమే లేదు మీకు. కమ్యూ నిష్టులను పడగొట్టాలని మాత్రమే మీరీ గోల చేస్తున్నారు, అని అంటూండే వారు.

**కమ్యూనిజం - పచ్చి భౌతికతా సిద్ధాంతం :**

దానికి సమాధానంగా "అయ్యా! మీ ఆలోచన తప్పు. మేమైతే కమ్యూ నిజానికి వ్యతిరేకమే, కాని మేము వ్యతిరేకించేది ఆ కమ్యూనిజం పచ్చి భౌతిక వాద సిద్ధాంతం - మెటీరియలిస్టిక్ - అగుటచేతనే దీనితో మానవునికి శ్రేయస్సు కలుగదు. కాని కమ్యూనిస్టులను లేదా కమ్యూనిజాన్ని పడగొట్టడానికి మాత్రమే మా జీవితాలను ధారవోసేటంతటి గొప్ప కార్యాలుగా దానిని మేము భావించటం లేదు." అని మేము చెబుతూండే వారము.

**నూతన సాంకేతిక విజ్ఞానం ద్వారానే కమ్యూనిజం నిర్మూలనం :**

దీనికంతా మరో కారణం కూడా ఉన్నది. అదేమిటంటే కమ్యూనిజాన్ని నిర్మూలించటానికి మా అవసరమేలేదు. ఎన్నో విధాలుగా అది ఆత్మ వినాశనం చెందుతూనే ఉన్నది. పాశ్చాత్య దేశాల సాంకేతిక విజ్ఞానం వానిలో నొకటి. పాశ్చాత్య దేశాల సాంకేతిక విజ్ఞానం కమ్యూనిస్టులను కదలించి వేస్తున్నది. వర్త మాన కాలంలో ద్వితీయ పారిశ్రామిక విప్లవం చెలరేగుతున్నదనే విషయం మనం దరికీ తెలుసుగదా ! విప్లవానంతర సమాజం ఈవరకే కొన్ని పాశ్చాత్య దేశాలలో ఆవిర్భవిస్తోంది. క్రొత్త సాంకేతిక విధానము ఆ దేశాలలో స్థిరపడుచున్నది.

(ఈ సాంకేతిక విధానం విషయంలో మన దేశానికి సంబంధించినంతవరకు మన దృక్పథం ఏమిటి ? అనే చర్చ వేరు) పర్యవసానంగా పారిశ్రామిక సమాజం యొక్క కీలక స్థానంలో నున్న దాని స్థితిలో మార్పువచ్చింది. పాక్షికకౌశల్యం (**Semi - Skilled**) గల కార్మికులకు, ఇంజనీయర్లకు కీలక స్థానం వచ్చింది. నూతన సాంకేతిక విధానం రాగానే విద్యావంతులనబడే వైజ్ఞానికులును, సాంకేతిక నిపుణులును, కీలక స్థానం ఆక్రమించుకుంటారు. ఈనాడు నాలుగవ తరగతి ఉద్యోగులుగా నున్నవారి సంఖ్య చాల తగ్గిపోతోంది. అమెరికా సంయుక్తరాష్ట్రల (**U.S.A.**) విషయంలోనైతే క్రీ.శ. 2,000 నాటికి నీలి రంగు దుస్తులు తొడిగే కార్మికుల సంఖ్య పది శాతం కూడ ఉండదని భావిస్తున్నారు. కీలక స్థానంలో అలాంటి వర్గాలు చేరినపుడు, క్రొత్త సాంకేతిక విధానంలో కమ్యూనిస్టులు అనుకొనే 'వర్గాలు' చాల తక్కువ సంఖ్యలో నున్నపుడు, వారు ఎదురు చూస్తున్న 'విప్లవం' ఎవరి ఆధారంమీద వస్తుంది ? సామ్యవాదంలో విప్లవానికి అగ్రేసరులని పిలువబడే వారే మిగలనపుడు 'విప్లవం' ఎవరు తెస్తారు ? అంటే ఈ నూతన సాంకేతిక విజ్ఞానం సామ్యవాద వినాశనానికి దారి తీస్తున్నది, అన్నది సుస్పష్టం.

**సిద్ధాంత పరంగా లోపాలు :**

సిద్ధాంత పరంగా ఆలోచిస్తే మార్క్స్ సిద్ధాంతాన్ని ప్రగతి నిరోధకమనీ, ప్రతిక్రియాత్మకమని ప్రచారంచేస్తే 'అనార్కిజమ్'వంటి వాదాలుకూడ మార్క్స్ జీవిత కాలంలోనే తలెత్తాయి. 'అనార్కిజమ్' ప్రవక్త ప్రపోర్చిన్. అతడు కమ్యూనిజాన్ని ఒక బూజుపట్టిన వాదమని భావించేవాడు. మార్క్స్ విరోధుల మాట ప్రక్కన పెట్టివేసినా మార్క్స్ అనుయాయులలో కూడ కమ్యూనిజం సిద్ధాంత పరంగా అసంపూర్ణమైనదని భావించే వారుండటం గమనార్హం. మార్క్స్‌ను కనీసం మన దేశంలో క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న వారిలో ఎమ్. ఎన్. రాయ్‌ని మించిన మేధావు లెవ్వరూ లేరు. లెనిన్ సహచరునిగా కృషి చేసిన ఎమ్. ఎన్. రాయ్‌కూడ మార్క్స్‌వాదం అసంపూర్ణమైనదని ప్రకటించాడు. ఎన్నో అంశాలలో ఇది అసంపూర్ణంగా ఉన్నది. మార్క్స్ 'డయలెక్టిజం ఆఫ్ మ్యాటర్'ను మాత్రమే వివరించాడు. కాని ప్రపంచంలో జరిగే పరిణామాలకు అదొక్కటే మౌలికకారణం కాజాలదు. దానితోబాటు 'డైనమిజం ఆఫ్ ఐడియాస్'ను కూడ జోడించాలి. అని, ఎమ్. ఎన్. రాయ్ అభిప్రాయం. మార్క్స్ కంటే ఎంతో ముందంజ వేసి,

ఇలాంటి వెన్నో అంశాలను ఎమ్ ఎన్. రాయ్ ఎత్తి చూపాడు. ఈనాడైతే మార్క్స్ వాదాన్ని తృణీకరించి, మార్క్స్‌ను అసమగ్రమైన ఆలోచనాపరునిగా నిరూపించే గొప్ప మేధావులు, తాత్వికులెందరో పాశ్చాత్యదేశాలలోనే ముందుకు వస్తున్నారు. హెర్బర్ట్ మార్కిన్, ఆర్.డి. ల్యాంబ్, షాప్రించ్‌ఎనోస్, కాత్రే, ఇంకను ఎందరో మేధావులు మార్క్స్ వాదం ప్రారంభంలో బాగానే ఉన్నట్లుగా తోచింది. కాని ఇప్పుడది అసంపూర్ణంగా ఉన్నట్లుగా బోధపడిందనీ, ఇంతకంటే ఎంతోముందుకు వెళ్ళాల్సిన అవసరముందనీ స్పష్టంగా చాటారు.

**భారత దేశంలో కూడా కమ్యూన్ల పథకం :**

మన దేశానికి సంబంధించినంతవరకు మాత్రం 'కమ్యూన్లు' అంటేనే బిత్తరపోయి దూరంగా మడి గట్టుకోవలసిన అవసరం ఏ మాత్రమూ లేదు. 'కమ్యూన్ల' పథకాన్ని మార్క్స్ ప్రప్రథమంగా సరిగా వివరించిన రోజుల్లోనే (అక్కడి ఆలోచనా సరళి మన దేశానికి చేరకముందే) మార్క్స్ వ్రాసిన "దాస్ క్యాపిటల్" ప్రథమ ఖండం (క్రీ.శ. 1867)లో ఆలోచన వెల్లడింపబడిన కాలం లోనే మన దేశంలో కూడ ఒక పుస్తకం ప్రకాశితమైంది. దానిలో మార్క్స్ చెప్పినట్లుగానే కమ్యూన్ల పథకం వివరింపబడింది ఆ రెండింటిలో భేదం ఒక్కటే. మార్క్స్ చెప్పిన కమ్యూన్లకు భౌతికతావాదం ఆధారమైతే, భారతదేశంలోని కమ్యూన్లకు భగవంతుని పట్ల శ్రద్ధాభక్తులే ఆధారం. కాని ఒకే రకమైన ఆలోచనా సరళి, భారత పాశ్చాత్య దేశాలలో ఒకే కాలంలో ప్రకటింపబడటం ఆశ్చర్యకరం! భారత దేశంలోని ఆ గ్రంథకర్త విష్ణు బాబా బ్రహ్మచారి. అతని పుస్తకం (క్రీ.శ. 1867) లో ప్రకాశితమైంది. ఒకరిని మరియొకరు అనుకరించారు అని చెప్పడానికే వీలులేదు. ఎందుకంటే అప్పటిదాకా మార్క్స్‌వాదం అంటూ ఏదీ మన దేశంలో ప్రవేశించనే లేదు. కమ్యూన్ల పథకంతో మనకేమీ వైరం లేదు. ఉన్నదంతా భౌతికతావాదంతోనే. భౌతికతావాదంతో మనకున్న విరోధం సహేతుకమైనదే నని పాశ్చాత్యుల అనుభవం కూడ దృఢ పరచుచున్నది.

**క్రియా రూపంలో కమ్యూనిజం :**

కమ్యూనిస్టుల ఆధీనంలో నున్న ఏ దేశము కూడ కమ్యూనిజం మౌలిక సిద్ధాంతాలను అమలు చేయజాలక పోయింది. ఒకే పరిపాలనలోని కమ్యూనిస్టు

ప్రపంచాన్ని నిర్మించాలనే స్వప్నం ప్రమాద భరితమని ఋజువయినది. తమ తమ జాతీయ స్వార్థాలనూ పురస్కరించుకొని, ప్రతి కమ్యూనిస్టు దేశము ఇతర కమ్యూనిస్టు దేశాలతో కలహాలు పెంచుకొంటున్నది. ప్రతి కమ్యూనిస్టు దేశంలోను దీన, దళిత శ్రామికుల పేరుతో నిరంకుశత్వాన్ని ప్రజలపై రుద్దుతూ, వారినే అణగద్రొక్కడానికి ఏ విధంగా నానాగడ్డి కరుస్తున్నదీ చెప్పాలంటే పోలండు వ్యవహారమే మనకు ప్రత్యక్ష సాక్ష్యం. ఇంకను మరెన్నో ఉదాహరణలు ఉన్నాయి. యూరో - కమ్యూనిజం కూడ ఒక ఉదాహరణమే.

**కమ్యూనిస్టు ప్రపంచం వెలుపల కమ్యూన్ల ప్రయోగం :**

ఇంతేకాదు-నేటి కమ్యూనిష్టు ప్రపంచం వెలుపల కూడ పూర్వంలో కమ్యూనిష్టుల ప్రయోగాలు జరిగాయి. ఈనాడూ జరుగుతూన్నాయి. ఆ ప్రయోగాలలో సాఫల్యం దక్కేదీ, లేనిదీ ఆలోచిస్తే, కేవలం ఆర్థిక, భౌతిక ఆధారంపై వారెవ్వరూ సాఫల్యం పొందడం లేదని స్పష్టంగా తెలుస్తుంది. క్రీ.శ. 1562 నుండియే ఇంగ్లాండులో కమ్యూనిష్టుల కొన్ని ప్రయోగాలు జరుగుతున్నాయి. ఈనాడు అక్కడ సుమారు ఒక వంద కమ్యూన్లు ఉన్నాయి. అమెరికాలో రెండు వేల కమ్యూన్లు ఉన్నాయి. వానిలో సరాసరి సంఖ్య 5 నుండి 15 వరకు ఉంది. ఆర్థిక, భౌతిక ప్రయోజనాల నాశించి మాత్రమే ఏర్పడిన ఈ కమ్యూన్లు ఐదు, ఆరు సంవత్సారల కంటే ఎక్కువ కాలం నిలబడవని అక్కడి వారి అనుభవం. స్వార్థప్రయోజనాల వలన ఆ కమ్యూన్ల మధ్య వైషమ్యాలు కలహాలు జరిగి, కమ్యూన్లు నశిస్తున్నాయి. గ్రేట్ బ్రిటన్‌లో నాలుగు శతాబ్దాల తరబడి, అమెరికాలో ఇప్పుడిప్పుడే వస్తూన్న అనుభవం ఇది. ఆర్థిక, భౌతిక ప్రయోజనాల కోసమే ఏర్పడిన కమ్యూన్లలోని నలుగురు కలిసి కట్టుగా ఉండజాలరు. కులాలు; వర్గాల పేరిటకూడ ఎన్నో కమ్యూన్లను నడిపారు. 'హుక్కారైట్' సంప్రదాయం, 'చైన్‌లైజ్' సంప్రదాయం, 'మార్మల్' సంప్రదాయం మొదలగునవి ఇలాంటివే. ఈ వర్గాలు ఎక్కువ కాలం జీవించాయి. ఎందుకంటే అవి భౌతిక, ఆర్థిక ప్రయోజనాలపై మాత్రమే ఆధారపడి యుండ లేదు. అన్నింటి కంటే ఎక్కువ కాలం నుండి నడుస్తున్న కమ్యూను ఇజ్రాయిల్ దేశంలో నున్నది. కాని అది కమ్యూనిష్టు వ్యతిరేక దేశం. అక్కడి కమ్యూన్లను 'నిమ్ ఝుమ్' లంటారు. అవి పటిష్ఠమైన జాతీయ పునాదుల మీద చిరకాలంగా సక్రమంగా పని చేస్తున్నాయి.

దీని వలన భౌతిక, ఆర్థిక ప్రయోజనాలతో మాత్రమే ముడిపడిన కమ్యూనిస్టు సరిగ్గా పని చేయ జాలవని సుస్పష్టం అవుతుంది. అందు చేతనే ఏ కమ్యూనిస్టు దేశంలోను కమ్యూనిజం సార్థకం కాలేదు.

**'ఉన్నది' అనికాదు-'అయిపోయినది'గా మారింది :**

కుటుంబ వ్యవస్థనే మార్చివేస్తామని రష్యా, చైనాలు ప్రకటించాయి. కాని, ఆ దేశాలలో కూడా కుటుంబ వ్యవస్థ మళ్ళీ స్థిరపడుతూంది. 'కమ్యూన్' నశించి పోయినది. ఈ విధంగా చైతన్య వాదానికి గల స్థాయి, మార్క్స్ శిష్యుల ఆలోచనా సరళి, కమ్యూనిస్టు దేశాలలోని అనుభవాలు-ఇవన్నీ పరిశీలించి నట్లయితే కమ్యూనిజం పేరిట చలామణి అవుతున్న ఆలోచనా విధానాన్ని రూపు మాపడానికి మీరు, మేము వారివైపు వేలెత్తి చూపాల్సిన అవసరం కూడ లేదు. అది తనంతట తానే నీరసించి పోతున్నది. ఇప్పుడంతా 'ఉన్నది' అని కాదు, 'అయిపోయినది'గా మారిపోతున్నది. అందుచేతనే భోపాల్ లోని కమ్యూనిస్టు మిత్రులతో-"అతి త్వరలోనే మీ 'ఇజం, (-ism), 'వాజం' (-wasm)గా మారిపోతుంది. మిమ్మలను రూపు మాపడానికి మా జీవితాలను అంకితం చేస్తే అత్యధికమైన మూల్యాన్ని యిచ్చినట్లవుతుంది, వాస్తవానికి అంత ఎక్కువ మూల్యాన్ని యివ్వదలచుకోలేద"ని నిష్కర్షగా చెప్పి వేశాము.

**జాతీయాభివృద్ధియే మా లక్ష్యం :**

కమ్యూనిజాన్ని వ్యతిరేకించమే మన ఉద్దేశంకాదు. మన ఉద్దేశం-ఈ జాతిని నిర్మించడం, పరమ వైభవ స్థితికి చేర్చడం. జాతీయ వాదులమని మనం చెప్పుకొన్నప్పుడు-జాతీయాభివృద్ధినే మనం కోరుతామని చాటినపుడు-ఎవరో 5, 10 మంది సంపన్నుల అభివృద్ధిని కాంక్షించడం మన జాతీయ వాదానికి గీటురాయి కాజాలదు. 5, 6 వందల మంది మంత్రుల సంక్షేమమే జాతీయాభి వృద్ధియని మన మెప్పుడూ ఒప్పుకోము. ఈ దేశంలోని కటిక దారిద్ర్యంతో నకనకలాడుతున్న బీద, బిక్కి జనం యొక్క అభివృద్ధియే వాస్తవానికి జాతీయాభి వృద్ధి అవుతుంది. జాతి, దేశం యొక్క అభివృద్ధికి ఇదే గీటురాయి. దీని ఆధారంగా చేసికొని, దేశం యావత్తును పరమ వైభవ స్థితికి ఏ విధంగా చేర్చాలి

అనే లక్ష్యంతోనే మేము కృషి చేస్తున్నామని, జాతీయ జీవనంలో వ్యూహ రచనకు కీలకమైన క్షేత్రంలో శ్రామిక వర్గం ఉండటం చేతనే మేము ఆ క్షేత్రంలో ప్రవేశించామనీ కమ్యూనిస్టులకు చెబుతూండే వారము.

మేము చెబుతూన్న ఈ స్పష్ట కథనాన్ని కమ్యూనిస్టులు సరిగా గ్రహించారో లేదో మాకు తెలియదు. గుఱ్ఱాల కండ్లకు ప్రక్కన గంతలు కట్టినపుడు అవి ప్రక్కలకు చూడజాలనట్లే, వారికి కూడ ఇతరుల ఆలోచనా విధానాన్ని ఆకళించుకొనే సామర్థ్యం చాల తక్కువ. దేశం యావత్తూ అభివృద్ధి జెందాలంటే శ్రామికులు కూడ అభివృద్ధి జెందాలి గదా! మరి, ఈ పనిని ఎవరు చేస్తారు?

**మనది జాగృతి పొందిన వారి సంఘటనము :**

క్రీ. శ. 1947 తర్వాత మనదేశంలో ఒక ఆలోచనా విధానం ప్రచారంలోకి వచ్చింది. మనకు స్వాతంత్ర్యం వచ్చింది కదా, ఇక మనం పరిశ్రమింపవలసిన అవసరం ఏ మాత్రమూ లేదు! స్వరాజ్యం సాధించాము కాబట్టి ఇక చేయాల్సిన కృషి అంతా ప్రభుత్వమే చేస్తుంది!! ప్రభుత్వం ద్వారానే అన్నీ సాధింపవచ్చు!!! కాని, ప్రపంచ చరిత్రలో, ఏ దేశంలో కూడ ప్రభుత్వం ద్వారానే జాతి దృఢంగా నిర్మాణం కాలేదనే విషయాన్ని ప్రజలు మరచి పోయారు. ఆ విధంగా ఇంతకు ముందెన్నడూ జరగలేదు. ఇప్పుడు కూడ జరిగే అవకాశం లేదు. అతి సామాన్య పౌరుడు కూడ ఏ దేశంలోనైతే జాగృతి కలిగి యుండడో జాగృతిని పొంది చైతన్య వంతులైన పౌరుల సంఘటనము శక్తి మంతంగా ఉండదో, అట్టి ప్రజా సంఘటనము ప్రభుత్వం సక్రమంగా పని చేసేట్లుగా ఎప్పటి దాకా ఒత్తిడి తీసికొని రాదో అంతవరకు కేవలం పరిపాలకుల ఆధారం మీదనే దేశం ఉద్ధరింపబడ జాలదు. ఇంతకు ముందెన్నడూ ఆ విధంగా జరగలేదు, ఇకిప్పుడూ జరగడం సాధ్యం కాదు. అంటే ప్రజలు జాగరూకతతో లేకుంటే, జాగృతి పొందిన పౌరుల సంఘటనం సాధింపజాలక పోతే, ప్రభుత్వానికి కళ్ళెం వేయ జాలమని దీనివలన స్పష్టమవుతుంది. దేశాన్ని దృఢంగా నిర్మించడంలో బాధ్యత పూర్తిగా ప్రభుత్వానిదే అని భావిస్తే మన హక్కులు కూడ ప్రభుత్వానికే అప్పగించాల్సి వస్తుంది మరి !

హక్కులు కావాలి అంటూనే, బాధ్యతలను విస్మరించడం పరస్పర వ్యతిరేకం. మానవ హక్కులు ఉండాలంటే, మానవ బాధ్యతలు, కర్తవ్యం కూడ ఒప్పుకోవాలి, పౌర బాధ్యతలను కూడ స్వీకరించాలి. అందువలన బాధ్యత లన్నీ ప్రభుత్వానికే అప్పగించినపుడు అదే సాకుగా తీసికొని, ప్రభుత్వం నిరంకుశమైతే ఇక ప్రభుత్వాన్ని నిందించే అధికారం మన కుండదు. ప్రజలు జాగరూకతతో లేనప్పుడు, ప్రజా సంఘటనములు శక్తిమంతంగా లేనప్పుడు, అట్టి పరిస్థితులలో ప్రభుత్వాన్ని నడిపే వ్యక్తి లేక పరిపాలకులు నిరంకుశంగా ప్రవర్తించడం పూర్తిగా సహజమే. అంటే అధికార శక్తి నైతిక పతనం కలిగిస్తుంది. నిరంకుశ శక్తి పూర్తిగా నైతిక భ్రష్టత్వం కలిగిస్తుంది. అనే ఆంగ్ల సూక్తి సార్థక మవుతుందన్న మాట! ఈ విధంగా పరిశీలించినపుడు జాతి సముద్ధరణకు జాతిలో చైతన్యం అవసరం. అతి సామాన్య పౌరుని స్థాయి కూడ అభివృద్ధి జెందుట అత్యావసరం అనటం సహేతుకమైనదని బోధపడుతుంది. తమ తమ శ్రామిక సంస్థల సభ్యుల శ్రేయస్సును సంరక్షించడానికి వారి సంఘటిత శక్తిని జాతి పునరుత్థాన కార్యక్రమంలో అంకితం చేయడానికి, ప్రభుత్వం చేసే దేశ హిత కార్యాలలో చేదోడు వాదోడుగా మెలగుతూ, దేశ వ్యతిరేక కార్యాలను ఆపడానికి - ఈ మూడు అంశాల కార్యక్రమాన్ని ఆశయంగా పెట్టుకొని, అవసర మైతే ప్రభుత్వానికి ప్రత్యామ్నాయ శక్తి కేంద్రంగా జాగృతి పొందిన వ్యక్తుల ప్రజా సంఘటనమును రూపొందించ వలసిన అవసర మెంతైనా యున్నది. ఈ దృక్పథం కల్గిన వారే భారతీయ మజ్దూర్ సంఘాన్ని స్థాపించారు. అంటే పైన జెప్పిన ప్రత్యామ్నాయ శక్తి కేంద్రంగా శ్రామిక క్షేత్రంలోనే గాక మిగతా అన్ని రంగాలలో కూడ ఏర్పడాలి. ఇలాంటి ప్రజా సంఘటనలు ఏర్పడినప్పుడే భారతదేశ స్వరూపం సక్రమంగా ఉండగలుగు తుంది.

సత్తాతురాణాం నదలఃన రాష్ట్రిః :

కొందరు 'అయ్యా! మేము ప్రభుత్వంతో ఏ సంబంధమూ పెట్టుకోము' అంటూంటారు. ప్రభుత్వం ద్వారా జాతి సుదృఢంగా నిర్మాణం కాకపోవచ్చు, కాని రాజకీయాలు అన్ని రంగాలను ప్రభావితం చేస్తాయి. కాబట్టి రాజకీయ నాయకుల ద్వారానే జాతి నిర్మాణం సాధ్యం అని వారి విశ్వాసం. కాని మన దేశం యొక్క మౌలిక స్వరూపం వేరు. మన దేశంలో రాజకీయాలకు హద్దులు,

ప్రాముఖ్యత నిర్దేశింప బడినాయి. రాజదండంపై, ధర్మదండం ఉంటేనే రాజదండం సక్రమంగా పనిచేయగలదని మనవారి నిశ్చితాభిప్రాయం.

నేడు మన దేశంలో రాజకీయ చైతన్యం చాల వచ్చిందని అంటారు. ఇంతకు పూర్వం మన దేశంలో ఎప్పుడూ లేనంత చైతన్యం వచ్చిందేమో! అందుకే అందరినీ ఒక రకమైన భయం ఆవరించుకొన్నది. హిందూ దేశంలోని 70 కోట్ల జనాభాలో 70 కోట్ల మందిలోనూ వచ్చిన నవ చైతన్యం కారణంగా యావన్మందీ ఒకేసారి ప్రధానమంత్రి కావాలనుకొన్నట్లుగా నా కనిపిస్తుంది. మొత్తము 70 కోట్లలో ఎవరికి ప్రధానమంత్రి పదవి వస్తుందని చెప్పినా వారు తమ సంసిద్ధతను ప్రకటిస్తారు. మన దేశంలో రాజకీయ చైతన్యం ఇంత తీవ్ర స్థాయికి చేరుకుంది అన్నమాట. కాని ఈ నవ చైతన్యం ఎలాంటిదంటే దీనివలన భారతీయ జీవన మూల్యాలు క్రుంగి పోతున్నాయి. జాతీయ చైతన్యం నశిస్తూంది. మా కాలేజీలో ఒక శ్లోకం చదివించారు. దానిలోని ఒక పాదం ''అర్థాతురాణాం న పితా న బంధుః'' అని ఉండేది. అంటే ''డబ్బు సంపాదనయే ముఖ్యంగా పెట్టుకొన్నవానికి తండ్రి కనిపించడు, సోదరుడూ కనిపించడు" అన్న మాట. మరో పాదం ''కామా తురాణాం న భయం న లజ్జా" అంటే కామాతురులకు సిగ్గు, బిడియం ఏవీ ఉండవు. అలాగే ఈ రోజుల్లో ''సత్తా తురాణాం న దలః న రాష్ట్రః" అంటే అధికారం కోసం ప్రాకులాడే వారికి తమ సంస్థపై అభిమానము ఉండదు, దేశభక్తి అసలే ఉండదు. అని చెప్పాల్సి వస్తుంది. దిన పత్రికలే దీనికి ప్రబల సాక్ష్యం. మరి ఇలాంటి ప్రజల ద్వారా జాతీయాభివృద్ధి లాంటి పవిత్ర కార్యం సాధ్యమా?

ప్రతి సామాన్య పౌరుడు కూడ చైతన్యవంతుడై యుండి, జాతీయ చైతన్యం ఉత్తమ స్థాయిలోను, నవ చైతన్యంతో పొంగుతూన్న దేశభక్తుల ప్రజా సంఘటనం శక్తిమంతంగాను ఉండి, అట్టి ప్రజా సంఘటనం ప్రభుత్వానికి ప్రత్యామ్నాయ శక్తిగా రూపొందినప్పుడు రాజకీయ కార్యకర్తల ద్వారా కూడ దేశహిత కార్యాలను చేయించగల్గుతామనటం కూడ వాస్తవమే. కాని పైన వివరించిన అంశాలేవీ లేనప్పుడు కూడ రాజకీయ రంగం ద్వారానే అన్ని పనులు సాధిస్తామను కోవటం ఎంత ప్రమాదకరమో నేడు మన అనుభవంలోకి వచ్చింది గదా!

### పరస్పరం హితకరంగా సహకారము :

అందుచేతనే సోమరితనం వలన ప్రభుత్వాన్ని మాత్రమే తమ పనులకు సాధనంగా నమ్ముకొన్నవారు, లేక తమ కార్యసాధనకు దగ్గరి దారిగా రాజకీయాలను వాడుకొనే వారి దుష్ప్రభావాలకు లోనుగాకుండా, శాస్త్రీయ పునాదులపై పని చేయాలని సంకల్పించాము. శాస్త్రీయ పునాదుల మీద అంటే ప్రతి వ్యక్తిలోను దేశభక్తిని రగుల్కొల్పి ఉత్సాహవంతునిగా, కార్యతత్పరునిగా చేయడం. మనది శ్రామిక రంగం. అందువలన ప్రతి శ్రామికునిలోను దేశభక్తిని రగుల్కొల్పి, జాతి పట్ల తన కర్తవ్యాన్ని సాక్షాత్కరింపజేసికొనునట్లుగా అతనిని ఉద్బోధించుటే మన బాధ్యత. దానితో బాటే ప్రతి శామికుని హక్కులను కాపాడుతూ, అతని శక్తి సామర్థ్యాలను జాతి నిర్మాణానికి అంకితం చేయించడం, ప్రభుత్వంతో పరస్పసరం హితకరంగా సహకరించడం-ఇవి మన కార్య ప్రణాళికకు ఆధార స్తంభాలు. పరస్పర హితకరంగా సహకరించడం అంటే జాతి క్షేమము, శ్రామికుల క్షేమం కోసం ప్రభుత్వం కృషి చేస్తే దానితో సహకరించడం అని అర్థము. ఒక వేళ ప్రభుత్వమే జాతిక్షేమానికి, శ్రామికుల హక్కులకు వ్యతిరేకంగా కాలు దువ్వితే, దానిని ప్రతిఘటించడం అని కూడ దీని అర్థము. ఇటువంటి సహకార సిద్ధాంతంపైననే ప్రజాసంఘటనమును నిర్మించడం, ఇలాగే అన్ని రంగాలలోను వివిధ ప్రజా సంఘటనలను నిర్మించడం జాతి నిర్మాణానికి అత్యవసరము.

### 'లేమి'లో కూడ పురోగతి :

ఈ విధంగా జాతి మందిర నిర్మాణానికి పునాదులు వేయాలి. ఇలాంటి పునాదులు, ఆలోచనా సరళిని నెలకొల్పడానికే భారతీయ మజ్దూర్ సంఘం ఆవిర్భవించింది. ఎన్నో అటంకాలున్నప్పటికినీ భారతీయమజ్దూర్ సంఘ కార్యం విస్తరించింది. ఈ విస్తరణా కార్యంలో ఎన్నెన్ని ఆటంకాలు, సమస్యలు వచ్చాయో ఇప్పుడు చెప్పాల్సిన అవసరం లేదనుకొంటాను. రకరకాలుగా ప్రతికూల వాతావరణం ఉండేది. యజమానుల వ్యతిరేకత, ప్రభుత్వ విరోధం, సామాన్య పౌరుల ఔదాసీన్యము. మనదగ్గర ఏదీ లేదు-డబ్బులేదు, కార్యకర్తలు సిద్ధంగా లేరు. సహకరించే వారెవ్వరూలేరు. ఇలాంటి పరిస్థితులలో శూన్యంలో నుండి సృష్టిని సాధించినట్లుగా అయింది మన పని. కాని, దీనిలో ఒక్క విషయం

సరిగా గుర్తించుకోవాలి-మన ఆలోచనా విధానంలోని పవిత్రతయే ఈ అభివృద్ధికి కారణం, మన కార్యకర్తల శక్తిసామర్థ్యాలు మాత్రమే కాదు. సామర్థ్యం, తెలివి తేటలు మాత్రమే లెక్కవేస్తే, ఇతర శ్రామిక సంఘాలలో, సంస్థలలో మనకంటే గొప్ప మేధావులు, నేర్పరులు, యుక్తిపరులు, కుతంత్రాలను సమర్థవంతంగా నడపగల్గేవారు, కార్యతత్పరులు ఎందరో ఉన్నారు. మనమేమీ అమాయకులం కాము, కాని కుతంత్రాలు కూడ చేసేవారము కాము. మనం కుతంత్రాలు నెరప కూడదని, వక్రమార్గం త్రొక్కకూడదని, దగ్గరి వారుల కోసం ప్రాకులాడ కూడదని నిర్ణయించుకొన్నాం! కాని ఇతరుల కుతంత్రాలను సాగనిచ్చేటంతటి అమాయకులుగా కూడ ఉండదలచుకోలేదు. ఇతరుల కుతంత్రాలను సాగనివ్వము. కాని మనం కూడ కుతంత్రాలకు పథకం వేయము. కాబట్టి మనకంటే గొప్ప మేధావులు, కార్యతత్పరులు, కుతంత్రాలు పన్నేవారు ఇతర సంస్థలలో అత్యధికంగా ఉన్నప్పటికినీ భారతీయ మజ్దూర్ సంఘం ఇంతగా అభివృద్ధి జెందిందంటే దానికి కారణం మన శక్తిసామర్థ్యాలు మాత్రమే కాదుకాని, మన ఆలోచనా విధానం లోని శ్రేష్ఠత్వమే.

మన ఆలోచనా విధానం ఈ దేశం, ఇక్కడి సంస్కృతి నుండి ఆవిర్భ వించినవే. దీని ఆధారం మీదనే మనం ముందుకు సాగిపోతున్నాం. అందుచేతనే ఎన్నో అవరోధాలు (డబ్బులేదు, కార్యకర్తలు క్రొత్తవారు, అనుభవం లేనివారు, శ్రామిక క్షేత్రాన్ని గురించిన విజ్ఞానం కూడ తక్కువ) ఉన్నప్పటికీ, మూడు పువ్వులు, ఆరు కాయలుగా భారతీయ మజ్దూర్ సంఘం అభివృద్ధిని సాధిస్తూంది. ఎంతో ప్రగతిని సాధించడం చేత ప్రభుత్వం కూడ దీనిని ప్రముఖ శ్రామిక సంఘంగా గుర్తించింది. ఈ మారినపరిస్థితులలో ఎలాంటి ఎలాంటి క్రొత్త బాధ్యత లను మనం స్వీకరింపవలసి వస్తుందో, క్రొత్త సమస్యలను ఎదుర్కోవలసి వస్తుందో, ఎలాంటి క్రొత్త జాగ్రత్తలు వహించాల్సి వస్తుందో మనం వివరాలతో చర్చించాల్సిన అవసరం ఏర్పడింది.

# 2. శ్రామికుల ఉద్యమానికి ఒక క్రొత్త దృక్పథం

భారతీయ మజ్దూర్ సంఘ్ పనిచేసే తీరులో కొన్ని ప్రత్యేకత లున్నాయి. వానిలో ఒకటి - ఏ మంచి పనినైనా తొందరగా చేయకపోవటం! మన పూర్వీకుల అభిప్రాయం కూడా ఇదే. నేను మరో విషయం గూడ చెప్పదలిచాను - ఏ మంచి పనినీ తొందరగా చేయకపోవటం, ఎంత చిన్న పనినైనా సరే క్రొత్త కార్యకర్త ఊపిరాడక పోయేంతటివరకు అదే పనిని చేస్తూండవలసిన పరిస్థితిని కల్పించడం కూడ మన ప్రత్యేకతయే. అతనికి చిరాకు గలగాలి అంతే! దీనికి సంబంధించి ఎక్కువగా కాదు, ఒక చిన్న ఉదాహరణం ఇస్తాను.

మజ్దూర్ సంఘం ప్రారంభం నుండియే వేర్వేరు ప్రాంతాల నుండి దీనిలోనికి వచ్చారు గదా! ఏదైనా కార్యక్రమంలో 'వందేమాతరం' గీతం ఆలాపిస్తూంటే, మనమెలా నిలబడి యుండాలో మనందరికీ తెలుసు. జాతీయ గీతం పాడునపుడు 'దక్ష' స్థితిలో నుండాలని మనసులో అనిపించేది. ఆ రోజుల్లో మజ్దూర్ సంఘ కార్యం ఎక్కువ విస్తరించి యుండలేదు. అందరూ 'దక్ష'లో నిలబడి యుండాలని చెప్పినా కూడ ఎవరైనా వ్యతిరేకిస్తారేమో అనే పరిస్థితి కూడ అప్పట్లో లేదు. కాని, శ్రద్ధా భక్తులు ఉండటం ఎంత అవసరమో, ఆలవాటు కలిగి యుండటం కూడ అంత అవసరమే కదా! అందుచేత జాతీయగీతం పాడునపుడు అందరినీ దక్షలో ఉండాలని చెప్పాలా? వద్దా? అనే మీ మాంసలో పడ్డాము. చివరకు అలాంటి సమయంలో దక్షలో ఉండాలని చెప్పడానికి పదకొండు సంవత్సరాలు పట్టాయి - అంటే ఇంత చిన్న విషయానికే పదకొండేండ్లు ఆయితే, దానికంటె పెద్ద పనులు చేయడానికి ఎన్ని సంవత్సరాలు కావాలి? అంటే పని ఏమీ జరగదని కాదు. పని మెల్లమెల్లగా జరుగుతూంటుంది - ఒక్కసారిగా కాదు.

'శ్రామికీకరణము' అను శబ్ద ప్రయోగము :

భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తలకు 'శ్రామికీకరణము' అనేమాట చిరస్మరణీయము. పాశ్చాత్య దేశాలలో ఈ మాటే లేదు. అందుకని అది సరి క్రొత్త మాట యని భావించవచ్చును. కమ్యునిష్టులకు ఏ మాటనైనా అరువు తెచ్చుకొనే సౌకర్యం ఉన్నది. వారి పదకోశంలో ఈ మాట లేదు. కాని ఈ మాటను ప్రచారంలోకి తీసికొని రావాలని అనుకొన్న తర్వాత, మాటను ప్రయోగించడానికి ముందుగా, ఆ మాట ఎలా ఉందని వారి నడిగాము. బయటి ప్రపంచంపై ఈ మాట ప్రభావం ఏ ముంటుందని కూడ అడిగాము. కొన్ని రోజుల తర్వాత బొంబాయిలో ఒక కార్యక్రమం జరిగింది. దానిలో ఎస్.జి. గోరే, మధుదండావతేలతో బాటు నా ఉపన్యాసం కూడ ఉండినది. నేను మన కార్యకర్తలతో "మీరు ముంగిట కూర్చొని యుంటారు గదా! ఈరోజు నా ఉపన్యాసంలో 'శ్రామికీకరణము' అనే మాటను ప్రయోగించాలనుకొన్నాను. "ఈ మాట వినగానే గోరే, మధు దండావతేల ముఖాలపై ఎలాంటి ప్రభావం ఉత్పత్తి పడుతుందో మీరే గమనించి, నాకు తర్వాత చెప్పాలి" అని కోరాను. అప్పటికి ఆ మాటను ప్రయోగించే విషయమై చర్చిస్తూ ఏడు సంవత్సరాలు గడిపాము. ఆ కార్యక్రమం తర్వాత మన కార్యకర్తలు నన్ను కలిసి 'ఆ మాట వింటూనే గోరే, మధు దండావతేలు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డార'ని చెప్పారు. ఆ మాటను తప్పక ప్రచారంలోకి తీసుకొని రావాలని అప్పుడు నిర్ణయమయింది. అంటే ఒక క్రొత్త పదాన్ని ఒప్పుకొన్న తర్వాత ఏడు సంవత్సరాలకు దాని ప్రయోగానికి ఏర్పాట్లు జరిగాయి. మంచి పనికి ఎక్కువ కాలం వేచియుండి, లక్ష్యాన్ని స్వీకరించే మానసిక సంసిద్ధత పూర్తికావాలని అర్థం.

ఇలాంటిదే మనం మరో పనిని కూడ చేస్తున్నాము. వాస్తవానికి ఆ పని కింకా పునాదులే వేస్తున్నామని చెప్పవచ్చును. కాని ఇంతవరకు అలా పునాదులు వేస్తున్నామని కూడ చెప్పలేదు. కార్యకర్తల సమక్షంలో ఎన్నో విషయాలు వస్తున్నాయి. వాటి నన్నిటినీ కార్యకర్తలు ఆకళింపు చేసుకొంటున్నారు కూడ. ఇంతవరకు మన పెద్దలు శ్రామిక రంగంలో బలవంతాన తీసికొని రాని అంశాలు కూడ కొన్ని వాటిల్లో ఉన్నాయి.

**బోనస్‌పై క్రొత్త అభిప్రాయం :**

బోనస్‌ను గురించి మొట్ట మొదటిసారిగా మనం ప్రవేశపెట్టిన దృక్పథం వినూత్నమైనది. బోనస్ అంటే ఆపుదలచేసి యిచ్చిన జీతమే అని మనం విశదీకరించినప్పుడు బ్యాంకు, తంతి తపాలా వంటి ప్రభుత్వ శాఖలలో ఉద్యోగులు తమకు కూడ అట్టి బోనస్ పథకం ఎలా వర్తిస్తుంది అని ప్రశ్నించారు. అంటే బోనస్ పొందవలసిన వారికే అనుమానం వచ్చింది అన్నమాట. కమ్యూనిస్టులైతే ప్రభుత్వోద్యోగులకు కూడ బోనస్ పథకం వర్తిస్తుందని నిన్న మొన్నటి కుర్రాళ్ళు అంటున్నారయ్యా ఇది ఎలా సాధ్యం? అంటూ ఎగతాళి చేశారు. కాని ప్రభుత్వోద్యోగులకు కూడ నేడు బోనస్ పథకం లభిస్తూంది అన్నది మనం కళ్ళారా చూస్తున్నదే !

**జీతాలు పెంచడం ధరల పెరుగుదలకు కారణం కాదు :**

ప్రభుత్వమూ, యాజమాన్యమూ శ్రామికులకు వ్యతిరేకంగా రకరకాలుగా ప్రచారం చేస్తూంటాయని మనకు తెలుసును. శ్రామికులకు విరుద్ధంగా ప్రజలను రెచ్చగొడతాయి. ఇంతవరకు శ్రామికులు దీనిని తగిన విధంగా ఎదుర్కొనలేదు. ఉదాహరణకు చెప్పాలంటే, ఉద్యోగులు ఎక్కువ జీతం కోరడాన్నిబట్టే వాడకం దార్లు ఎక్కువ ధర పెట్టి కొనవలసివస్తుందని ప్రభుత్వం ప్రచారం చేస్తుంది. అంటే శ్రామికులు ఎక్కువ జీతం అడగటంవల్లనే సరుకుల ధరలు పెరుగుతున్నాయని ప్రభుత్వం చేసే వాదన. ఇతర ఏ శ్రామికుల సంస్థ కూడ ఇంతవరకు దానికి సహేతుకంగా సమాధానం యివ్వలేదు. భారతీయ మజ్దూర్ సంఘ్ మాత్రమే ప్రభుత్వానికొక సవాలు విసిరింది. "శ్రామికుల జీతం పెంచినందువలననే ధరలు పెరుగుతున్నా యంటారు గదా, మరి వారి జీతాలు పెంచనపుడు మాత్రం ధరలు స్థిరంగా ఉంచగలిగారా? మాకు జీతాలు పెంచినా, పెంచకపోయినా, ధరలు మాత్రం నిరంతరం పెరుగుతూనే ఉన్నాయి కదా! దీనివలన బోధపడేదేమిటంటే ధరల పెరుగుదలకు ఇంకను ఏవేవో కారణాలున్నాయి. వాటిని అదుపులో ఉంచండి మరి".

ఈ సందర్భంలో సిద్ధాంత రీత్యా ఇతరులెవ్వరూ చెప్పని అంశాన్ని వారి దృష్టికి తెచ్చాము.

"జీతాలు పెరిగినపుడల్లా సరుకుల ధరలు పెరగాలంటూ నియమం ఏమీ లేదు. ఉత్పత్తితో పెరుగుదలకంటె జీతాల పెరుగుదల ఎక్కువగా ఉన్నంతవరకే ధరల పెరుగుదలకు జీతాల పెరుగుదల కారణం అవుతుంది. పరిశ్రమలలో చాల వరకు ఉత్పత్తి పెరుగుదలకంటె జీతాల పెరుగుదల ఎక్కువగా ఉండటం లేదు".

కాబట్టి జీతాలు పెంచడంవల్లననే ధరలు పెరుగుతున్నాయనడం శుద్ధ తప్పు. ఈ యథార్థాన్ని సిద్ధాంత రీత్యా మనమే చెప్పగలిగాము, ఇంకెవ్వరూ చెప్పలేదు, పారిశ్రామిక సంఘాలేవి చెప్పలేదు! 'ఈ సిద్ధాంతాన్ని మీరెక్కడి నుండి పట్టుకొచ్చారు' అని కమ్యూనిస్టులు మా వెంటబడ్డారు. అందరితోనూ మనకి సంబంధాలున్నాయి. అందరూ అదే విషయాన్ని అడుగుతున్నారు. మనం మన దృక్పథాన్ని అందరి ముందుంచాలి. ఇతరులు చెప్పేదేమంటే, మన జీతభత్యాలు పెంచడం వలననే ఎక్కువ కరెన్సీ నోట్లు వాడకానికి విడుదల చేయవలసి వస్తున్నదని ప్రభుత్వం, యాజమాన్యాలు ఘోషిస్తున్న వాదన సరియైనదే కదా! నోట్లు ముమ్మరంగా విడుదలైనందున వాటి విలువ తగ్గిపోతున్నది. దానివలననే ధరలు పెరుగుతున్నాయి అని వారి వాదన. కాబట్టి "ఏదీ ఏమైనా సరే, మాకు మాత్రం జీతాలు పెంచాల్సిందే" అని పట్టు బట్టాలని కమ్యూనిస్టుల వాదన. దీనికి కారణాలు చూపించాల్సిన అవసరం ఉండదు. భారతీయ మజ్దూర్ సంఘ దృక్పథాన్ని ఒప్పించాలంటే కారణాలు సేకరించాలి, సుదీర్ఘంగా చర్చించాలి. సౌమనస్యంతో విశదీకరించాలి. ఈ తలనొప్పి అంతా ఎందుకు? అంటారు. కాని మనం ఆ దృక్పథం సరియైనది కాదని చెప్పాము. దేశభక్తులమైన మనం ప్రతి పనిని సంపూర్ణ బాధ్యతతో, పూర్వాపరాలు విచారించి చేయాలి. కోరికలను ఇతరుల ముందుచేటప్పుడు దానికిగల కారణాలను, దానిని పరిష్కరించే మార్గం కూడ చెబుతాము.

వాస్తవంగా ఉన్న పరిస్థితిని సమీక్షిస్తే చాల ఆశ్చర్యం కల్గుతుంది. మూడేండ్ల పూర్వమే "ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్" అను నొక స్వతంత్ర సంస్థ ఈ విషయంపై సర్వేక్షణ (సర్వే) జరిపింది. స్వతంత్రంగానే అధ్యయనం చేసి ధరల పెరుగుదలలో శ్రామికుల బాధ్యత అతి స్వల్పమని ఆ సంస్థ నిర్ధారించింది. అంతేగాక, ధరల పెరుగుదలకు ఈ దిగవ తెలిపిన మూడు అంశాలే ప్రముఖంగా బాధ్యత వహిస్తాయని కూడ నిర్ధారించింది.

1. లోటు పెట్టుబడిదారీ విధానము.

2. నల్లధనం.

3. అదుపుదప్పిన లాభం, అత్యధిక లాభశాతం, ఇతర కారణాలు లెక్క లోవికావు.

ఈ అంశాలన్నీ వెలుగులోనికి వచ్చిన తరువాత జాతీయ సమన్వయ సమితి (N. C. C.) వేదికపై కలసినపుడు చివరకు మన సిద్ధాంతమే నెగ్గిందని కమ్యూనిస్టులు మనలను అభినందించారు. దానికి సమాధానంగా వారితో మీ దారి వేరు. మా మార్గం దూరమైనదిగా కన్పించవచ్చు. కాని మీరు మీ పద్ధతిలో పని చేయండి. నేము మా పద్ధతిలో ముందుకు సాగిపోతాము" అని చెప్పాను.

**ఉత్పత్తికి, నష్టానికి వేర్వేరు కారణాలు :**

ఈ రోజులలో శ్రామికుల సమ్మెలవలన ఉత్పత్తి పడిపోతుందని సర్వ సామాన్యంగా ఒక దురభిప్రాయం అందరి మనసులలో చోటుచేసికొని యున్నది. ఈ ప్రచారం నిరంతరం సాగుతూండటం వలన కమ్యూనిస్టులు కూడ దీనిని యథార్థమని నమ్ముతున్నారు. కాని, ఉత్పత్తి లోపించినప్పటికినీ జీతాలు ఎందుకు పెంచకూడదు? అని వారు వాదించే విషయం వేరులెండి? మేము చెప్పేదేమంటే సమ్మెల వలన ఉత్పత్తిపై పడే ప్రభావం లెక్కలోకి రానే రాదు. ఉత్పత్తి ఆగి పోవడానికీ, తగ్గిపోవడానికీ ఎన్నెనో కారణా లుంటాయి. మరో విషయం కూడా గమనించాలి— ఒక వేళ సమ్మెల వలననే ఉత్పత్తి పడిపోతుందని భావిస్తే, ఒక సంవత్సరంలో సమ్మెలు జరిగినా ఉత్పత్తి అధికంగాను, మరో సంవత్సరంలో సమ్మె అసలు జరుగకపోయినా ఉత్పత్తి తక్కువగాను ఎందుకు జరుగుతుంది మరి? ఈ అన్ని అంశాల మీద ఒక నిశితమైన పరిశీలన (సర్వేక్షణ) జరిగింది. అందులో స్పష్టమైన దేమంటే చిరకాలంగా శ్రామికుల సమ్మె జరిగినా, ఉత్ప త్తిలో వచ్చిన లోటులో శ్రామికుల బాధ్యత చాల తక్కువ శాతంగా ఉంటుందని వాస్తవానికి పరిశ్రమలోని అస్తవ్యస్థ పరిస్థితులు, విద్యుచ్ఛక్తిలోపం, విద్యుచ్ఛక్తి సరఫరా పూర్తిగా ఆగిపోవటం, ప్రణాళికలోని లోపాలు, యాజమాన్యంలోని లోపాలు, ముడి సరుకు రావటంలో ఆలస్యం, యంత్రాలు చెడిపోవటం మున్నగు అంశాలవలననే ఉత్పత్తి పడిపోతుందని నిర్ధారించబడింది. అంతేకాని, శ్రామికుని

కారణంగా ఉత్పత్తి పడిపోతుందనుకోవటం పొరపాటు. ఇతరులెవ్వరూ గ్రహించక ముందే మనం ఈ విషయాన్ని ప్రకటించాము. తర్వాత జరిగిన సర్వేక్షణలో ఈ విషయం పూర్తిగా నిర్ధారించబడింది. ఇతరులందరూ అ పిమ్మటనే దీనిని ఒప్పుకోవలసి వచ్చింది.

**పరస్పరం కలతలు పెంచడమే ప్రభుత్వ విధానం :**

ఈనాడు మనం స్వతంత్రులం. ఆంగ్లేయులు వైదొలిగారు. మన ప్రభుత్వం ఏర్పడింది. ప్రభుత్వ విధానమేమిటో మనకు తెలుసును గదా! ప్రారంభం నుండియే మనం 'తెల్ల దొరలు వెళ్ళిపోయారు, నల్ల దొరలు వచ్చారు' అని అంటున్నాము. ఎందుకంటే యంత్రాంగం మునుపటిదే, విధానం అప్పటిదే, ఉద్యోగాలిచ్చే వారు కూడ ఆనాటివారే. మన రాజ్యాంగము తయారు చేస్తున్న రోజులలో దాని ఆకారాన్ని, బాహ్య స్వరూపాన్ని మార్చడంలో మన శక్తిని వృథా గానివ్వకూడదని నెహ్రూ చెబుతూండేవారు. మనం గ్రహించిన రాజ్యాంగపు స్వరూపం ఆంగ్లేయులదే. దానిలో మౌలికంగా మార్పులు చేయడానికి మన రాజ్యాంగ నిర్మాతలు ఇష్టపడలేదు. అందుచేత పారిశ్రామిక రంగంలోని పరస్పర సంబంధాల స్వరూపం కూడా అప్పటిదే అయింది. 'విభజించి పాలించు' అనే ఆంగ్లేయుల విధానమే భారత ప్రభుత్వంకూడ స్వీకరించి మన మధ్య చీటికిమాటికి కలతలు పెంచుతుంది. గ్రామాలలో రైతులు, వ్యవసాయ కూలీల మధ్య వైరం పెంచుతుంది. వ్యవసాయ కూలీలు మీ శత్రువులని రైతులకు చెబుతారు. నిన్నటి దాకా ఇచ్చినది తీసికొని పని చేసే కూలీలు ఈనాడు ఎక్కువ కూలీ అడుగుతున్నారు కదా! అంటారు. వ్యవసాయ కూలీలు, వినియోగదారులు, ప్రభుత్వ ఉద్యోగులతో, రైతులు తమ ధాన్యానికి ఎక్కువ ధరలు అడుగుతున్నారు, వారు మీకు శత్రువు'లని చెబుతారు. పంటలకయ్యే ఖర్చులకు కొంత లాభ శాతాన్ని కలిపి నిర్ధారించినదే ధాన్యానికి గిట్టుబాటు ధరగా ఉండాలని రైతులు కోరుకొంటున్నారు. వారి కోరిక బాధ్యతారహితమని ప్రభుత్వపరంగా వినవస్తున్నది. పంటలకయ్యే ఖర్చులపై ఇంకా కొంత లాభశాతాన్ని కలిపి ధాన్యం ధరలను నిర్ధారిస్తే నగరాలలో ఉండే శ్రామికులు ఎక్కువ ధర చెల్లించాల్సి వస్తుందని ప్రభుత్వం వారొక వింత వాదాన్ని లేవ దీశారు. నగరంలోని శ్రామికులకు ఇది సరియైన వాదమేనని తోస్తుంది. ఈవిధంగా నగర కార్మికులకు వ్యతిరేకంగా గ్రామాలలోని రైతులను, గ్రామీణ రైతులకు విరుద్ధంగా అక్కడి వ్యవసాయ కూలీలను ఎగ

దోస్తూన్నది ప్రభుత్వమే. ప్రతి యొక్కరికీ ఇతరులతో కలహాలు పెంచడమే ప్రభుత్వం అనుసరించే కుటిల నీతి.

భారతీయ కిసాన్ సంఘ్‌కు ఈ ప్రశ్న ఎదురైనప్పుడు మేము దానిని నిశితంగా పరిశీలించాము. వాస్తవంగా ఇది పరిస్థితుల కారణంగా వచ్చిన ప్రశ్న కాదని తెలిసింది. ఈ ప్రశ్న ప్రభుత్వం యొక్క తప్పుడు విధానాల వలన ఉత్పన్నమైన ప్రశ్నయని తేలింది. ప్రభుత్వం నిర్ధారించిన ప్రాముఖ్యతలే మనకు అనుకూలంగా లేవు. మన ప్రభుత్వం రష్యాను అనుకరిస్తూంది. రష్యాలో నున్న విధానము రష్యాకే అనుకూలంగా లేదని తేలిపోయిన విధానాలను మన ప్రభుత్వం గ్రుడ్డిగా అనుకరిస్తుంది. రష్యా భారీ పరిశ్రమలకు ప్రాముఖ్యత నిచ్చింది. వ్యవసాయానికి వారేమీ ప్రాముఖ్యత నివ్వలేదు. అందుచేత ఏటేటా రష్యాలో వ్యవసాయం విపరీతంగా దెబ్బ తింటూ ఉన్నది. అంతే కాదు, కమ్యూనిస్టు దేశమైన రష్యా ప్రతి సంవత్సరమూ తిండి గింజల కోసం క్యాపిటలిస్టు (పెట్టుబడిదారీ) దేశమైన అమెరికాను బ్రతిమిలాడవలసి వస్తున్నది. చివరకు సామాజిక రంగం నుండి ఎవరినైనా తొలగించాలనుకొంటే వారికి వ్యవసాయిక క్షేత్రం అప్పగిస్తే చాలు అనే సామెత కూడ రష్యాలో బలపడుతూంది.

వారనుసరించే ఈ విధానం ఏ మాత్రమూ సరియైనది కాదు. మనది కూడా వ్యవసాయం ప్రధానమైన దేశం. దేశపు సరిహద్దు ప్రాంతాలలోని బీద రైతులకోసం కేటాయించిన డబ్బు పెద్ద భూస్వాముల జేబులలో చేరుతున్నాయి. ప్రభుత్వ యంత్రాంగంలోని లోపాల కారణంగా బీద రైతులకు ధన సహాయం చేరడమే లేదు. కాబట్టి హిందూ దేశంలోని పరిస్థితులకు, వాస్తవికతకు అనుకూలంగా మాత్రమే మన విధానాన్ని ఏర్పరచు కోవాలి.

**ప్రాధాన్యతలను మార్చవలసిన అవసరము :**

భారీ పరిశ్రమలకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చి, వ్యవసాయాన్ని నిర్లక్ష్యం చేయడం సరియైనది కాదు. ఈ పద్ధతిని విడిచి పెట్టాలి. 36 సంవత్సరాల వరకు జరిగిన అసందర్భపు ఖర్చులో సగమైనా 6 సంవత్సరాల వరకు ప్రయోగాత్మకంగా చేసినా కూడ దేశం యొక్క స్వరూపమే మారిపోతుంది. దీనిని సవాలు చేసి ఘంటా పథంగా చెబుతున్నాము. అభివృద్ధి కోసం ప్రణాళికను తయారు

చేసి యివ్వాలి అది విద్యాలయ భవనమైనా, అప్రోచ్ రోడ్డు ఐనా సరే, దానికయ్యే ఖర్చంతా ప్రభుత్వ ఖజానా నుండియే రావాలి - ఇది శ్రేయోదాయక ప్రభుత్వం యొక్క కర్తవ్యం. ఇలాంటి పనులు చేసినంత మాత్రాన ఏదో దేశాన్ని ఉద్ధరించి నట్లు కాదు. చేసే పనులలో ప్రాధాన్యతలను మార్చడం అవసరం. భారీ పరిశ్రమలకు ఇచ్చిన ప్రాధాన్యతనే గ్రామాలకు యివ్వాలి వాటి కోసమయ్యే ఖర్చులో సగము 6 సంవత్సరాల వరకు వ్యవసాయానికి ఖర్చు చేయాలి. దానితో బాటు దేనికోసం ఖర్చు చేయవలసి ఉందో, అక్కడివరకు డబ్బు సరిగా చేరుతున్నదో లేదో కూడ సరిగా గమనించాలి. గ్రామాలలో పెద్దలుగా చలామణీ అయ్యేవారు, అధికారులు దానిని కాజేయకుండా జాగ్రత్త పడాలి. ఈ అన్నింటికంటె ముఖ్యమైనది ప్రభుత్వ విధానం మారటం. వ్యవసాయానికి అవసరమైన ఎరువులు, నీరు, మంచి విత్తనాలు, విద్యుచ్ఛక్తి మున్నగు సౌకర్యాలుండాలి. పరిశ్రమలకు ఇచ్చే, ధన సహాయం (సబ్సిడీ) వ్యవసాయదారులకు కూడా యివ్వాలి. వారికి కావలసినంత సహాయ మందజేస్తే (హెవీ సబ్సిడీ) రైతు పెట్టే ఖర్చు తగ్గుతుంది. వినియోగ దారునిపై ఎక్కువ బరువు పడకయే రైతునకు గిట్టుబాటు ధర లభిస్తుంది. దీనిపై కొంత లాభశాతాన్ని కలిపినా, వినియోగదారునిపై భారం పెంచకయే, చివరకు రైతుల జేబులలో కొంత డబ్బు పోగయితే, వారు తమ కవసరమైన వస్తువులను కొనగల్గుతారు కదా! దీనితో చిన్న చిన్న (కుటీర) పరిశ్రమలు ప్రారంభం అవుతాయి. అర్థాకలితో కొట్టు మిట్టాడు కొనటం దూరమవుతుంది. సంపాదన పెరుగుతుంది. కొనుగోలు శక్తి వృద్ధియగుతుంది. గ్రామీణ పారిశ్రామికీకరణము, శ్రామిక శక్తి వికసిస్తాయి. వివిధ రకాల పరిశ్రమలను స్థాపించ వచ్చును. పరిశ్రమలు స్థాపిస్తే అందరికి పని లభిస్తుంది. సామాన్య ప్రజల కొనుగోలు శక్తి వృద్ధియగుతుంది. భూమిపై ఒత్తిడి తగ్గుతుంది. గ్రామీణ పారిశ్రామికీకరణంతో బాటు ఏర్పడిన పరిణామాలు మనలను ఆర్థిక సమృద్ధి వైపు పురోగమింప జేస్తాయి. ఆరేండ్ల వరకు ఈ ప్రయోగాన్ని జేయాలని సవాలు చేస్తున్నాము. తరువాత వచ్చే సత్ఫలితాలను మీరే గమనించ వచ్చును.

ప్రభుత్వం మరొక విచిత్ర వాదన చేస్తుంది - రైతులకు గిట్టుబాటు ధర చెల్లిస్తే, వాడకందారులైన శ్రామికులపై మరింత భారం పడుతోందని, ఇది శుద్ధ

తప్పు అని మేము చాటినాము. రైతులకు గిట్టుబాటు ధర దొరికితే, కూలీలను వారు భారమని భావించరు. రైతులు కూలీలకు తగినంత కూలీని యివ్వక పోవచ్చును. కాని అది వారికి సాధ్యం గాక పోవటం వలననే తప్ప మరేదీ కారణం కాదు. అసలు రైతుల వద్ద తగినంత డబ్బు ఉంటేనే కదా, వారు తాము తలచినట్లుగా పొలాలలోని కూలీలకు తగినంతగా ఇవ్వగలగడానికి! ఈ విషయం ఎవ్వరూ గమనించనే లేదు. మనమే ఈ విషయాన్ని అధ్యయనం చేసి, ప్రభుత్వ విధానాన్ని తక్షణం మార్చాలని ప్రకటించాము. మన ప్రభుత్వానికి ఒక విధాన మంటూ ఏమున్నది?

ఆంగ్లేయుల కాలము నాటి బూజు పట్టిన విధానమే నేడు కూడా కొనసాగు చున్నది.

**ఆంగ్లేయుల పరిపాలనా వారసత్వం - మూడు అరిష్టాలు :**

ఇంగ్లాండు లోని పెట్టుబడి దారులను పోషించడానికే ఆంగ్లేయులు పరిపాలిస్తూండే వారు. ఆంగ్ల ప్రభుత్వం మన దేశమునుండి ముడి సరుకును చౌకగా ఇంగ్లాండుకు తరలించుకు పోయేది. అక్కడ దానిని యంత్రాల ద్వారా వస్తువులుగా మార్చి అధిక ధరలకు భారత దేశానికి సరఫరా చేస్తూండేది. దానిని అంతా భారతదేశం నుండి ముడి సరుకును చౌకగా తరలించుకొని పోవటం, ఇంగ్లాండులో చౌకగా తయారైన వస్తువులను ఎక్కువ ధరలకు మనకే అమ్మటం మాత్రమే. ముడి సరుకును సంగ్రహించే సాధనంగా మాత్రమే భారత దేశాన్ని వాడుకునే వారు. తమ సామ్రాజ్య వైభవాన్ని చూడడానికి మాత్రమే వారు రాజ్యం పరిపాలించ లేదు. ముడి సరుకులకు సాధనంగాను, తయారీ వస్తువులమ్మే బజారుగాను ఆంగ్లేయులు భారతదేశాన్ని వాడుకునే వారు. ఇదే విధానం నేడు కూడా కొనసాగుచున్నది. ఆంగ్ల సామ్రాజ్యం అంతమైనది. కాని పెట్టుబడిదారుల పారిశ్రామిక యజమానులకు లాభసాటిగా నున్న విధానమే ఇప్పటికినీ అమలులో ఉన్నది. పరిశ్రమలకు లాభం చేకూర్చడానికి 3 పద్ధతుల నవలంభించారు.

1. ముడి సరుకును చౌకగా సంపాదించుట.
2. ఉత్పత్తిని పెంచుట.

3. ఉత్పత్తి ధరను తగ్గించడానికై చౌక కూలీలు, అధిక ఉత్పత్తిని సాధిస్తూ, తయారైన సరుకును అత్యధిక ధరలకు అమ్మటం.

ఆంగ్లేయులు కూడా అదే పనిని చేస్తుండేవారు. ముడి సరుకును చౌకగా కొని, రైతులను ఎండబెట్టుట, ఉత్పత్తి ధరను తగ్గించడానికి శ్రామికులను పిండి వేయుట, చౌకగా తయారైన వస్తువులను అత్యధిక ధరలకు అమ్మి, వాడకం దార్లను దోచుకొనుట. పెట్టుబడిదారి విధానం ఈ మూడు అరిష్టాల దోపిళ్ళపై ఆధారపడి ఉంది. గతంలో ఆంగ్ల ప్రభుత్వం ఈ దోపిడీని చేస్తూంటే, నేడు మన ప్రభుత్వమే ఈ దోపిడీని కొనసాగిస్తున్నది. ప్రభుత్వం యొక్క ఆశీస్సులతో, దాని ఛత్ర ఛాయల్లోనే ఈ మూడు దోపిళ్ళూ నేడు కూడ నడుస్తూనే ఉన్నాయి. కాని, ఇలాంటి దోపిడీ జరుగుతుందని మనకు తెలియదు. మనలను దోపిడీ చేసే వారెవ్వరు ? అనే విషయం రైతులు, కూలీలు, వినియోగ దారులు అందరూ గ్రహింప గల్గిన నాడు, ప్రభుత్వమే అందరికీ వ్యతిరేకంగా కుతంత్రాలను పన్ను తుందని గ్రహించిన నాడు పరిస్థితి పూర్తిగా తారుమారు అవుతుంది. అందుచేతనే రైతును వ్యవసాయ కూలీలకు వ్యతిరేకంగాను, కూలీలను వ్యవసాయ దారులకు వ్యతిరేకంగాను, వాడకం దారును రైతులకు, కూలీలకు వ్యతిరేకంగాను రెచ్చగొట్ట డానికి చాలా రహస్యంగా కుతంత్రాలు సాగుచున్నాయి. పై మూడు వర్గాల వారు ఒకరిని మరొకరు నిందిస్తూంటారు. అందరూ తికమక పడుచున్నారు. ప్రభుత్వం లొట్టలు వేస్తూంటూంది. అందరినీ సరైన మార్గాన నడిపించడానికి ఎవరికీ తీరిక లేదు. ఆంగ్లేయుల కాలం నాటి పరిస్థితులే ఈనాడు కూడా ఉన్నాయని భారతీయ మజ్దూర్ సంఘ్ మాత్రమే చెప్పగల్గింది. ఈ కుతంత్రాన్ని ప్రప్రథమంగా బట్ట బయలు చేసినది భారతీయ మజ్దూర్ సంఘమే, ఈ విషయంలో ఇంతకంటే ఎక్కువగా వివరించి నేను చెప్పదలచుకోలేదు.

## సామ్రాజ్యవాద దేశాలచే క్రొత్తరకమైన దోపిడి :

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత మారిన పరిస్థితుల ప్రాబల్యం వలన ఆంగ్లేయులు భారతదేశాన్ని విడిచి వెళ్ళారు. మన దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడం వారికి తప్పలేదు. ఈనాడు తెల్ల దొరల సామ్రాజ్యవాద దేశాలు ఒక వైపున, నవ స్వతంత్రం పొందిన దేశాలు మరొక వైపున నున్నాయి.

ప్రపంచ పటాన్ని ఏ విధంగానైనా తయారుచేయ వచ్చును. కాని, ఈనాడు తయారైన పటంలో అహంకారంతో హూంకరించే తెల్ల దొరల సామ్రాజ్య వాద దేశాలు ఉత్తరం వైపున ఉన్నాయి. వాటిని ఉత్తర దేశాలు అంటారు. దక్షిణంలో క్రొత్తగా స్వతంత్రం లేక అర్ధ స్వతంత్రం పొందిన దేశాలు ఉన్నాయి. ఒక వైపున ఉత్తర దేశాలుంటే, మరొకవైపున దక్షిణ దేశాలున్నాయి. ప్రపంచమంతా ఉత్తర దక్షిణాలుగా విభజింపబడి యున్నది. తెల్ల దొరల సామ్రాజ్యవాద దేశాలు తమ వలసరాజ్యాలను దోపిడీ చేసి వైభవాన్ని సాధించాయి. వలస రాజ్యాలు ఒక్కొక్కటిగా వాటి పిడికిలి నుండి జారి పోవడంతో వాటి ఆర్థిక వ్యవస్థ కృంగి పోసాగింది. పూర్వపు వలస రాజ్యాలను మళ్ళీ ఎలాగ దోపిడి చేయాలా అని అవి చింతింప సాగాయి. నవస్వతంత్ర దేశాలను తమ పిడికిలిలోకి తీసికొని రాజాలకపోతే, సామ్రాజ్యవాద దేశాల వ్యవస్థయే కూలి పోతుంది. అందువలన నవ స్వతంత్ర దేశాలను ఎలా దోపిడీ చేయాలనేది వారికి ఒక తీవ్రమైన సమస్యగా పరిణమించింది. నవ స్వతంత్రదేశాల ఆర్థిక విధానాలు సామ్రాజ్యవాద దేశాలకు అనుకూలంగా లేకపోతే దోపిడీ కార్యక్రమాలు ఇక సాగ జాలవు. ఈ నవస్వతంత్ర దేశాలు రాజకీయంగాకూడ స్వాతంత్ర్యాన్ని పొందాయి. కాబట్టి, ఆయా దేశాలలో తమకు నచ్చిన కీలుబొమ్మ ప్రభుత్వాలు ఏర్పడునట్లు కృషిచేయుటయే ఈ సామ్రాజ్యవాద దేశాలకున్న ఏకైక మార్గము. నవ స్వతంత్ర దేశాలలోని జన సామాన్యాన్ని దోపిడీ చేయడానికి కావలసిన సౌకర్యాలేర్పరచగల ప్రభుత్వ యంత్రాంగం ఉండాలనేదే ఈ సామ్రాజ్యవాదుల పన్నాగము.

దురదృష్టవశాత్తు మన దేశాలో బ్రిటిషు వారి పద్ధతి అమలులో ఉండేది. మన సంస్కృతికి, ఇక్కడి పరిస్థితులకు వారి పద్ధతి తగినదికాదని గాంధీజీ, లోకనాయక్ జయప్రకాశ్ మున్నగు వారంతా ఉద్ఘాటించారు. మన కనుకూలమైన మరో వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలని చెప్పారు. అయినప్పటికినీ, మన నాయకులు ఈ పాతపద్ధతినే లాభదాయకమని విశ్వసించారు. ఇది వలస విధానానికి మాత్రమే అనుకూలంగా ఉన్నది.

**అమ్ముడుపోయే రాజకీయ నాయకులు, కీలుబొమ్మ ప్రభుత్వము :**

గాంధీజీ 1908లో "హిందూస్వరాజ్య" అనే పుస్తకం వ్రాశారు అందులో వారు బ్రిటిషు పార్లమెంటరీ డెమొక్రసీని భారతదేశంలో తీసికొని రాకూడదని వ్రాశారు. ఈ విధానం మనకనుకూలం కాదు. 60 శాతం ప్రజలు దారిద్ర్య రేఖకు దిగువగ సగముకంటె ఎక్కువ మంది నిరక్షరాస్యులుగ నున్న దేశంలో ఈ విధానం పనికిరాదని వారి అభిప్రాయము. దారిద్ర్యము, నిరక్షరాస్యత ఇంత ఎక్కువగానున్న దేశములోని ఓటర్లు నిష్పక్షపాతంగాను, నిర్భయంగాను ఓటు ఎలా వేయగలుగుతారు? ఎన్నికలలో ఎవరెన్ని ఓట్లు కొనగలుగుతారనే విషయం పైననే ముఖ్యంగా చర్చ జరుగుతుంది. పద్ధతులు మారవచ్చు, కానీ, డబ్బున్న వాడే కొనలుగుతాడు. బీదవారి ఓట్లను ధనవంతుడి డబ్బుతోనే సంపాదిస్తారు. ఓట్ల సంపాదన నేటి రాజకీయాలలో ఒక ముఖ్యమైన కళ. ''బీదవారిను డి ఓట్లను ధనవంతుల నుండి ఎన్నికల నిధిని సంగ్రహిస్తూ, ఒక వర్గం నుండి మరొకవర్గం వారికి భద్రత కల్పిస్తామని వాగ్దానము చేసే లలిత కళయే రాజకీయం.'' అని ప్రచారంలో నున్న సూత్రం అక్షరాల నిజమని తోస్తుంది.

యజమానుల నుండి రక్షణ కల్పిస్తామని శ్రామికులకు వాగ్దానము చేస్తారు. శ్రామికుల నుండి రక్షణ కల్పిస్తామని యజమానులకు వాగ్దానము చేస్తారు ఒక వర్గం నుండి ఓట్లను, మరొక వర్గం నుండి నిధిని సంగ్రహించే చాకచక్యమే రాజకీయ చతురతగా భావిస్తున్నారు.

ఈ రోజున 'ఓ నాయకులారా! మీరంతా రండి, నాకు ముక్తి కలిగించండి, నా ఖజానాను కొల్లగొట్టండి, ఈ డబ్బుతో నేను విసిగిపోయాను' అని ధనవంతులలో ఏ 'కర్ణు'డైనా చెప్పేవాడు ఉన్నాడా? అలాగ చెప్పేవారెవరూ మనకు కనిపించరు. నేడు చట్టాలు చేసే వ్యక్తులు తమకు మరింత లాభాలు సంపాదించేందుకు అవకాశం కల్పించాలన్నది నిధులు ఇచ్చేవారి మొదటి షరతు. నిధులు లేకపోతే ఎన్నికలలో గెలువజాలరు. ఎన్నికలలో గెలువజాలకపోతే ప్రభుత్వాన్నేర్పరచజాలరు. ప్రభుత్వాన్నేర్పరచకపోతే నాయకుల జీవితాలు దుర్భరం అవుతాయి. నీటి నుండి బయటపడ్డ చేపలాగా కుర్చీ దొరకకపోతే జీవించడం కష్టం. అందుచేత డబ్బు యిచ్చిన వారి షరతులను మన్నించడం అవసరం అవుతుంది. డబ్బు లిచ్చిన వాని ముందు తల వంచడం తప్పదు. తాను నమ్మిన సిద్ధాంతాలేవైనాసరే,

అధికారంలోనికి రాగానే తనకు డబ్బులిచ్చి గెలిపించిన వారి కనుకూలంగానే నిర్ణయాలు తీసికోవలసి వస్తుంది. అందుచేత ఎన్నికల ప్రణాళిక ప్రకటించగానే అమ్ముడుపోవడానికి సిద్ధమైన వారెందరో నడి వీథులలో ఎదురు చూస్తూంటారు. ఒక వైపున అమ్ముడుపోవడానికి ఉబలాటపడేవారు, మరో వైపున కొనడానికి ఉరకలు వేసేవారు రెండు వర్గాలు ఏకమౌతాయి. కొనేవారిలో స్వదేశీ పెట్టుబడి దారులే కాదు, విదేశీ ప్రభుత్వాలు, అంతర్జాతీయ నిధులు, విదేశీ పెట్టుబడిదారులు, బహు జాతీయ కంపెనీలు, ప్రపంచ బ్యాంకు మొదలగునవన్నీ ఉన్నాయి. ఈ విధంగా విదేశీ పెట్టుబడిదారుల కీలుబొమ్మ ప్రభుత్వం ఏర్పడటంవలన, స్వదేశీ పెట్టుబడిదారులు కూడ కీలు బొమ్మలయ్యారు. పెట్టుబడిదారులు, భారతీయ పెత్తం దారులు, భారత ప్రభుత్వము అందరూ కీలుబొమ్మలే. భారతదేశం వారి కుతంత్రాల వలయంలో చిక్కుకొనియున్నది.

ఈ కుతంత్రాలు ఎవరిని అదుపులో పెట్టడానికి? జన సామాన్యాన్ని అదుపులో పెట్టడానికి అనేది సుస్పష్టం: అంటే బీదవారు, శ్రామికులకు వ్యతిరే కంగా అన్నమాట. అందుచేతనే సామాన్య ప్రజలు జాగరూకతతో యుంటే ఈ కుతంత్రాలను ఒక్కుమ్మడిగా ఎదుర్కొంటే, వారి మాయదారి పొత్తును బ్రద్దలు చేయవచ్చు. కొంత కాలంవరకే ఎవరినైనా మోసగించవచ్చు, కాని శాశ్వతంగా సాధ్యం కానేకాదు గదా! తనకు వ్యతిరేకంగా ఏదో జరగబోతోందని అనుమానం కలుగగానే ప్రభుత్వాధికారి నియంత స్వరంతో ఆ వ్యవస్థ మొత్తము తన చేతుల్లోనే ఉండాలని ప్రకటిస్తాడు. ఈ విధంగా నియంతలు ఏర్పడే ప్రమాదం ఉన్నది. నిధులను సమకూర్చేవారు కూడ తమ దగ్గరికొచ్చే 'గిరాకీలు' ఎల్ల కాలమూ ఇచ్చి పుచ్చుకొనే స్థితిలోనే కొనసాగాలని కోరుకొంటారు. నవ స్వతంత్ర దేశ చరిత్ర ఇలాగే ఉంటుంది. దీనివలన ఆర్థిక ప్రమాదమే కాదు, నియంతృత్వం ఏర్పడే ప్రమాదం కూడ ఉన్నది. విదేశీ పెట్టుబడికి దేశాన్ని అమ్మడం అంటే అధికారికంగా బీద, బిక్కి జనాన్ని ఆర్థికంగా దోపిడీచేయడానికి అవకాశం ఇవ్వడమే. ఈ కుతంత్రం, ఈ ప్రమాదం బీదవారికి మాత్రమే వ్యతిరేకం కాదు, ప్రజాతంత్రానికి కూడ వ్యతిరేకమే. దీనితో మన ఆర్థిక స్వాతంత్ర్యం నశిస్తుంది. మన సర్వ స్వతంత్ర ప్రతిపత్తియే నశిస్తుంది. కాబట్టి

ఇట్టి విధానాలను సక్రమంగా ఎదుర్కొనడానికి ప్రజాతంత్రంలో నమ్మకం కలిగిన స్వదేశ నాయకుల జట్టును ఏర్పరచాలి. స్వదేశ స్వాతంత్ర్యాన్ని అమ్మడానికి ఏ దేశ భక్తుడు కూడ సమ్మతింపడు కదా !

మనదేశ స్వాతంత్ర్యం మాయ మర్మాల ద్వారా అమ్ముడై పోతుందనే యథార్థాన్ని దేశ భక్తులందరికీ - వారు బీదవారైనా, కాకపోయినా, శ్రామికులైనా కాకపోయినా - వివరించాలి. బీదవారు, శ్రామికులు మాత్రమేకాదు సామాన్య ప్రజలందరూ ఆపదలకు గురియగువారే కదా!

ఈ కుతంత్రాల ప్రమాదాలను ఏ విధంగా భారతీయ మజ్దూర్ సంఘ్ ఎదుర్కొని, దానిని బ్రద్దలు చేసిందో అలాగ మరే సంస్థయూ చేయలేదని నేను సవినయంగా మనవిచేస్తున్నాను.

ఇదంతా చెప్పటం దేనికి? మనం జాతీయ వాదులం కనుకనే భారతీయ మజ్దూర్ సంఘం ఈ పరిస్థితినంత సమూలంగా అధ్యయనం చేసి శ్రామికుల ముందుంచింది. దానివలన డి. ఏ, బోనస్‌లు ఏవీ దెబ్బతినవు. హిందూ దేశంలోని శ్రామికుల ఆందోళనలోని లోటును భర్తీచేయుటకు ఇలాంటి ఆలోచనయే ఆధారం ప్రయత్నం కొనసాగుతూనే ఉన్నది. భారతీయ మజ్దూర్ సంఘం దేశ శ్రేయస్సునకే అంకితమైయున్నది. శ్రామికుల శ్రేయస్సునకు, జాతి శ్రేయస్సునకు భేదమేమీలేదు. కాని ప్రాముఖ్యతను తెల్పడానికి జాతి శ్రేయస్సుకే ప్రథమ స్థానం ఇచ్చాము. మనది విశుద్ధమైన శ్రామిక సంఘము. శ్రామికుల శ్రేయస్సునకు, సంస్థ పెరుగుదలకు వైవిధ్యం ఏమీలేదు. అయినప్పటికినీ, శ్రామికుల శ్రేయస్సునకే ప్రథమ స్థానం యిస్తాము. భారతీయ మజ్దూర్ సంఘం మీ అందరినీ అటువైపే ఉద్యమింప జేస్తున్నది. సేవచేయడానికి భారతీయ మజ్దూర్ సంఘ్ ఒక సాధనం మాత్రమే. అసలు మన లక్ష్యం ఏమిటో మనం సరిగా గ్రహించాలి హిందూ దేశంలోని శ్రామికుల ఉద్యమంలోని లోటుపాట్లను సవరించడమే మన ఉద్దేశం. ప్రజల దృష్టిలో శ్రామికులు, యజమానులు అనే రెండు వర్గాలే ఉన్నాయి. కాని, అత్యంత ప్రధానమైన జాతి కూడ ఉన్నదనే అంశాన్ని వారు విస్మరించారు.

**అందరికీ విశ్వాస పాత్రమయ్యేందుకు కృషి :**

వాడకం దారుల శ్రేయస్సు, జాతి శ్రేయస్సు వంటిదే దీనిని గురించి కూడ పట్టించుకోవాలని ఎవరికీ స్ఫురించనే లేదు. ఏదైనా ఆందోళన జరిపేటపుడు మన కోరికల పట్ల ప్రజలందరి సానుభూతిని విశ్వాసాలను చూర గొనడానికి ప్రయత్నమే జరగలేదు. బొంబాయి ప్రజలకు ఈ మధ్యనే జరిగిన ఉదంతం ఒకటి గుర్తుండవచ్చు. అక్కడ సమ్మె జరిగింది. వారు ప్రజా సంపర్కాన్ని ఏర్పరచుకోలేదు. శ్రామికులు తమ శక్తినే నమ్ముకొని, నిర్లక్ష్యంగా ప్రవర్తించారు. యాజమాన్యము ప్రజా సంపర్కాన్ని సాధించింది. ప్రజలకు మంచి చెడ్డలు వివరించారు. దాని పరిణామంగా ఉద్యమంలో శ్రామికులే ఓడిపోయారు. దేశవ్యాప్తంగా సమ్మె కొనసాగు తుంటే, సమ్మెకు ప్రధాన కారణమేమిటో జన సామాన్యానికి వివరించే వారే లేకపోయారు. వాస్తవానికి ఒకవైపున ప్రభుత్వాన్ని ఏకాకిగా చేసి, సామాన్య ప్రజలు, శ్రామికులు రెండో వైపున కలిసి ఉన్నారనే పరిస్థితి కల్పించడం చాల బాగుండేది. దీర్ఘ కాలం దాకా సమ్మె కొనసాగటం వలన ప్రజలు శ్రామికులకు వ్యతిరేకమయ్యారని, యావద్దేశము, ప్రభుత్వము, యాజమాన్యము కలిసికట్టుగా ఒక వైపున నిలబడితే, మరోవైపున శ్రామిక వర్గం ఏకాకిగా అయిన దృశ్యం కన్పించింది. సాధారణంగా జరిగేది ఇదియే. ఇంటక్ (భారతీయ జాతీయ శ్రామిక కాంగ్రెసు) 34 సంవత్సరాల నుండి పని చేస్తున్నప్పటికినీ దాని స్థితిలో ఏ మాత్రమూ మార్పురాలేదు. ఏ మాత్రము ప్రయత్నం చేసినా, ఈపాటికి పరిస్థితి మారియుండేది. కాని, అటువంటి ప్రయత్నమేదీ ఇంతవరకూ జరగనే లేదు.

ఈ క్షేత్రంలో మనం కూడ పని చేస్తూన్నాము కదా! అందువలననే ఈ భూమికను, ఈ యథార్థాలన్నిటినీ మననం చేశాము. నేడు మనం పెద్ద ఎత్తున సంప్రదింపులు చేయడం మాత్రమే కాదు ప్రజలతో మన సంపర్కాన్ని, సంబంధాలను మెరుగు పరచుకోడానికి కూడ కృషిచేశాము. సమ్మె చేసిన చోట్ల కూడ మనకు అందుబాటులో ఉండే సాధనాలను ఉపయోగించుకొని ప్రజలందరికీ విశ్వాస పాత్రులవడానికి కూడ కృషి చేశాము. కాబట్టి ఇపుడు జరుగుతూన్న కృషిని విడివిడిగా పరిశీలించకూడదు. సమ్మెను గురించిన తర్కం విడిగాను,

దాని పరిణామాల తర్కం విడిగాను చేయకూడదు. ఈ రెండింటినీ విడి, విడిగా తర్కించటం భావ్యంకాదు. శ్రామికుల ఉద్యమంలో ఇది పెద్ద లోపం. శ్రామికులు, సాధారణ ప్రజల మధ్య సంపర్కాన్ని ఏర్పరచడానికి మనం కృషిచేస్తున్నాము. ఇదంతా ఒక గొప్ప ఆశయం కోసం జరుగుతూంది. దీనికి మనం ప్రత్యేకంగా ఏమీ పేరు పెట్టలేదు. స్పష్టంగా వివరించలేదు. కాని సంబంధాలను మెరుగుపరచుకోవడానికి భారతీయ మజ్దూర్ సంఘ్ తన విశిష్ట పద్ధతిలో కృషి చేస్తూనే ఉన్నది.

శ్రామికుల ఉద్యమానికి ఒక నూతన దృక్పథాన్నివ్వడానికి మనం చేస్తూన్న ప్రయత్నం, అంటే శ్రామికుల ఉద్యమానికి నూతన దృక్పథాన్నివ్వబోవటం మీదనే దాని చరిత్రలో ఒక నూతన అధ్యాయం అవుతుంది. మనం చేస్తూన్న ప్రయత్నమంతా ఈ నూతన దృక్పథాన్నివ్వడానికే.

# 3. మన కార్యము–కార్యకర్తలు

గడచిన అనేక సంవత్సరాలుగా నిరంతరంగా భారతీయ మజ్దూర్ సంఘ్ పని చేస్తూండిన కార్యకర్తలలో కొందరుండేవారు. వారిలో కార్య తత్పరత ఉండేది. అందుచేత వారు తమ శరీరం, ఆరోగ్యం గురించి ఎప్పుడూ శ్రద్ధ వహించలేదు. మిగతా ఎన్నో విషయాలను కూడా వారు పట్టించుకొననే లేదు. పనిచేస్తూ, చేస్తూనే వారు గతించారు. కొందరు ప్రముఖ కార్యకర్తలు మజ్దూర్ సంఘ కార్యాన్ని చేస్తూండగానే ఏదో అపాయానికి గురై మరణించారు. మరి కొందరు హత్య చేయబడ్డారు కూడా. ఆ విధంగా భారతీయ మజ్దూర్ సంఘ కార్యంలో నిరంతరం కృషిచేస్తూ, తమ జీవన యాత్రను ముగించిన వారిని అమర వీరులని, దేశం కోసం ఆహుతియైన వారు, ఆత్మత్యాగం చేసిన వారని అంటాము - 'భగవధ్వజాన్ని స్వీకరించాము. ఈ ప్రాణాలపై తీపి ఎందుకు' అనే గీతాన్ని సార్థకం చేసిన వారిని మనం (అనే గీతాన్ని సార్థకం చేసిన వారిని-) ఎవరికి వారు తమ తమ ప్రాంతాలకు చెందిన వారిని ఒకక్కరినే మననం జేసికోవటం అవసరం. దీనినే ఆంగ్లంలో 'రోల్ కాల్ ఆఫ్ ఆనర్' లేక గౌరవాన్వితుల పట్టిక,' 'త్యాగధనుల పట్టిక,' నిరంతరం కృషి చేస్తూ కాల గర్భంలో కలిసి పోయిన వారి లెక్కింపు, పట్టిక లేక సంస్మరణము అంటారు. భారతీయ మజ్దూర్ సంఘ్‌కు కూడ 'రోల్ కాల్ ఆఫ్ ఆనర్' ఉన్నదా? ఒక వేళ ఉంటే అది ఎలాంటిది? ఈ దృక్పథంతో ఆలోచించి, మీకు తోచిన పేర్లను నిస్సంకోచంగా చెప్పడానికి ప్రయత్నించండి. అంటే నిరంతరం కృషి చేస్తూ, ఆత్మత్యాగం జేసిన వారందరి పేర్ల పట్టికను మనం ఈ సమావేశంలో తయారు చేయాలని దీని తాత్పర్యం. వారు కార్యం కొనసాగిస్తూ, హత్యగావింప బడి యుండవచ్చు, మరేదైనా ప్రమాదాలకు గురియైయుండవచ్చు, లేక ఆనారోగ్యం వలననే మరణించి యుండవచ్చు. అమరత్వం జెందిన వారికి మనం ఎప్పటి కప్పుడు మన సమావేశాలలో శ్రద్ధాంజలి ఘటించి యుండవచ్చును గూడ. కాని దివంగతులైన మన తోటి కార్యకర్తలను ఈ విధంగా స్మరించడంలో ఒక ప్రత్యేకత యున్నది. మన పూర్వ సహచరులను ఈ విధంగా మననం జేసికొన టం వలన మన ఆత్మబలము పెరుగుతుంది.

భారతీయ మజ్దూర్ సంఘ్ ఆధారం :

భారతీయ మజ్దూర్ సంఘ్‌లో నిరంతరంగా కృషి చేస్తూ కాలగర్భంలో కలిసి పోయిన ఇటువంటి కార్యకర్తలను మరాఠీలో 'కర్మేపవిత్రే, సుగుణ చరిత్రే, హరిచివర్ణా' (పవిత్ర కర్మపరాయణులు, సౌశీల్య వంతులు, విష్ణ్వాంశసంభూతులు) అంటారు. కర్మలో పవిత్రులై జీవితంలో సౌశీల్యవంతులై విష్ణుభక్తులను కీర్తిస్తూ, ధ్యానం చేస్తూన్న వారి పనులన్నీ సార్థకం జెందుతాయి. భారతీయ మజ్దూర్ సంఘ కార్యవిస్తరణ, భారతీయ మజ్దూర్ సంఘ్ నేటి వరకు సాధించిందంతా భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యకర్తల ద్వారానే అని మనందరికీ స్పష్టంగా తెలుసు. సిద్ధాంతం ఎంత ఉత్కృష్టమైనదైనా, ఆ సిద్ధాంతాన్ని సాధించే వారు లేకపోతే దానికనుగుణంగా జీవితాన్ని గడిపే కార్యకర్తలు దాన్ని బలపరచక పోతే, ఆ సిద్ధాంతానికి ప్రపంచంలో ఎక్కడా ఏమాత్రమూ విలువ ఉండదు. మనం పరాధీనులుగా నున్నప్పుడు జరిగిన ఒక సంఘటన మీకు తెలిసేయుంటుంది. మన దేశములో ఉత్తమకవిగా ప్రసిద్ధి పొందిన రవీంద్రనాథ్ ఠాకూర్ జపానుకు వెళ్ళారు. అక్కడ వారి ఉపన్యాసం ఉంది. వారి ఉపన్యాసాన్ని వినడానికి కొందరు మాత్రమే వచ్చారు. ఆ కార్యక్రమానికి రానివారిని 'అయ్యా, మీరు రవీంద్రనాథ్ ఠాకూరు ఉపన్యాసానికి ఎందుకు రాలేదు' అని అడుగగా-

'ఏ దేశంలోనైతే ప్రపంచ ప్రసిద్ధ కవులు జన్మిస్తారో, ఆ దేశం స్వాతంత్ర్యం సాధించజాలకపోతే, వారి ఉపన్యాసాలు ఎవరికి కావాలి?' అని దురుసుగా సమాధానం జెప్పారు. సిద్ధాంతమైతే శ్రేష్ఠమైనదే కావచ్చు కాని, వాస్తవిక జీవితంలో దాన్ని సాధించజాలకపోతే, ఆ సిద్ధాంతం నిరుపయోగమే అవుతుంది. ఈ దృష్టితో పరిశీలిస్తే సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టగల వ్యక్తి మానవత్వం నుండి దేవత్వానికి వెళ్ళే ప్రయత్నంజేస్తే, నరుడు నారాయణుడౌతాడు. కాని, ఇది ఎప్పుడు సాధ్యం? నరుని నారాయణునిగా మార్చగలిగే కార్యకర్తలు ప్రతిచోటా నిలిచి కృషి చేసినప్పుడే అది సాధ్యం. భారతీయ మజ్దూర్ సంఘ్ ఈనాడు స్థిరపడటానికి, విస్తరించటానికీ, మౌలిక ఆధారం కార్యకర్తలే.

భారతీయ మజ్దూర్ సంఘ్ ప్రారంభమైనప్పుడు మన దగ్గర ఏమి ఉండిందో జ్ఞాపకం చేసి కొందాము. ఎవరైనా గొప్ప నాయకుల ఆశీర్వాదం ఉందా ? మన వెనుక గొప్ప ఆర్థిక బలం, కోశాగారం ఉందా ? మన వద్ద

ఉంది ఏమిటి ? అలాంటిదేమీ లేదు. మనవద్ద ఉంది ఒక్కటే - అది ధ్యేయనిష్ఠ మాత్రమే. ఈ దేశంలోని దళిత, పీడిత, ఉపేక్షిత జనుల స్థితిని బాగు చేయాలనే తీవ్రమైన కోరిక, మహత్వాకాంక్ష మాత్రమే. ఈ ఒక్క లక్ష్యం కోసమే మనం మన కార్యాన్ని ప్రారంభించి, కార్యకర్తల ఆధారం మీదనే దీనిని స్థిరపరచాలని కూడ నిర్ణయించుకొన్నాము. భారతీయ మజ్దూర్ సంఘాన్ని స్థిరపరచే ముందు దానిదంటూ సాహిత్యం కూడ లేకుండేది. ప్రారంభంలో 'యువర్ ఇక్విప్‌మెంట్' 'యువర్ ఆఫీసు' వంటి చిన్న చిన్న పుస్తకాలే' వ్రాయబడ్డాయి. చిన్న, చిన్న కార్యకర్తలు క్రొత్తగా పనిచేయడానికి ముందంజవేసినపుడు వారు కార్యరంగంలో విఫలం చెందకుండా ఉండాలంటే వారికి అవసరమైన పరిజ్ఞానాన్ని అందించాలన్నదే అప్పట్లో చేసిన ప్రయత్నం. మన కార్యాలయం ఎలా ఉండాలి? దానిలో ఏమేమి ఉండాలి? అందుకోసం కొన్ని పుస్తకాలు వెల్వడినాయి. ప్రారంభంలో ఇలాంటి సూక్ష్మ విషయాల పట్ల శ్రద్ధవహించి, క్రొత్తగా కార్యరంగంలోకి వచ్చే ప్రతి కార్యకర్తయు విజయం పొందేలాగ కృషి చేయాల్సి వస్తుంది. భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్తలు ఇదంతా ఆలోచించి ఒక పథకం ప్రకారం ప్రయత్నం కొనసాగించటం వలననే ఈనాడు ఇందరు కార్యకర్తలు కార్యరంగంలో కన్పిస్తున్నారు దీనితోబాటు మరో అంశం కూడ మన దృష్టికి వచ్చింది. భారతీయ మజ్దూర్ సంఘానికి తమ రక్తము, చెమట ధారపోసి పెంచిన కార్యకర్తలందరూ కాలగర్భంలో కలిసిపోయారు. ఒక్కొక్క కార్యకర్తను నిలుపుకొనడానికి ఎంతగా పరిశ్రమించాల్సి వస్తుందో గ్రహించడానికి మన మందరము సాక్షులమే. మన కార్యకర్తలు దీనికి ప్రత్యామ్నాయంగా మరే విషయం జోలికి పోకుండా ఇదే కార్యంలో తత్పరులై ఉన్నారు. ఒక్కొక్క కార్యకర్తను, అతడెంతటి చిన్నవాడైనా సరే, ప్రతి స్థానంలో నిలబెట్టాలంటే అతడెలా ఉండాలి? ఎన్నో ఏళ్ళుగా ఈ రంగంలో గుత్తాధిపత్యం వహించే వారికి పోటీగా ఒక చిన్న కార్యకర్తను నిలబెట్టి, అతని కృషిని సార్థకం జేయవలసి ఉంది. దాని తరువాత వచ్చిన పుస్తకం 'భారతీయ మజ్దూర్ సంఘ క్యోం?' అది ప్రకాశితమైంది. కార్యకర్త యోగ్యతను క్రమంగా పెంచి అతని వికాసానికి చేయూతనిచ్చుచూ, దాని కనుగుణంగా అతనికి కార్యంపట్ల నిరంతర ఉత్సాహము, ఆలోచన, పరిజ్ఞానము, లక్ష్యశుద్ధి మున్నగు వాటి అనుభూతిని కల్గించి కార్యక్షేత్రంలో స్థిరస్థానాన్ని ఏర్పరచడం - ఇదీ భారతీయ మజ్దూర్ సంఘ కార్య విధానం.

ఇక్కడ కూర్చొనిన కార్యకర్తలందరం ఎన్నో యేండ్ల నుండి పనిచేస్తున్నాము. మీలో ఎందరో కార్యకర్తలు 2, 3 శిక్షణ వర్గలలో పాల్గొని యుండటం చేతను, మన ప్రముఖ కార్యకర్తలు ప్రాంతాలలోను, యావద్భారతంలోను పర్యటన చేస్తూండటం చేతను మనధ్యేయం, లక్ష్యం సుస్పష్టమై యుండవచ్చును.

మన లక్ష్యం :

మనధ్యేయం లేక లక్ష్యం ఏమిటి? ఏదో ఒక యూనియన్ లేక ఫెడరేషన్ నడపటం మాత్రంకాదు మన లక్ష్యం. మనం నిర్మించదలచిన సువిశాల సంఘటిత శక్తి ఈ దేశంలోని దళిత, పీడిత, ఉపేక్షిత జనాన్ని ఉద్ధరించి, వారిపై జరుగుతున్న ఆర్థిక వత్తుడులను నివారించి, వారి ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచి, వారి జీవితంలో సువర్ణ కాలము తీసికొని రావడానికి కృషి చేయడం. దానిని సాధించటానికి అవసరమైన దంతా చేయడం కూడ మనలక్ష్యంలోని భాగమే. ప్రస్తుతం ఉన్న చట్టాలు వారిని రక్షించజాలకపోతే, వారిని ఆదుకోలేకపోతే ఆ చట్టాలను మార్చాలి. చట్టాలను మార్పించడానికి కృషిచేద్దాం. మనదేశము కూరుకుపోయిన ప్రస్తుత ఆర్థిక వ్యవస్థపైన జెప్పిన బీద బడుగు ప్రజానీకాన్ని తలెత్తుకొని తిరుగనివ్వక క్రుంగదీస్తూంటే అట్టి ఆర్థిక వ్యవస్థను కూడ మార్చివేద్దాం. ఈ లక్ష్య సాధనకే ముందడుగు వేద్దాం.

ధ్యేయవాది జీవితం :

ఈ సమావేశంలోనే కొద్ది క్షణాల పూర్వం మనం స్మరించిన కొందరు కార్యకర్తలను పేర్కొన్నప్పుడు వారు తమ కుటుంబాలపట్ల శ్రద్ధ వహించటానికి కూడ తీరిక లేనంతగా కార్యంలో నిమగ్నులై యుండేవారని అనేకులు అంగీకరించారు. వారి పరిస్థితి ఏమయిందో మనందరికీ సుస్పష్టం. దానిని ఎక్కువగా వివరించాల్సిన అవసరం లేదనుకొంటాను. మనతో కలిసియుండే వారి సమస్యలను పరిష్కరించటంలోను, వారి బాధలను పంచుకొని, వారికి వచ్చిన కష్టాలను తొలగించటానికి ఎంతో పరిశ్రమించాల్సి వస్తుంది ఆఫీసులలో పని చేసే వారెందరో మనతో బాటున్నారు. ఆఫీసు ముగిసిన తరువాత రాత్రి బాగా ప్రొద్దుపోయిన తర్వాత 9, 10 లేదా 11 గంటలకు తమ తమ యిండ్లకు వెళ్తారు. అప్పుడు ఇంటిలోని వారందరూ నిద్రపోతూ ఉంటారు. ఆఫీసు లోనైతే 'మా ఫలానా పని చేయనేలేదు' 'మీ యూనియన్ ఏమి చేస్తూంది?' 'ఇంత వరకూ మా

ట్రాన్స్‌ఫర్ ఆపజాలక పోయారు గదా!' 'మాకు వేతన వృద్ధి కానేలేదు' అని రకరకాల ఎత్తిపొడుపులు తోటి ఉద్యోగుల నుండి వినవలసి వస్తుంది. ఇంటికి వెళ్తే, అక్కడ కూడ ఇంటివారి నుండి మాటలు పడవలసి వస్తుంది. ఇంటిలో మాటలు పడనివారిని కార్యకర్త అనడం సాధ్యంకాదు! అంటే కార్యకర్తకు ఇంటా, బయటా కూడా తిట్లు తప్పవు అన్నమాట! ఇంటికి ఆలస్యంగా జేరుతాడు. వెంటనే 'ఇంటి విషయం ధ్యాసే లేదు. పిల్లల ఊసే ఎత్తడు, వారి చదువు సంధ్యల పట్ల శ్రద్ధయే లేదు, వారి ఆరోగ్యం ఏమైనా పట్టించుకోడు, అంతేకాదు, తన విషయం కూడ ఆలోచించడు' వంటి మాటలు విన్పిస్తాయి. ఇంటివారు కూడ ఇతడంటే కస్సు, బుస్సు మంటారు. అయినా అతడు తన కార్య తత్పరత నుండి విచలితుడు కాడు. అందుకే మనం ఈ రోజుల అట్టి కర్మవీరులను, ఆత్మత్యాగులను పేరు పేరునా స్మరించుకొన్నాము.

అసలు ఈ విధంగా ఎందుకు అవుతుందో మనం ఆలోచిద్దాం. ఏ వ్యక్తియైనా ఇలాంటి పనులన్నీ ఒక్క దినమైనా చేయగలడా? భారతీయ మజ్దూర్ సంఘ్ ప్రారంభమైనప్పటి నుండి ఈనాటి దాకా ఎందరో కార్యకర్తలు తమ తమ క్షేత్రాలలో, తదేక నిష్ఠతో అచంచల కార్య తత్పరతతో పని చేస్తూండడాన్ని నేను గమనిస్తూన్నాను. రాత్రుళ్ళు పది, పదకొండు గంటలకు ఇల్లు జేరతాడు. ఏళ్ళ తరబడి ఇదే విధంగా జరుగుతూనే ఉన్నది. ఆ కార్యకర్త ఈ విధంగా ఎలా చేయగలుగు తున్నాడు? దీని కొక్కటే కారణం - అతని మనస్సులో లక్ష్య సాధన కోసం దృఢ సంకల్పం కల్గింది, దానితో తన స్వంత జీవితాన్ని మరచి పోయాడు! అతని జీవితం సాధారణ మానవుల జీవితం వంటిది కాదు. మన కార్యకర్త ఒకడుండే వాడు. 'మీసా' క్రింద అతడు జైలుకు వెళ్ళాడు వారి ఇంటి పరిస్థితిని తెలుసుకోడానికి మేమతని ఇంటికి వెళ్ళాము. అతని 'భార్యను' మీకేమైనా కష్టాలున్నాయా? ఏమైనా ఆర్థిక ఇబ్బందులున్నాయా' అని అడిగాము. అందు కామె 'ఆర్థిక ఇబ్బందులు మాకేమున్నాయి? ఇన్ని సంవత్సరాలుగా మావారు ఉద్యోగం జేస్తున్న, ఈ రోజుల్లో వచ్చినంత జీతం మునుపెన్నడూ వచ్చియుండలేదు' అని ధీమాగా చెప్పింది. అతడు జైలులోనుండటం వలన సగం జీతమే వచ్చేది. అంటే మామూలుగా ఉద్యోగంలో ఉన్నప్పుడు అతడు చాలా రోజులు సెలవుల మీద ఉండటంవలన సగం జీతం కూడ ఇల్లుజేరేది కాదన్న మాట! అలాంటి కార్యకర్తల మూలాన్నే భారతీయ మజ్దూర్ సంఘ్ దృఢపడింది. వారి జీవితమంతా

త్యాగమయమే. ఏదో ఒక రోజున కాలిపోవటం సులభం. కాని జీవితమంతా కాలుతుండటం - బాధలనుభవిస్తూనే నిరంతరం కృషి జేయటం-చాల కష్టం. ఈ కష్ట సాధ్యమైన కార్యాన్ని మజ్దూర్ సంఘ కార్యకర్తలు ఈనాడు చేస్తూండటాన్ని మనం గమనిస్తున్నాము. ఒక కార్యకర్త తుపాకి గుండ్లకు గురి యయ్యాడని మనం ఇప్పుడే విన్నాము! అతడు చేసిన అపరాధం ఏమిటి? భారతీయ మజ్దూర్ సంఘ కార్యం చేసేవాడు అనేదే కదా? అతడు భారతీయ మజ్దూర్ సంఘం పని చేయక పోతే లేక ఆ పనిని మానుకొని యుంటే బ్రతికి ఉండే వాడేమో! అతడు మాత్రం ప్రాణాలైనా ఆహుతి జేశాడు, కాని పనిని మాత్రం వదల లేదు. అతని దృఢ సంకల్పం ఒక్కటే 'ఈ కార్యమే నేను చేస్తూంటాను, జీవితాంతం, చేస్తూంటాను, ఈ పనియే నా జీవితానికి గౌరవ ప్రదము'. ఈ పని చేయాలని మనసులో ఏర్పరచుకొనిన వజ్ర సంకల్పం వల్లనే అతడంతటి త్యాగం జేశాడు. అతనికి ఈ విషయాన్ని ఎవ్వరూ చెప్పలేదు. ఎవ్వరూ బోధించనూలేదు. అతనితో ఎవ్వరూ చర్చించనూ కూడలేదు. అతనికే హృదయంలో ప్రేరణ కలిగింది. అలాంటి జీవితాన్ని గడపాలని! తమ బాల్య స్నేహితులు ఉన్నత పదవులు నిర్వహిస్తూండ టాన్ని గమనిస్తూన్న మనతోటి కార్యకర్తలెందరో మన మధ్యనున్నారు. అలాంటి బాల్య స్నేహితుల వద్ద కార్లుండ వచ్చును. బంగళాలుండ వచ్చును. వారి పిల్లలు గొప్ప చదువులు చదువుతూండ వచ్చును. ఎవరైనా విదేశాలకు కూడ పోయి ఉండవచ్చును. బాల్యంలో కలిసి చదువుకొన్నారు, తెలివి తేటలలో కూడ అతడు తక్కువై యుండవచ్చు. కాని, అతని జీవితం ఎలా ఉంది. మన కార్యకర్త జీవితం ఎలా ఉంది? రెండు పూటలు తిండికి కూడ తీరికలేదు, ఆఫీసులో పనిచేస్తూన్న కాలంలో మజ్దూర్ సంఘ కార్యకలాపాల వలన సగం జీతం కూడ ఇంటికి పట్టు కెళ్ళజాలడు, ఎన్నో మార్లు అతని మనసులో 'నేను సంపాదించిం దేముంది? నా బాల్య స్నేహితులెందరో ఉన్నత పదవులు పొంది సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు కదా!' అని తీవ్ర సంచలనం కూడ కలిగి యుండ వచ్చును. కాని, 'ఈ పని చేయటంలో కల్గిన ఆనందము, దీనివలన నా మనసుకు కలిగిన శాంతి గొప్ప పదవులు పొందిన తర్వాత నాకు, దొరకుతాయని నమ్మకం కుదరటం లేదు' అని మన కార్యకర్తలు పరస్పరం చెప్పుకోవటం నేను ఎన్నో మార్లు విన్నాను.

**మహమ్మదు సాహెబ్ ఉదాహరణం :**

ఈ సందర్భంలో మహమ్మదు ప్రవక్త యొక్క ఉదాహరణం మనం గమనింప వచ్చును. యుద్ధంలో కొల్లగొట్టిన ఎంతో సంపద అతనికి లభించింది. కొల్లగొట్టిన ధనమంతా నిర్విరామంగా అతని యింటికి జేరుతూనే ఉండేది. కాని సాయంకాలానికి అతని ఇంటిలో దీపానికి కూడా చమురుండేదికాదు! అతనిభార్యలు 'ఈయె నెంతటి విక్షచణారహితుడు, ఇన్నియుద్ధాలలో గెలిచాడు ఇంతగా సంపద వస్తూనే ఉంది, కాని మాకేమీ ఇవ్వడే!' అని పరస్పరం చర్చించుకుంటూ యుండే వారు. ఒకసారి ఒక పెద్ద యుద్ధంలో అపార ధనం లభించింది. అప్పుడతని భార్యలందరూ కలిసి అతనివద్దకు వెళ్ళి తమకోసంకూడ కొంత ధనం ఉంచమని చెప్పాలని నిర్ణయించుకొన్నారు. వారందరూ మహమ్మదు సాహెబ్‌కు ఈ విషయం చెప్పగా ఆయన వారితో 'మీరు చెప్పేది బాగానేఉన్నది. మీకు కావలసినంత ధనం ఉంచుకొందాము నన్ను ఆపేవారెవ్వరూ లేరు. కాని ఒక విషయం గుర్తుంచుకోండి ఈ ధనాన్ని నేను నిలువ ఉంచుకొన్న రోజున మిమ్ములను మహమ్మదు ప్రవక్త భార్యలు అని ఎవ్వరూ పిలువరు, మీ భర్తను మహమ్మదు ప్రవక్తగా ఎవ్వరూ గుర్తించరు' అని చెప్పారు. అది వినగానే వారందరూ 'మాకు మహమ్మదుసాహెబ్ కావాలి, సిరిసంపదలు అవసరం లేదు' అన్నారు. జీవితాన్ని ఎలా సార్ధకం చేసు కోవాలో, దాని హద్దు లేమిటో గ్రహించి జీవించటమే మహత్కార్యము, ఉత్తమ జీవితం. కార్లు దొరకకపోవచ్చును, డబ్బు సంపాదింపజాలక పోవచ్చును, కీర్తి ప్రతిష్టలు రాకపోవచ్చును, లేక పోతే పోనీ, దొరకక పోతే పోనీ, దానిని గురించి మనకు చింత ఎందులకు?

**కార్లూ వద్దు, సిరి సంపత్తులూ వద్దు:**

ఇలాంటి సంఘటనే ఒకటి మన కార్యకర్త జీవితంలోగూడ సంభవించింది. ఏదో ఒక ఫ్యాక్టరీలో అతడు మంచి ఒడంబడికను (Agreement-అగ్రిమెంటు) కుదిర్చి పెట్టాడు. ఆ ఒడంబడికను కుదుర్చుకోవటంలో పాల్గొన్న ఇతర యూనియన్ల నాయకులకు వారి కార్యకర్తలు ఒక్కొక్క కారు కొనిపెట్టారు. మన కార్యకర్త వద్దకు కూడ వచ్చి 'మీకుకూడా ఒక కారు కొనిపెడ్తాము' అని అన్నారు. అందుకాయన కారును నేనేం జేసుకోను? ఆ కారును తుడిచిపెట్టే వారెవరు? నాకు నా సైకిలేచాలు' అని సమాధానం చెప్పారు. జీవితం ఎలా ఉండాలి? మన

జీవితం ఎలా గడపాలి ? అనే విషయాన్ని ప్రతి కార్యకర్తయు నిర్ధారించుకోవాలి. భారతీయ మజ్దూర్ సంఘం కార్యకర్తలు ఆ విధంగా పర్యాలోచించి నిర్ణయించు కొంటారు. తమ జీవిత కాలమంతా పనికే అంకితం చేసిన మన కార్యకర్తలు ఎన్నో పర్యాయాలు ఇంటర్వ్యూ యివ్వడం, పరిచయ సమావేశాలలో మాట్లాడటం మనం వింటూంటాము. ఆ పరిచయ సమావేశాలలో వారంతా తమకు దొరకినదే చాలు దానితో మేము జీవితం గడప గలం, ఎక్కువగా మాకేదీ అవసరం లేదు' అని చెబుతూంటారు. తమ అనుభవాలను వారు మాకు చెప్పినపుడు ఎంతటి ఉదార మనస్కులతో మేము కలిసి పనిచేస్తున్నాము కదా!' అని అవగతమైంది. ఈ మధ్యనే ఒక సంఘటన జరిగింది. పూర్తి సమయమిచ్చి పనిచేసే ఒక కార్యకర్త తమ ఖర్చులకుగాను మా నుండి డబ్బు తీసికొంటూండే వారు. కాని కొన్ని రోజుల తర్వాత ఏమి కారణమోగాని బహుశా అతని స్వప్రయత్నాల వల్లనే కావచ్చు ఇతరుల నుండి డబ్బు తీసుకొనే అవసరం లేకపోయింది. వచ్చే నెలనుండి భారతీయ మజ్దూర్ సంఘ డబ్బులు తన కవసరం ఉండదని ఆయన చెప్పివేశారు. మన్నించాలి అతడు మరో వ్యక్తి నుండి గాని, ఏదైనా యూనియన్ నుండిగాని డబ్బుతీసికొనేవారు మాత్రము కాదుసుమా! ఆయన తన యింటి ఖర్చులకోసం మరోపద్ధతి నవలంభించారు, దానితో ఆయనకు డబ్బులు రాసాగాయి. స్వగ్రామంలోనే పూర్తి సమయమిచ్చి పని జేయడానికి డబ్బులు అవసరమేలేదని చెప్పేవారు అంతకు ముందు వారు డబ్బు తీసికొనే వారు, మేమిస్తూండే వారము. కాని, మాకు అనిపించేది - ఎంత తక్కువగా యిస్తున్నాము అని. ఖర్చులకోసం అంత తక్కువ యిస్తున్నపుడు మాకే చాల సంకోచంగా ఉండేది. కాని, కొంత కాలం తర్వాత ఆ మాత్రం డబ్బు కూడ తన కవసరం లేదన్నారు. ఇది వారి ఔన్నత్యానికి నిదర్శనం.

అవసరమైనంతవరకు మాత్రమే తాను వాడుకోవాలి అనేది మన భారతీయ జీవన దృక్పథం అవసరాలను తగ్గించుకోవటం చాల ముఖ్యం. జీవన యాత్రకు జీవన స్థాయికి కనీస అవసరాలు అంటే మన చర్మము, ఎముకలు చేర్చియుంచడానికి అవసరమైనంతవరకు అని మనం భావిస్తాము. ఆ గీటురాయిపై కనీస వేతనం తీసుకొని, ధ్యేయంతో ఏకాత్మతను జెంది కృషి జేసే కార్యకర్తలు భారతీయ మజ్దూర్ సంఘంలో నున్నారు ఈ కార్యకర్తలు ఎలాంటి కఠిన పరిస్థితులలో పనిజేస్తున్నారో మనం ఊహించవచ్చును.

**'థాంక్‌లెస్ జాబ్' కీర్తి ప్రతిష్ఠలకు ఆస్కారం లేని పరిశ్రమ :**

ఈ రంగం యొక్క విశిష్టత ఎన్నోమార్లు మన దృష్టికి వస్తూంటుంది. మరో సంస్థకు చెందిన ఉన్నత శ్రేణి కార్యకర్త యొకరు పూనాలో ఒకసారి కలిశారు. ఆయన (ఫ్యాక్టరీలతో) చాల మంచి ఒడంబడికలు (అగ్రిమెంట్లు) సాధించిన వారు. ఒక ఫ్యాక్టరీతో ఒడంబడికను సాధించిన తరువాత ఆయన ఇక ఆ రంగం నుంచి నిష్క్రమించాలని భావించారు. 'అలా ఎందుకు' అని నేనడిగాను. ఆయన నాతో అన్నారు గదా 'చూడండి నేను దీనికంటే ఎక్కువగా ఇంకేమి సాధింప గల్గుతాను? ఇంకను ఎక్కువ లాభం చేకూర్చ జాలకపోతే, ఈ కార్మికులంతా నన్ను సమర్థిస్తారో లేదో చెప్పడం సాధ్యం కాదు.' నేను ఆయనతో 'మన పని కార్మికులకు డబ్బులిప్పించడం మాత్రమేనా? కార్మికులు డబ్బుల కోసమే మనతోబాటు కలిసి యుంటున్నారా'! అని అడిగాను. అందు కాయన 'ఇదంతా మన్నిక లేని వృథా పరిశ్రమ మాత్రమే' అని తన అనుభవాన్ని వెల్లడించారు.

ఈ రంగంలోని విశిష్టత ఇదే - ఇక్కడ రోగుల మనస్తత్వం నెలకొని యుంటుంది. రోగ గ్రస్తులైన వారికి సేవ జేస్తూంటారు. ఇంటిల్లి పాదీ వారిపట్ల శ్రద్ధ వహిస్తారు. ముసలివారి విషయంలో ఇలాంటి అనుభవం ఎన్నోమార్లు కలుగుతుంది - వారి అవగాహన, ఓర్పు శక్తి అన్నీ అడుగంటి పోతాయి. వారికి ఆకలి అయితే త్వరగా భోజనం పెట్టాలి. దప్పిక అయితే త్వరగా మంచినీరు యివ్వాలి. అవసరమని అతడు భావించగానే కాలకృత్యాలు దీర్చుకోడానికి వెంటనే తీసుకొని వెళ్ళాలి. అతని శారీరక స్థితియే అలాగ ఉంటుంది. మంచి దేదైనా జరిగితే ఓర్చుకోలేడు, చెడు ఏదైనా జరిగితే ఏడుస్తాడు. ఎవరైనా అప్పుడు వస్తే మరెవరైనా కన్పిస్తే, కుమారుడు వస్తే భావోద్రేకంతో ఏడుస్తాడు. ఇలాంటి పరిస్థితులలో అతనికి సేవచేస్తూన్న వారికి ఎప్పుడైనా అనుపించవచ్చు- "ఉదయం నుండి రాత్రిదాకా అతని సేవ చేస్తూనే ఉన్నాము కదా; కాని అతనిని కనిపెట్టుకొని ఉండటం మాత్రమేనా మన పని? ఇంకా వేరు పనులెన్నో ఉన్నాయి కదా! ఇంటి పనులన్నీ చూచుకోవాలి, ఇంటికి వచ్చి పోయేవారి పట్ల శ్రద్ధవహించాలి, పనుల కోసం బయటకూడ వెళ్ళాలి. ఈ లోగా ఇంటిలోని వృద్ధుడు మూత్ర విసర్జనకు వెళ్ళవలసి వస్తే కేకలు వేస్తాడు. మరి చేస్తూన్న పని వెంటనే వదలి

పెట్టి రావటం సాధ్యం కాదు కదా, 2-3 నిమిషాలు పట్టవచ్చు గదా! కాని, ఆ రెండు నిమిషాలకే ఇంటి వారందరినీ కేకలు వేస్తూ, "నేను ముసలివాణ్ణయి పోయాను, ఎవరూ నన్ను పట్టించు కోవటమే లేదు, నేను త్వరగా చచ్చిపోవడమే మీరు కోరుకునేది" అంటూ అల్లరి చేస్తాడు. అంటే ఈ నాటి దాకా అతనికి చేసిన సేవలన్నీ బూడిదలో పోసిన పన్నీరు అయ్యాయి అన్నమాట !

ఇదే మనస్తత్వం ఉద్యోగులకు కూడా ఉంటుంది. ఎన్నో సంస్థలు, శ్రామిక సంస్థలలో పని చేసిన ఉత్తమ కార్యకర్తలు కూడ ఈ విషయాన్ని ఒప్పు కొంటారు? ఎందుకు ఒప్పుకొంటారు? ఎందుకంటే వారికి సంబంధించిన ప్రతి సందర్భంలోనూ-మంచి రోజుల్లో, కష్టదినాలలో-వారితో కలిసి మెలిసి ఉండేవారు కదా! కార్యకర్త ఎన్నోపనులుచేసి పెడ్తూంటాడు-కాని, అతనికున్న కఠిన సమస్య శ్రామికుని తృప్తి పరచడం ! శ్రామికుని, అతని యజమాని నిందించి యుండ వచ్చు, ఛార్జిషీటు యిచ్చియుండవచ్చు - కాని, కార్యకర్త మాత్రం తన పనిలోనే నిమగ్నమై యున్నాడు గదా అని శ్రామికుడు భావిస్తాడు. కార్యకర్తకు అసలు తీరికే యుండదు, కాని శ్రామికుడు మాత్రం "నా కిన్ని సమస్యలు దాపురించినా, ఈ కార్యకర్తకు నన్ను గురించిన ఆలోచనయే లేదు" అని ఇంకెన్నో విధాల నిందిస్తుంటాడు. అంతకుముందు అతని కోసం ఒక వంద పనులు చేసి యుండ వచ్చు, వాటి కోసం కృతజ్ఞతలు కూడ తెలుప లేదు. కాని, ఏదైన ఒక్క పని చేయజాలక పోతే - కోరిన సమయంలోగా చేయజాలక పోతే - నిందించడమే ! ఇక ఈ రంగంలో అయితే ప్రతిరోజూ క్రొత్త సమస్యలే. నిన్నటి సమస్య నేటికి మరుగున పడుతుంది. అందువలన మన కార్యకర్త జాగ్రత్తగా ఉండి, మెళకువతో అదనుచూచి, శ్రామికునికి సమస్య ఎంత చిన్నదైనాసరే, కనీసం అతనిని కలిసి, సమస్యను సరిగా అవగాహన చేసుకొని, సముచితచర్య తీసుకొంటానని మాట్లాడితే తనపట్ల సరియైన విశ్వాసం కుదిరే అవకాశం ఉంటుంది. శ్రామికునికి కూడా తన సమస్యను పరిష్కరించడం అంత సులభమైనది కాదని కూడ అర్థమవుతుంది.

**శ్రామికుడు కూడా కార్యకర్తను పరీక్షిస్తాడు :**

శ్రామికుడు కూడ కార్యకర్త సమస్యలను పరిష్కరించడంలో దీక్షతో కృషి చేస్తూన్నాడా లేదా; నిజాయితీతో పని చేస్తూన్నాడా లేదా ? అని గమని స్తుంటాడు. కార్యకర్త చేస్తూన్న పనిలో వచ్చే ఆటంకాలను దాట గలిగే సామర్థ్యం

ఉన్నవాడా, లేదా అని పరిశీలిస్తుంటాడు. అతనికి తగినంత పరిజ్ఞానం ఉన్నదా లేదా, కార్య నైపుణ్యం ఉన్నదా లేదా అని గూడ పరీక్షిస్తుంటాడు. పైన కోరిన సద్గుణాలన్నీ ఉన్నప్పటికినీ, ప్రయత్నంలో ఏమాత్రం లోపం లేక, సక్రమంగా కృషి చేసినప్పటికినీ ఎప్పుడైనా పనిలో సఫలం జెందలేక పోయినా, శ్రామికుడు అట్టి కార్యకర్తను దూరం చేసుకోడు.

తన యజమాని కుంతత్రాలు పన్నాడనీ, మళ్ళీ పోట్లాడ తానని సిద్ధ మౌతాడు. ఇలాంటి శ్రామికులు భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యక్షేత్రంలో ఉన్నారు. కార్యకర్త తన విధి నిర్వహణలో సాఫల్యం జెందుతూంటే మంచిదే, కాని సఫలం జెందక పోయినా, శ్రామికుడు అతని పట్ల సంతృప్తిగానే ఉంటాడు. అంటే ఆ కార్యకర్త ఎంతటి శ్రద్ధాసక్తులతోటి పని చేస్తుంటాడో, ఎంతటి నైపుణ్యంతో పని చేస్తుంటాడో, ఎంతటి తెలివి తేటలతో పని చేస్తుంటాడో, యజమానితో ఎంతటి పట్టుదలతో పెనగులాడుతూంటాడో - ఇదంతా గమనించిన తరువాత జయాపజయాలు రెండింటిలోనూ శ్రామికుడు కార్యకర్తతో కలిసియే యుంటాడు.

మన కార్యకర్తలకు ఇలాంటి అనుభవా లెన్నో ! అలాంటి దీక్షా, దక్షత గల కార్యకర్తలు కార్యాలయం పని చేయవలసి వస్తే, చట్టాన్ని సరిగా అవగా హన చేసుకొంటారు, పాత సమస్యలను గూడ జ్ఞప్తియందుంచు కొంటాడు. ఏ విషయంలో ఉన్నత న్యాయాలయాలు ఏ ఏ నిర్ణయాలిచ్చాయో అవి సరిగ్గా గుర్తుంచుకొంటారు, ఇతరుల నడిగి తెలిసికొంటారు. తన యెదుటనున్న సమస్య లను సాధించటానికి మరేదీ ఆధారం లేకపోయినా, దాన్నే విధంగా నైనా సాధించి తీరాలి అని నిర్ధారించుకొంటాడు. అందువలననే అతడు దానితో పెనగులాడు తాడు, వాదిస్తాడు, చాల గట్టిగా వాదిస్తాడు. ఎన్నోమార్లు మేజిస్ట్రేటుతో తలపడి, "ఇంతకు ముందున్నవారు చేసిందే మీరుకూడ చేసేటట్లయితే, మీ విశిష్టత ఏమిటి?" అని నిగ్గదీసి ప్రశ్నిస్తాడు.

'మీ ఆలోచన ప్రకారం అదే సరియైనదని తోచితే, మీరు కూడ అలాగే నిర్ణయించండి. మీ నిర్ణయం ఇతరులకు కూడ మార్గదర్శకం అవుతుంది.' అని

సాగదీస్తాడు. శ్రామికుడు ఇదంతా చూచిన తర్వాత, కార్యకర్త చుట్టూ బొంగరం లాగా తిరుగుతూంటాడు. ప్రతి కార్యకర్త కూడ అంతటి తెలివితేటలు సంపాదించాలి. అచంచల దీక్షతో పరిశ్రమించే స్వభావాన్నేర్పరచుకోవాలి. జయాపజయాలను గురించి చింతిస్తూ కూర్చోకూడదు. విజయం పొందినా సరే, లేక పోయినా సరే.

వకీళ్ళ విషయం మనందరికీ తెలిసిందే. ప్రసిద్ది జెందిన వకీళ్ళు కూడ క్రింది కోర్టులలో ఓడిపోవచ్చు. అది వారి దుర్లక్ష్యం వలన కూడ జరగవచ్చు. శ్రామికుడు వెళ్తాడు, అల్లరిజేస్తాడు. కాని వకీలు అతనితో 'అరే! నీవేమీ చింతించవద్దు వెళ్ళి యజమానితో నీ బాబు ఇంకా పై అంతస్థులో ఉన్నాడు అని చెప్పు, చూద్దాములే' అని ధైర్యం చెబుతాడు. ఈ విధంగా ధైర్యం జెప్పే వకీలు చుట్టూ శ్రామికుడు తిరుగుతూంటాడు, చివరికి సాధిస్తాడు కూడ. అపజయంతో కూడ ధైర్యం వహించి యుండాలి. మన జీవిత కాలమంతా బాగానే ఉంటుందా? మనమైతే మంచి రోజులూ చూశాము, చెడ్డ రోజులూ బ్రతికి బయట పడ్డాము.

భారతీయ మజ్దూర్ సంఘానికి ఇప్పటికి 30 ఏళ్ళు దాటాయి ఇలాంటి సమావేశాలు కాని రోజుల్లో, యూనియన్ సమావేశాలు కాని రోజుల్లో కూడ - అంటే సమావేశాలు ఏర్పరచినా అవి జరగనిచ్చేవారు కాదు. ఎక్కడికి వెళ్ళినా తగిన ఆశ్రయం ఇచ్చేవారే కారు. మాతో మాట్లాడటానికి కూడా ఎవరు వచ్చేవారుకారు, భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్త నిజాయితీగా, దీక్షతో, త్యాగభావంతో పనిచేస్తూండేవాడు. అందుకే ఆ రోజుల్లో కూడ శ్రామికుడు భారతీయ మజ్దూర్ సంఘ ప్రభావానికి లోనయ్యాడు. మంచి రోజుల్లోనూ, గడ్డురోజుల్లోనూ శ్రామికుడు మనతోబాటు కలిసి యుండటానికి కారణం కార్యకర్తే! నదిలో వరదలు వస్తే, నీళ్ళనేం జేస్తారు? అని అడుగుతూంటారు. అలాగే వాతావరణంలో పరిస్థితులలో మార్పురాగానే భారతీయ మజ్దూర్ సంఘ్ లేక మరేదైనా సంస్థలో మరో ప్రవాహం రాగానే సాధారణ ప్రజల దృష్టిలో ఆ సంస్థ మంచిదని తోస్తుంది. కాని, పరిస్థితులు మారి, ఆ వరదలు తగ్గగానే, నదిలోని నీటిమట్టము గూడ తగ్గిపోతుంది. అదే మనకు పరీక్షా సమయం. అట్టి పరిస్థితిలో మన ధ్యేయాన్నీ, లక్ష్యాన్నీ సరిగా అవగాహనచేసి కొన్నవారే, ధ్యేయంతో ఏకాత్మతను పొందినవారే, ఆ లక్ష్యసిద్ధికై 24 గంటలూ అంకితమైనవారే

మనతోబాటు నిలబడి యుంటారు. అట్టి కార్యకర్తలే జయాపజయాలలో, మంచి, గడ్డు రోజులలో, కీర్త్యపకీర్తులలో కూడ భారతీయ మజ్దూర్ సంఘంతో కలిసికట్టుగా యుంటారు. వారు నిరాశ జెందరు. అట్టి కార్యకర్తలు ప్రతిచోటా దృఢంగా నిలబడి, ఈ కార్యాన్ని కొనసాగించటానికి అవసరమైన సద్గుణాలన్నీ-వాటిలో కొన్ని లేకపోతే, నిర్మాణం చేసికొని-పొందటానికి నిర్ణయించుకోవాలి. అపజయంలో కూడ ఈ నిర్ణయం దృఢత్వాన్ని, శక్తినీ సమకూరుస్తుంది.

తన విషయంలో కాఠిన్యం, ఇతరుల విషయంలో మృదుత్వం :

కార్యకర్త ఎలా ఉండాలి? అతనిలో ఒక సద్గుణం ఉండాలి. తనను గురించి, తన సామాజిక, వ్యక్తిగత జీవితాన్ని గురించి ధ్యాస లేకపోవటం. తన స్వంత పనులను చేసుకోవటానికి అతనికి తీరికయే యుండదు. పని చేస్తున్నప్పుడు ఇతరులపట్ల అతని ప్రవర్తన ఎలా ఉండాలి? ఇతరుల జీవితాలు సఫలం జెందాలనీ, వారి కన్ని సౌకర్యాలు కల్గించాలనీ, వారి ఆర్థిక స్థితి అభివృద్ధి జెందాలనేదే అతని తీవ్రమైన వాంఛగా ఉండాలి. వాటిని సాధించడానికే అతడు తన సర్వ శక్తులను ధారవోసి కృషి చేయాలి. తన వియషంలో కఠినం, ఇతరుల విషయంలో ఔదార్యం. ఇతరుల కష్టాలను జూచినపుడు ఇతని హృదయంలో బాధ కల్గినపుడే అతడీవిధంగా పని చేయగల్గుతాడు.

"వైష్ణవ్ జనతో తెణేకహియే, జో ఫిర్ పరాయీ జాణేరే" అనగా ఇతరులలోని ఔన్నత్యాన్ని గుర్తించే వారికి, తమ కష్టాలు తలంపుకే రావు. అంటే స్వంత విషయాలలో కఠోరంగా ప్రవర్తిస్తారన్నమాట. స్వంత విషయాలలోనే కఠోరంగా ప్రవర్తించడం ఎంత గొప్ప విషయం! సాధారణంగా ప్రతి యొక్కరు తమ స్వంత పనులను సక్రమంగా సాధించు కొంటూంటారు. ఇతరులను గురించి మన మెందుకు ఆలోచించాలి, అనుకొంటారు. కాని ఆ విధంగా ప్రవర్తించేవారు 'వైష్ణవ జనులు' కాజాలరు. వైష్ణవ జనులంటే తమను గురించి చాల కఠోరంగా ఉంటూ ఇతరుల విషయంలో చాల ఔదార్యం కలిగిన వారన్న మాట.

"వజ్రా దపి కఠోరాణి మృదూని కుసుమాదపి" అంటే వజ్రం కంటే కఠినంగాను, పూలకంటే మెత్తగాను ఉండగలిగే కార్యకర్తయే సక్రమంగా కృషి చేయగలడు.

ఈ సందర్భంలో ఒక ఉదాహరణ స్ఫురిస్తుంది. లక్నోలో కాంగ్రెసు సమావేశము ఉండినది. రాత్రి చాల ప్రొద్దుపోయేదాకా సభ జరిగింది. చాల చలి వేస్తూండేది. ఉదయం చల్లని గాలి వీస్తూండేది. తిలక్ మహాశయుడు అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. పొయ్యిలో కట్టెలంటించి, ఇతరుల కోసం నీళ్ళు వేడి చేస్తున్నారు. ఆ విధంగా ఆయన ఎందుకు బాధపడ్తున్నారని ఉత్తరప్రదేశ్‌కు జెందిన ఒక వ్యక్తి తిలక్ గారిని అడిగాడు. తిలక్ గారన్నారు "ఈ ప్రాంతానికే జెందిన మీ వంటి వారిపై ఈ చలి ప్రభావం ఏమీ ఉండదు. కాని, దక్షిణ భారతదేశం నుండి వచ్చిన వారిని ఈ చలి చాల బాధిస్తుంది. అందుకని వారికి స్నానం కోసం వేడి నీళ్ళు అవసరం కదా!" వారు స్వయంగా వేడి నీళ్ళతో స్నానం చేసే వారు కారు. స్వంత విషయాలలో కఠినం, ఇతరుల విషయంలో ఔదార్యం! కాబట్టి ఎలాంటి పని జేయటానికైనా వారు సంకోచించేవారు కారు. పని ఎంత చిన్నదైనా సరే, అంతే కాదు, అల్పము, కఠినమైన పనులను వారు స్వయంగా చేసేవారు. మంచి పనులను, సులభంగా చేయగలిగే పనులను వారు ఇతరులకు అప్పగించేవారు. ఇదీ కార్యకర్త ఆలోచనా విధానం. దీనివల్లనే అటువంటి కార్యకర్తముందు గొప్పవారు, మహాజ్ఞానులు, సుప్రసిద్ధ మహాపురుషులు కూడ తలవంచుతారు. తిలక్ గారి ఆ ఆదర్శాన్ని కళ్ళారా చూచినవారి మనసులో ఎలాంటి భావాలు రేకెత్తి యుంటాయో మనం ఆలోచించాలి.

**అల్పమైన పని - భగవంతుని సేవయే :**

మరో ఉదాహరణం. వేల కొలది ఏండ్ల నుండి మన సామాజిక జీవితాన్ని ప్రభావితం చేసిన శ్రీకృష్ణుని కథ అది. ధర్మరాజు రాజసూయ యజ్ఞం చేస్తున్నాడు. రాజసూయ యజ్ఞంలో రాజులందరూ పని చేయాలి. వారికి చేయాల్సిన పని పంచబడుతుంది. మరి ప్రతి సామంత రాజునకు ఏ పని అప్పజెప్పాలనే సమస్య ఎదురైంది. ఉత్తమమైన పనులకోసం పోటీ ఏర్పడింది. ఎందరో రాజులను జయించిన శ్రీకృష్ణుడు అప్పుడు వారితో "దయచేసి నా కొక పని ఇవ్వండి ఈ రాజు లందరూ భోజనం చేసిన తరువాత వారి ఎంగిలి విస్తర్లను తీసి వేయటం, విచ్చేసిన రాజుల పాదాలను కడగటం నాకు అప్ప జెప్పండి" అని కోరాడు. సర్వోత్తముడైన వ్యక్తి అత్యల్పమైన పని కూడా చేయడానికి పూనుకుంటే, ప్రశాంత వాతావరణానికి భంగం రాదనేది సుస్పష్టం. సామాజిక

వాతావరణం కూడా ప్రశాంతంగానే యుంటుంది. అంతటి అల్పమైన పని చేస్తూన్నవారు అది భగవంతుని సేవయే అని భావిస్తారు. వివేకానందుడు కూడ "ఈ దేశంలోని ఒక కుక్క కూడ ఆకలితో అలమటిస్తూన్నంత వరకు నాకు శాంతి దొరకదు" అని అన్నారు. ఆయనకు ఆకలిగొన్న కుక్కను గురించి బాధ యుండేది. ఏకనాథస్వామి జీవితంలోని ఒక సంఘటన కాశీ నుండి రామేశ్వరానికి గంగా జలం తీసికొని పోతున్నారు. దప్పికతో విల విల తన్నుకొనే ఒక గాడిదను దారిలో చూచారు. ఆ గంగా జలాన్ని దానికి త్రాగించారు. ఆ గాడిద దప్పిక తీరి దాని ఆత్మతృప్తి జెందితే, పవిత్ర గంగాజలాన్ని రామేశ్వరం వరకు మోసుకెళ్ళి నందువల్ల వచ్చే పుణ్యాన్ని భగవంతుడు ప్రసాదిస్తాడని ఆయన విశ్వసించారు.

అట్టడుగున నున్నవారి చిన్న చిన్న అవసరాల పట్ల శ్రద్ధ తీసుకొంటు న్నప్పుడు తానేదో నీచ కార్యాన్ని చేస్తున్నట్లుగా మంచి కార్యకర్త ఏ మాత్రమూ భావించడు. అంతేగాక, ఈ పనులందే భగవద్భక్తి నిహితమై యున్నదని భగ వంతుని సేవ ఇదియే యని కార్యకర్త గ్రహించ గలిగితే, అతని వికాసం కూడ త్వరగా అవుతుంది. భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్త ఈ విధంగా ఆలో చిస్తాడు కాబట్టియే మన పని అభివృద్ధి జెందుతూన్నది. ఇతర సంస్థల కార్యకర్త లైతే ఈ విధంగా ఆలోచించరు.

**గడ్డు పరిస్థితిలో కూడ దృఢత్వం :**

క్రొత్త క్రొత్త చోట్ల పని ప్రారంభం అవుతుంది. ఎన్నో మార్లు కష్టాలు కూడ వస్తాయి. పనిబాగా జరుగుతున్న చోట్ల పరిస్థితిలో ఏదోనొక మార్పు రావ డంతో పని కుంటుపడితే, సాధారణ కార్యకర్త మనస్సు కూడ జంకుతుంది. ఇప్పుడు గట్టెక్కడం ఎలాగ? అని ఆలోచిస్తూంటాడు. నేనిప్పుడేం చేయాలి? అని దిక్కుతోచని స్థితిలో తికమక పడుతూంటాడు. అలాంటి సమయంలో అతడు "విభిన్న ప్రాంతాలకు వెళ్ళిన క్రొత్త కార్యకర్తలు ఏ విధంగా ఆలోచిస్తూంటారు? వారికి బాసటగా నిల్చిన వారెవ్వరు? కలిపి పనిచేసే కార్యకర్తలెవరైన నున్నారా? వారికిగల సాధనాలేవి?" మున్నగు అంశాలను ఊహించాలి. అంటే క్రొత్త స్థానా లలో సాధనాలు, సహచరులు, లేనప్పటికినీ పనిచేయాల్సి వస్తుందని పని సాధిస్తా మని, దానిలో విజయం పొంది తీరుతామనీ అచంచల విశ్వాసంతో ముందుకు

సాగేవిధంగా కార్యకర్త ఆలోచనా విధానం ఉండాలి. "రావణుడు రథారూఢుడు కాని శ్రీరామ చంద్రుడు కాలినడకనే వెళ్ళాడు. ఇద్దరి మధ్య యుద్ధం విజృంభించింది- అసమానతలతో కాని, శ్రీరాముడే విజయం పొందాడు." అని గోస్వామి తులసీదాసు చెప్పిన మాటలు మాటి మాటికి స్మరణకు వస్తూంటుంది. 'ప్రతికూల పరిస్థితులలో కూడ నేను సఫలం జెందుతాను, విజయం పొంది తీరుతాను. నేను స్థిర చిత్తంతో, లక్ష్య సిద్ధికోసం నిరంతరం కృషి చేస్తూనే యుంటాను. నేటి దాకా గొప్ప గొప్ప సాధకులంతా ఇదే విధంగా కృషిచేశారు. వారి మార్గాన్నే నేనుకూడ అనుసరించాలి" అని నిర్ధారించుకొని పనిచేసే కార్యకర్త విజయాన్ని సాధిస్తాడు. 'రావణుడు రథారూఢుడైనా శ్రీరాముడు విరథుడే కదా!' అనేదే మన కార్యకర్త ఆలోచనా విధానం.

**గాజువంటి నిష్కల్మషత్వము :**

మన కార్యానికి ఆధారం మన కార్యకర్తయే. మన పని మన కార్యకర్త కారణంగానే పెరుగుతుంది, తరుగుతుంది. అతడే మన సాధనము. ఈ సాధనం స్వచ్ఛంగా ఉండాలి. మన కార్యకర్తల ద్వారానే సమాజానికి మన ధ్యేయం వెల్లడౌతుంది. భక్తుని ద్వారా భగవంతుని దర్శనం కావలసియుంటే భక్తుడెలా ఉండాలి? దానికుదాహరణం - దీపం జ్యోతి. ఆ దీపం తుఫానులో కూడా ప్రజ్వరిల్లు తుండాలంటే, బాగా వెలుగుతూండాలంటే, లాంతరుకు గాజును తగిలిస్తారు. ఆ గాజువలన వెలుతురు బాగా వస్తుంది. గాలి దుమారం రేగినా, జ్యోతి వెలుగుతూనే ఉంటుంది. మనకు మంచి వెలుతురు కూడ ఇస్తూంటుంది. ఈ గాజులో నుంచి మనకు జ్యోతి కన్పిస్తుంది. ఆ గాజులో దుమ్ము చేరితే, వెలుతురు స్పష్టంగా ఉండదు. ఆ గాజుకేదైనా రంగు తగిలితే, జ్యోతి కూడా అదేరంగులో కన్పిస్తుంది. అందుచేతనే మన కార్యకర్త, అంటే సమాజానికి మన ధ్యేయాన్ని వెల్లడించ గల సాధనం, ఆ గాజులాగా నిర్మలంగా, నిష్కల్మషంగా ఉండాలి— తనదంటూ ఎఱ్ఱని, పచ్చని రంగులు కలిగియుండ రాదు. ధ్యేయానికనుగుణంగా కార్యకర్త తన జీవితాన్ని స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంచుకొని, తన ద్వారా ధ్యేయ ప్రకటన సుస్పష్టంగా చేయగలిగితే, ఆ ధ్యేయం పట్ల సరియైన మనోభావం ప్రజలలో కూడ ఏర్పడుతుంది.

అహంకార రాహిత్యము :

చాలా మంది కార్యకర్తలకు కార్యరంగంలో విజయంతోబాటు సమాజం నుండి ప్రశంసల వర్షం కురియగానే, "నేను చెప్పిందే సత్యం, నేను పలికినదే ఈ సిద్ధాంతం బోధిస్తున్నది" అనే భావం కలుగుతుంది. మనసులో అహంకారం ఏర్పడుతుంది. మరి ఈ అహంకార పూరిత భావాలతో ఇతరులతో మాట్లాడితే, మనద్వారా జరిగే ధ్యేయ ప్రకటనకూడ అహంకారమనే గాజుతో చేరి, అస్పష్టంగా తయారవుతుంది. ప్రజలకు అహంకారమే కన్పిస్తుంది. కాబట్టి కార్యకర్తలో అహంకార ముండరాదు. మన ఉత్తమ కార్యకర్తలు, ఉన్నత పదవులలోనివారు, తమ పదవులను, స్థానాన్ని గురించి ప్రకటించుకొంటూ, "నేను ప్రెసిడెంటును, నేను జనరల్ సెక్రెటరినీ, నేను చాల గొప్ప వాడను, నాకు ఎవ్వరూ సమానులు లేరు" అని చెప్పుకొంటూ ఉంటే అది ఉచితం కాదు. మనకు పెద్దరికం మనం చెప్పుకోవడంవలన వస్తుందా ? మన పదవుల వలన వస్తుందా? అలా రానే రాదు. మనం ఇతరుల కోసం తపించడంవలన వస్తుంది. బంగారును కొలిమిలో కాల్చి నప్పుడే స్వచ్ఛమై బయట పడుతుంది.

నెపోలియన్ సిద్ధాంతాలను విస్మరించి, అధికారం కోసం పెనగులాడు తున్నపుడు చెప్పిన మాట చిరస్మరణీయము.

'మానవులు మట్టి బొమ్మలు- వారు పొందిన పదవులను బట్టి వారికి విలువ నిస్తారు'.

అంటే వ్యక్తులు కూడ గణితంలోని అంకెలకు సమానం. వారు పొందిన స్థానాన్ని బట్టి వారి విలువలు, గొప్పతనం నిర్ధారించ బడతాయి. నెపోలియన్ ఒక ఉదాహరణం ద్వారా తన అభిప్రాయాన్ని విశదీకరించాడు. 1111 అనే సంఖ్యనే పరిశీలిద్దాం. అందులో 4 మార్లు 1 వస్తుంది. కాని ప్రతి 1 విలువ వేర్వేరుగా ఉంటుంది. కుడివైపు చివరగానున్న 1 విలువ ఒకటియే, దానికెడమవైపుననున్న 1 విలువ పది. దానికి వెనుకగా నున్న 1 విలువ వంద. దానికి చివర నున్న 1 విలువ ఒక వేయి. అన్నింటి మౌలిక విలువ 1 అయినప్పటికినీ, వాటి స్థానం మారడంతో ఒక దాని విలువ 1, రెండవ దాని విలువ 10, మరో దాని విలువ 100, నాల్గవ దాని విలువ 1,000 అయింది. అంటే అతని దృష్టిలో ఏ వ్యక్తి యైనా ఎంతటి ఉన్నత పదవిలో ఉంటే అతని గొప్ప తనం అంత ఎక్కువగా ఉంటుంది. ఈ కాలంలో ఎక్కువ మంది ఇదే విధంగానే భావిస్తారు.

కాని, మన ఆలోచనా విధానం వేరు. వ్యక్తి యొక్క గొప్పదనం అతని పదవులను బట్టిగాక, అతని ఆంతరంగిక సద్గుణాలను బట్టియే యుంటుందని మన విశ్వాసం. ఏ కార్యకర్తయైనా తన పదవి స్థాయి పెరిగింది కాబట్టి తనలోని సద్గుణాలు కూడ పెరిగాయని భావిస్తూ, సద్గుణ సంపత్తిని పెంచుకోవడానికి మాత్రం అవసరమైన సాధన చేయకుండ, తపస్సు చేయక, తపించక, తీవ్రమైన ఆవేదన జెందకపోతే, అతడను కొనే సద్గుణాలు అతనిలో ఉంటాయా ?

**అలవాట్లను పాడుచేసికోరాదు :**

త్యాగం, తపస్సు, బలిదానాల వలన సౌశీల్యం పెరుగుతుందా? నేనొక సినిమా చూచాను. దానినే విశదీకరించి, ఈ విషయాన్ని ముగిస్తాను. దానిలో ఒక శ్రామిక కార్యకర్త ఉంటాడు. అతడు ముఖ్యమంత్రితో చర్చిస్తాడు. తాను చెప్పదలచుకొన్నది సుస్పష్టంగా చెబుతాడు. ఫలానా పని చేయకపోతే చెప్పుతో కొడతానని ఇంకా ఏవేవో చెబుతాడు. ఈ పని సాధించజాలకపోతే మాత్రం మునిగిపోయేది ఏముందని ఈ ధోరణిలో అతనితోబాటు ఒక మహిళా కార్యదర్శిని ఉంటుంది. అతడు ఇంకా చెబుతూ, 'నాకేమీ? నేను మునుపటి వలె దుకాణం ముంగిట, రైలు పట్టాలపై గూడ కాలక్షేపం జేయగలను అదంతా నాకలవాటే'! అంటాడు. కాని, ఆ మహిళా కార్యదర్శి అందుకొని, "ఇప్పుడా అలవాట్లన్ని మరచిపోయావు! నీవు రైలు, కారు నుండి క్రిందకు దిగడం లేదు కదా! ఇప్పుడా విధంగా నీవేమీ చేయజాలవులే!" అని వెక్కిరించింది. కాబట్టి తన అలవాట్లు విస్మరించక జాగ్రత్తపడటం ప్రతి కార్యకర్తకు అవసరం. నిన్నటిదాకా అతడు ఏ కార్యకర్త యింటిలోనైనా ఆనందంగా ఉండగలిగే వాడు. ఇప్పుడు గుర్తింపు లభించింది. సంప్రదింపుల కోసం వెళ్తాడు, కమిటీ సమావేశాలకు వెళ్తాడు, ప్రయాణం ఖర్చులు, భత్యాలు (టి.ఎ.,డి.ఎ.) ఊహాతీతంగా లభిస్తాయి. అక్కడ ఉండటానికి ఏర్పాట్లు కూడ ఘనంగా ఉంటాయి. వీటన్నింటికీ అలవాటుపడ్డ తర్వాత, మరే కార్యకర్తతోనైనా అతని చిన్న ఇంటిలో ఉండాలంటే సౌకర్యం కనిపించదు, సుఖంగా ఉండజాలడు! అంటే తన అలవాట్లేమైనా మారిపోయాయా? చెడిపోయాయా? లేక బాగున్నాయా? అని తనంతటతానే ఆత్మ విమర్శ చేసికోవాలి. ఆ కార్యకర్త అలవాట్లు పూర్వంవలెనే నిరాడంబరంగా ఉంటే ఆ కార్యకర్త విజయం సాధిస్తాడు. ఎలాంటి అవాంతరాలు వచ్చినా, అతనిని పదభ్రష్టుని జేయజాలవు.

అసలు ఏ వ్యక్తియైనా తన స్వీకృత లక్ష్యం నుండి దారి తప్పటం ఎందుకు? ఆ దారిన వెళ్తే చాల కష్టాలను ఎదుర్కోవలసివస్తుందనా? కష్టాలు, బాధలు అంటే ఏమిటి? దేనివలన బాధలు కలుగుతాయి? పెద్ద బంగళా విడిచిపెట్టి నందుకా? తిరగడానికి వాహన సౌకర్యం లేనందులకా? ఒకసారి సమావేశానికి ఎందుకు రాలేదని ఒక కార్యకర్తను అడిగాను. సమాధానంగా అతడు 'ఏమి చేయాలి? ఏ వాహనం కూడ దొరకలేదు' అని చెప్పాడు. అంటే స్కూటరు దొరకలేదు అన్నమాట. అతని దగ్గర ప్రారంభంలో కూడ స్కూటరులేదు. కాని, ఆ రోజులలో కచ్చితంగా సమావేశాలకు వచ్చేవాడు. క్రమంగా స్కూటరు అలవాటు తగిలింది. ఇప్పుడు స్కూటరు లేకపోతే సమావేశానికి ఎలా రావాలి ? అని భావిస్తున్నాడంటే, అలవాట్లు చెడిపోయాయి అని గ్రహించాలి. కార్యకర్త నిరంతరం 'నా అలవాట్లేవీ చెడిపోవటంలేదు కదా!' అని ఆత్మ పరీక్ష చేసు కొంటూండాలి. మంచి వస్త్రాలు దొరకితే వేసుకో, ఇతరులు ఎలా తొడుగు కుంటారో అలాగే తొడుగుకో, ఎలా జీవితాన్ని గడుపుతారో అలాగే గడుపు. కాని, తిండి బట్టలలో జీవితం గడపటంలో, మాట మంతిలలో, సాధారణ వ్యవహారాలలో మన అలవాట్లేవీ చెడిపోకుండ శ్రద్ధ వహించాలి. మనం వెళ్ళ వలసిన చోట మేలు వస్త్రాలు ధరించకపోతే తగిన గౌరవం దక్కదు అనుకోవటం సరియైనదికాదు. మన బట్టలవలననే మనకు గౌరవం వస్తుందా? నిన్నటిలాగే ఈ రోజున కూడ తొడుక్కోవచ్చు. చాల మంచి కార్యకర్త కాబట్టి, మాసిపోయిన బట్టలు తొడుక్కోవచ్చు అనడం కూడ సరియైనది కాదు.

**భావావేశాన్ని పెంచుకోండి :**

భగవద్భక్తి ఆవహించిన వారికి - బాహ్య ప్రపంచపు ఆలోచనలు ఏవీ ఉండవు. ఏమి తింటారు? ఏమి తొడుక్కుంటారు? ఎలా జీవిస్తున్నారు? - ఇలాంటి వేవీ ఉండవు. ఆ భావావేశంలో, కార్య తత్పరతలోనే వారుంటారు. కార్యానికి సంబంధించిన అదే భావావేశం, తత్పరత మన జీవితంలో, దైనందిన వ్యవహారంలో లుప్తంకాకుండా జాగ్రత్త పడటం అవసరం. భారతీయ మజ్దూర్ సంఘ కార్యకర్త ఈ భావావేశంలోనే ఉంటాడు, కాబట్టే భారతీయ మజ్దూర్ సంఘ్ అభివృద్ధి జెందుతూంది. ఈ భావావేశాన్నే పెంచుకోండి. ఈ కార్యతత్పర తనే పెంచుకోండి. ప్రపంచాన్నంతా ఈ భావావేశంలోనే మునకలు వేయనివ్వండి. మన కార్యం తప్పక వృద్ధి జెందుతుంది, భారతీయ మజ్దూర్ సంఘ్ సతతం అమరంగా వర్ధిల్లు తూంటుంది !

# 4. గమ్యము

బాల సాహిత్యంలో 'ఆలిస్ ఇన్ వండర్ ల్యాండ్' అను ఒక పుస్తకం ఉన్నది. ఆలిస్ ఒక అమ్మాయి పేరు. అందలి కథనం ప్రకారం ఆ అమ్మాయి తన తల్లితో కలిసి బజారునకు పోతుంది; జన సమ్మర్దంలో తల్లినుండి దూరమై పోతుంది. ఆ గుంపులో తన తల్లికోసం అటూ, ఇటూ వెదకుతుంది. వెదకుచూ, వెదకుచూ ఏదో తోచిన దారిన వెళ్ళగా, వెళ్ళగా ఆమె ఒక నిర్జన మార్గం చేరుతుంది. ఇప్పుడింటికి ఎలా జేరుకోవాలో ఎవరి నడుగాలో తోచక చాల భయపడు తుంది. అంతలో అటునుండి ఒక పిల్లి వస్తుంది. సాధారణ జీవితంలో నైతే ఒక వ్యక్తి మరో అపరిచిత వ్యక్తితో మాట్లాడడానికి ఇష్టపడడు, కాని, పిల్లల కథలలో మనుష్యులు జంతువుల మధ్యకూడ సంభాషణ జరగవచ్చు! ఆ అమ్మాయి పిల్లిని 'పిల్లి పిన్నీ, నేను మా తల్లినుండి దూరమయ్యాను. మరల మా యింటికి ఎట్లా వెళ్ళాలో చెప్పమ్మా' అని ప్రార్థిస్తుంది పిల్లి పిన్ని ఆమె వైపు ఎగాదిగా చూచి, 'మీ యిల్లు ఎక్కడ ఉందో, దాని చిరునామా ఏమిటో? ముందుగా చెప్పితే, అక్కడ వెళ్ళడానికి దారి ఏమిటో నేను చెప్పగలను, అని ఆలీస్ తో చెబుతుంది అప్పుడా అమ్మాయి 'అదేకదా నాకు వచ్చిన చిక్కు! మా ఇల్లెక్కడ ఉన్నదో నాకు తెలియదు!' అని పిల్లితో అనగానే, ఆ పిల్లి 'అసలు నీ వెక్కడకు వెళ్ళాలో నీకు తెలియక పోతే, అక్కడకు ఏదారిన వెళ్ళాలో నేనెలా చెప్పగలను?' అని జారు కొంటుంది.

## గమ్యమే ఒక సమస్య :

'ఆలిస్ ఇన్ వండర్ ల్యాండ్'లో ఈ చిన్న సంఘటన వస్తుంది. ఈనాటి సమాజాన్ని గమనిస్తే కూడ చేరవలసిన స్థానమే తెలియని సమస్యయే ప్రజల ముందున్నట్లుగా తెలుస్తుంది. అందువలన ఎవరైనా దారి తప్పారా లేక అయోమయ పరిస్థితిలో నున్నారా అంటే సరిగా చెప్పలేము. ఉండవలసిన స్థానము, అందుకో వలసిన లక్ష్యము ఖచ్చితంగా నిర్ధారింపబడిన వారి విషయంలోనైతే లక్ష్యాన్ని అందుకోవడానికి వెళ్ళవలసిన దారి ఫలానా అని, ఆ దారి తప్పి మరో దారి

వెళ్తుంటే ఏదో అయోమయంలో పడ్డారని తేల్చి చెప్పవచ్చు. బొంబాయి రేవు నుండి ఒక ఓడ బయలుదేరింది అనుకొందాము. అది ఫలానా చోటికి వెళ్ళాలి అని నిర్ధారించక, ఊరకే అక్కడ నుండి వెళ్ళిపోవలసిందిగా చెప్పినట్లైతే, అది ఏదో దిశగా వెళ్ళిపోతుంది. అది టోక్యోకు దారి తీయవచ్చు, లండన్ వైపునకే కావచ్చు లేదా వాషింగ్టన్‌కే కావచ్చు! దాని అంతిమ లక్ష్యమే, గమ్యమే నిర్ధారింపబడ లేదు కదా! చీకటి గదిలో కూర్చొని గురిచూచి కొట్టమని చెబితే ఎవరైనా కానీ ఎట్లా గురి చూస్తారు ? ఎలా కొడతారు ? తుపాకీ కాల్చడం నేర్పేటప్పుడు గురి కుదర డానికి 'బుల్స్ ఐ' ని ఏర్పరుస్తారు. తుపాకీ కాల్చినపుడు ఆ 'బుల్స్ ఐ' కేంద్ర బిందువుకు తగిలితే నూటికి నూరు గుణములు (మార్కులు) వస్తాయి, దానికి చుట్టు ప్రక్కల ఎంత దూరంగా తగిలితే అన్ని గుణములు తగ్గిస్తారు. కాని, చీకటిలో కాల్చాలని చెప్పినపుడు, 'బుల్స్ ఐ' కన్పించక పోవడంతో మీకు తోచిన దిశలో కాల్పులు కొనసాగిస్తారు. తుపాకిగుండు తగల వలసిన బిందువే నిర్ధారింప బడనప్పుడు, గుండు ఎక్కడ తగిలితే అదియే సరియైన స్థానము అనుకోవాలి! అదే విధంగా ఈనాడు మనం ఎవ్వరిని గురించియైనా అతడు అయోమయంలో పడ్డాడని, లేక దారి తప్పాడని చెప్పడం కష్టం. మన అంతిమ లక్ష్యం ఏమిటో ఎవరికీ తెలియదు కదా ! దేనికో పరుగులు తీస్తున్నారు. ఎక్కడకు వెళ్ళాలో తెలియదు. కొందరి పరిస్థితి ఈ విధంగా ఉన్నది.

మానవ జీవితానికి గమ్యస్థానం ఏముండాలి? దానికోసం ప్రేరణ ఏదుండాలి? అనే అంశాలపై మహాత్ములు సూచించిన మార్గాలు వేర్వేరుగా ఉండవచ్చు, కాని వాటి నన్నింటినీ ప్రముఖంగా రెండు భాగాలుగా విభజింపవచ్చును. ఒకటి స్వచ్ఛమైన భౌతిక వాదమైతే రెండవది అభౌతికవాదము. భౌతికవాదులు కాని వారందరూ ఆధ్యాత్మికులు కాకపోవచ్చుకదా! అందుకని నేను 'ఆధ్యాత్మిక' పద ప్రయోగం చేయటం లేదు. గొప్పవారు చెప్పిన ఈ విషయాలను పెద్ద పెద్ద మాటలలో చెప్పారు. సాధారణ మానవులకు కూడ ఈ ఆలోచనలు రావని కాదు, వారు పెద్ద మాటలలో వేదాంతిక పదజాలంలో తమ భావాలను ప్రకటించజాలరు. భావాలు ఒకటే అయినా, భావప్రకటన ఒకే విధంగా ఉండక పోవచ్చును.

స్వార్థపూరిత ప్రేరణ :

నా బాల్యంలోని ఒక విషయం జ్ఞాపకం వస్తుంది. మా తండ్రిగారు ఒంటరిగా ఉండేవారు. వారికి తోబుట్టువులు ఎవరూ లేరు. కాని వారి పినతండ్రి కొడుకులు ముగ్గురు ఉండేవారు. ఆయనకు వారు సోదర తుల్యులు. అంటే నాకు పిన తండ్రులు. మా తండ్రిగారి పిన తండ్రిగారి భార్య అంటే నాకు నాయనమ్మ కూడా ఉండేది. బాల్యంలో ఎక్కువ సంగతు లేవీ అర్థమయ్యేవి కావు. అయినా నాయనమ్మ వ్యవహారం ఏమీ బాగు లేదనిపించేది. అలా ఎందుకనిపించేది ? బాల్యంలో అంత ఎక్కువగా ఎవరూ ఆలోచింప జాలరు కదా! కాని, నేను కాలేజీలో చేరే అగత్యం లేక పోయినా, కొద్దిగా ఆర్థిక శాస్త్రం చదివిం తర్వాత చాల ఆశ్చర్యం కలిగించే ఒక సత్యం నాకు బోధ పడింది. అదేమిటంటే పెట్టుబడి సిద్ధాంతానికి బైబిలు లాగా మన్నింపబడే 'వెల్త్ ఆఫ్ నేషన్' గ్రంథాన్ని రచించి, పెట్టుబడి విధానాన్ని నిర్వచించిన ఆదమ్ స్మిత్ భావాలు, మా నాయనమ్మ భావాలున్నూ ఒక్కటే అని. ఆమె ఆర్థిక శాస్త్రం అయితే చదువ లేదు కదా, మరి భావాలలో ఇంతటి సామ్యం ఎలా వచ్చిందా? అని ఆశ్చర్యం వేసింది. ఇద్దరి భావం ఏమిటి? వ్యక్తికి ప్రేరణ నిచ్చేది వ్యక్తిగత స్వార్థమే, మరేదీ కాదు అనేదే వారి భావం. ప్రతి వ్యక్తియు సుఖాన్నే కోరుకొంటాడు. ఆ సుఖాన్ని పొందడానికి స్వార్థాన్నే సాధించాలి స్వార్థాన్ని సాధించడానికి అతడన్ని విధాలా పాటుపడతాడు. అలాంటి కృషివలన అతని సంపద పెరుగుతుంది. ప్రతి వ్యక్తి తన సంపదను పెంచుకొంటే, అదంతా కలిసి జాతి సంపద కూడా పెరుగుతుంది. జాతి సంపద ఈ విధంగా వికసిస్తుందని ఆదమ్ స్మిత్ అన్నమాట అనుకోండి - అవి మా నాయనమ్మకు స్ఫురించలేదేమో ! కాని, ఇద్దరూ ఒప్పుకొన్నటువంటి మౌలిక సిద్ధాంతం ఏమంటే వ్యక్తికి ప్రేరణ నిచ్చేది వ్యక్తిగత స్వార్థమే నని !

పక్షపాత ధోరణి :

నేను పెద్దవాడినయ్యే కొలదీ కుటుంబంలో జరుగుతున్నదీ, జరగనిదీ క్రమక్రమంగా అర్థమయింది. నాయనమ్మ ప్రవర్తన చాలా స్వార్థంతో కూడి యుండింది. మా తాతగారు కొంత ఉదార స్వభావులు. వారు పర్యటన చేస్తూండే వారు. తమ పర్యటనలో వారొకసారి ఒక బాలుని చూచారు. స్ఫురద్రూపి, ప్రతిభా వంతుడు, కాని పేదకుటుంబానికి చెందినవాడు. ఆ బాలుని తన వద్ద ఉంచుకొని, పోషించాలని తాతగారికి తోచింది. అతనిని కనీసం మెట్రిక్యులేషన్ వరకైనా

చదివించాలని ఆయన భావించారు. తనకు ముగ్గురు కుమారు లున్నారు. వారితో బాటు మరొకరి పోషణ ఏమంత కష్టం కాదు. అందుకని ఆ బాలుని తీసికొని వచ్చారు. తమ ఇంటిలో ఉంచుకొన్నారు. నాయనమ్మకు ఇది రుచించలేదు. 'మనకి పీడ ఎందుకు? వీడేమీ మనకు ఆ పుత్రా? బంధువా? వీడికోసం మన డబ్బెందుకు ఖర్చుపెట్టాలి?' అని గొణుగుకుంటూ ఉండేది. తాతగారి ఎదుట ఏమీ చెప్పడానికి సాహసించేది కాదు. కానీ, రోజురోజుకూ ప్రతి విషయంలోనూ అతని పట్ల పక్షపాతం చూపించసాగింది. భోజనానికి వడ్డించేటప్పుడు అందరూ ఒకే పంక్తిలో కూర్చొంటే ఆ పిల్లవానిని పంక్తిలో చివరగా కూర్చోబెట్టేది. లడ్లు వడ్డించేటప్పుడు మొదటినుండి ప్రతి యొక్కరికి ఒక్కొక్క లడ్డు వడ్డిస్తూ, చివరిదాకా వెళ్ళి, వాపసు వెళ్ళేటప్పుడు మళ్ళీ ఒక్కొక్క లడ్డు వడ్డించేది. ఆ విధంగా ఆ పిల్లవాడికేమో ఒక్కటే లడ్డు లభించేది. బయటి నుండి చూచేవారికి దీనిలో పక్షపాతమున్నట్లుగా కనిపించదు. కాని ఆమె మాత్రం ఇటువైపు నుండి ఒక్కొక్కరికి ఒక్కొక్క లడ్డు వడ్డించేది, అటువైపు నుండి వాపసు వస్తూ వానిని వదలిపెట్టి ఇతరులకు మాత్రం ఒక్కొక్కలడ్డు వడ్డించేది. పాపం! వానికిమాత్రం ఒక్కటే లడ్డు లభించేది వాడు చిన్నపిల్లవాడుగా ఉన్న రోజులలో పక్షపాతం జరుగుతున్నట్లుగా అతనికి తోచనేలేదు. తాతగారు బజారునుండి ఇంటికేదైనా తినే వస్తువు తెస్తే, దానిని ఎవరికీ తెలియకుండా దాచిపెట్టేది. తన పిల్లలను ఒక్కొక్కరినే పిలిచి, 'ఆ వెధవను బజారునుండి సరకులు తీసికొని రావడానికి నేనిప్పుడే పంపిస్తాను. మీరు తొందరగా ఆ దాచి యుంచినది తిని, నోరు శుభ్రంగా కడుగు కొని రండి, అతనికేమీ తెలుపకండి.' అని వారికి రహస్యంగా చెవిలో చెప్పేది. అంటే ఈ విధంగా అడుగడుగునా స్వార్థం ఉట్టిపడేది. మిగతాది, మీరూహించు కోవచ్చును. ఆమె ప్రవర్తన అలాగ ఉండేది. మా అమ్మను "ఆమె చాల అమాయకురాలు ఏమీ అర్థం చేసికోదు, వ్యవహార జ్ఞానమే లేదు" అని గేలి చేసేది. మేము మాత్రం ఆ రోజులలో ఆర్థిక శాస్త్రమూ చదవలేదు. ఏ మనో విజ్ఞానమూ అభ్యసించలేదనుకోండి. ఎక్కువ విషయాలు అర్థమయ్యేవి కావు, కాని జరిగేదంతా గమనిస్తూండే వాడను.

మితిమీరిన స్వార్థం యొక్క దుష్పరిణామాలు :

అలాంటి మితిమీరిన స్వార్థపూరిత వాతావరణంలో దానివలన సంక్రమించే చెడు సంస్కారాలతో మా చిన్నాన్నలు ముగ్గురూ పెరిగారు. చివరిలో

చాల విచిత్రమైన స్థితి చూడాల్సి వచ్చింది. ముగ్గురికీ వివాహాలు జరిగాయి. మా తాతగారు మరణించారు. తర్వాత వారు ముగ్గురూ వేర్వేరు ఇండ్లు కట్టుకొన్నారు. అంతకుముందు తాతగారితో బాటు వారంతా అద్దె ఇంట్లో ఉండేవారు. ఆ యిల్లు వదలవలసి వచ్చినపుడు వారి తల్లి ఎవరితో బాటు ఉండాలనే ప్రశ్న ఎదుర యింది. నేను కట్టుకొన్న యిల్లు చిన్నదని ఒకరంటే, నా భార్య ఆరోగ్యం ఎప్పుడూ బాగుండదని ఇంకొకరన్నారు. ఇలాంటిదే మరొకరన్నారు. ప్రతి యొక్కడూ ఆమెను వదలించు కోడానికే పెనుగు లాడారు. ఒక వేళ ఆమెయే తనంతట తాను ఎవరి యింటిలో నైనా ఉంటే, ఆ కోడలు ఏటు పోటు మాటలం టూండేది. కోడలి ఏటు పోటు మాటలకు విసుగెత్తి కొడుకుతో చెబితే, అతడేమీ పట్టించుకొనేవాడుకాడు. అంతేగాక 'ఆమె ఇంటి పనులన్నీ నెత్తిన వేసికొందిగదా! ఆమె చెప్పినట్లే వినగూడదా ? ఇంత ముసలి దానివై కూడ ఎందుకిలా కయ్యం పెంచుకొంటూన్నావు ?' అని భార్యను సమర్థిస్తూ, తల్లిని చీదరించుకొనే వాడు. ఆమె జీవితం చాల దారిద్ర్యంతో గడవసాగింది, ముసలి తనం అతి దుర్భరంగా అయిపోయింది. పాపం ! ఆ నిస్సహాయురాలు దుఃఖాన్ని, అవమానాన్నీ ఉగ మ్రింగుతూ, మిగతా జీవితాన్ని వెళ్ళబోసుకొనవలసివచ్చింది. 'మా పినతండ్రులు చాల విచిత్రంగా ప్రవర్తిస్తున్నారు. అందరూ భార్యాలోలురై పోయారు. తల్లిని గురించి పట్టించుకొనే వారేలేరు'. అని నేను మా అమ్మగారితో అప్పుడప్పుడు అనే వాడను. అందుకామె 'అందులో వారి తప్పేమీ లేదు. ఉన్నప్పుడు మీ అవ్వగారు వారిలో అతి స్వార్థపూరితమైన భావాలను ప్రేరేపించి, పోషించింది. వారిలోని ఈ అతి స్వార్థభావాలే ఈనాడు ఆమెకే వ్యతిరేకంగా పరిణమించి తమను కని పెంచిన తమ తల్లికే వ్యతిరేకంగా ప్రయోగించేంతటి దుష్పరిణామానికి దారి తీశాయి. ఇందులో పూర్తిగా మీ అవ్వ గారిదే దోషం, మీ చిన్నాయనలది ఏమాత్రమూ దోషం లేదు' అని వివరిస్తూండే వారు. ఇలాంటి అతి స్వార్థభావాలు తాత్కాలికంగానైతే చాల అనుకూలంగా ఉన్నట్లే కన్పించ వచ్చు. దాని వలన వచ్చే దుష్పరిణామాలు అప్పటికప్పుడు అర్థంగాక పోవచ్చు, కాని వాటి దుష్ప్రి భావాల నుండి ఎవరూ తప్పించుకోజాలరు.

**అమెరికా సహజ స్వరూపం :**

నేను అమెరికాకు వెళ్ళాను. అక్కడ కలిసిన ముగ్గురు స్వయంసేవకులు తమకు గల్గిన ఒక అనుభవాన్ని తెలిపారు. వారొకసారి వివరాలను సేకరించాలనే

ఉత్సుకతతో ఒక వృద్ధాశ్రమానికి వెళ్ళారు. అక్కడెందరో వృద్ధులు సమావేశమై యున్నారు. వారందరూ ఐశ్వర్యవంతులు - లక్షాధీశ్వరులు, కోటీశ్వరులే. వారందరూ చూడటానికి వెళ్ళినవారిని హార్దికంగా ఆహ్వానించారు, చాల ఆనందంగా మాట్లాడుతూ కాలం గడిపారు ఒక గంట సేపైన తరువాత ఆ స్వయంసేవకులు వాపసు బయలుదేర బోతూంటే, అక్కడి వారెందరో కన్నీరు గారుస్తూ, 'మీరు ఇలాగే వస్తూండండి, పై ఆదివారం కూడ తప్పక రండి' అని కోరారు. అక్కడ వెళ్ళినవారికి ఆశ్చర్యం కలిగినది. "ఎందుకలాగ ? మీరలా ఎందుకంటున్నారు?" అని వారడిగారు. అందుకు అక్కడి వారందరూ ఏక కంఠంతో "మమ్ములను కలవటానికి అసలు ఎవరు వస్తారు ? మీరైనా వచ్చారు కదా ! మా కెంతో ఆనందంగా ఉన్నది" అని చెప్పారు. కోటీశ్వరుల పరిస్థితి ఇలా ఉంది ! ఇంకను వారు "మా పిల్లలు మమ్ములను కలుసుకోవటానికి రానే రారు. మాకున్న ఎస్టేటుల నుండి, బ్యాంకు నిల్వల నుండి మా జీవితాలు గడుస్తున్నాయి. పిల్లలందరూ పెద్ద వారయ్యారు. వారు తమ తమ కుటుంబాలవరకే పరిమితమై పోయారు. మమ్ము లను పట్టించుకొనే వారే లేరు. 3, 4 సంవత్సరాల కొకసారి వీలుంటే వచ్చి కలుస్తారు. లేకపోతే క్రిస్మస్ సందర్భంగా ఒక పూలగుత్తిని పంపిస్తారు. అంతకు మించి వారికి మా ధ్యాసే యుండదు.' అని వాపోయారు.

"ఇంత విచిత్రంగా ఉండటం ఎలా సంభవం ?" అని ఆ స్వయంసేవకుల నడిగాను. వారు దానికి సమాధానంగా "అమెరికా పురోగామి దేశం. ఇక్కడివారు అభివృద్ధి కాముకులు, అగ్రగాములు, మౌలికంగా కొన్ని ప్రత్యేకతలను గల్గిన వారు! వారికి తమ సుఖాలే కావాలి. వివాహమైన తరువాత వైవాహిక జీవితం ప్రారంభంలో ఆనంద దాయిగా కన్పించినా, సంతానం కల్గిన తరువాత అదే తమ సుఖాలకు అడ్డంకిగా ఉన్నదని తల్లిదండ్రులిద్దరూ తల పట్టుకొని దైన్యం జెందడమే దీనికి కారణం. బాలుడుగా నున్నప్పుడే అతని తల్లిదండ్రు లతనిని కంటకంగా చూస్తే, వయసులో పసివాడై నప్పటికినీ, తనను వారు అసహ్యించు కొంటున్నారని మాత్రము గ్రహించ గల్గుతాడు. తానెవ్వరికీ అవసరం లేదని గ్రహిస్తాడు. ఆ బాలుడు పెద్దవాడైన తరువాత కూడ పరాయివాడు గానే ప్రవర్తిస్తాడు. ఆ బాలుని మనసులో తన తల్లి దండ్రుల నుండి దూరమై పోవాలని సహజంగా కోరిక కల్గుతుంది. తన కాళ్ళమీద, స్వశక్తిపై నిలబడాలని అతడు

ఆలోచిస్తాడు. అందుచేత 9, 10 సంవత్సరాలు వయస్సు రాగానే క్రమక్రమంగా అతడు పనిచేయటం ప్రారంభిస్తాడు. అమెరికాలో చిన్న చిన్న పనులు చేసే వారికి ఒక గంటకు 3 డాలర్లు లభిస్తాయి. ఎవరిదైనా కారు శుభ్రం చేయటం, గ్లాసులు కడగటం, ఎవరి యింట్లో నైనా చెత్త నూడ్చటం వంటి పనులను ఆ 9, 10 సంవత్సరాల బాలుడు చేయ నారంభిస్తాడు. స్వశక్తిపై తన కాళ్ళ మీద తాను నిలబడగలిగే స్తోమత వచ్చే కొలదీ అతడు తన కుటుంబం నుండి దూరం అవుతూంటాడు. పెండ్లి చేసుకొని, తల్లిదండ్రుల వద్ద సెలవు తీసుకొన్నాడంటే మళ్ళీ వారి ముఖం చూడడు! వారు చనిపోయిన తర్వాతనే వారి ఆస్తికి వారసత్వం విషయంలో కొట్లాడటానికే మళ్ళీ వస్తాడు. అమెరికా డిటెక్టివ్ నవలల సుప్రసిద్ధ రచయిత్రి అగాధా క్రిష్టీ. అమెరికా జీవితాన్ని గురించి ఒక మంచి మాట వ్రాసింది. ఆంగ్లంలో 'వేర్ దేర్ ఈజ్ ఎ విల్, దేర్ ఈజ్ ఎ వే' అనగా 'మనసుంటే మార్గం ఉంది', అనే సూత్రానికి సమానార్థకంగా, 'వేర్ దేర్ ఈజ్ ఎ విల్, దేర్ ఈజ్ ఎ మర్డర్' అంటే వారసత్వం ఉన్నచోట హత్య ఉంటుంది' అని అగాథా క్రిష్టి వాక్యం! వీలునామా ఉందంటే హత్య కూడా తప్పక ఉంటుం దన్న మాట! తన వారసత్వ హక్కు కోసం పొట్లాడటానికే వస్తాడు, మధ్యలో మరి దేనికీ రాడు! తల్లి దండ్రులు యౌవ్వనాన్ని పోగొట్టుకొని వృద్ధులైనప్పుడు తాము ముసలివారై పోయారని, ఎవరైనా తమకు చేయూత నివ్వాలని గ్రహింప గల్గుతారు. వారికి చేయూత నివ్వటం అవసరమని యువకులు గుర్తించాలని ఆ వృద్ధులు ఆశిస్తారు. కాని, తమ తాత్కాలిక సుఖాల వెంటబడి, తమ పిల్లల పట్ల చూపిన ప్రవర్తనయే ఆ పిల్లల మనస్సులో తమ పట్ల అయిష్టత కలగడానికి కారణమని, ఇప్పుడు వృద్ధులైన తమను చూచి పోవడానికి గూడ వారికి సమయం లేక పోయిందని అప్పుడే గ్రహిస్తారు

వారి మానసిక స్థితి ఆవిధంగా ఉన్న సమయంలో ఆ ముగ్గురు సంఘ స్వయంసేవకులు వారిని కలవటానికి పోగా, కోటికి పడగలెత్తిన ఆ ధనవంతు లందరూ వారిని ప్రేమతో సంభాషించడానికి ఎవ్వరూ రావడం లేదని ఆందోళన జెందారు. ఇక్కడున్నదంతా సుఖప్రదంగా ఉన్నది, ఏలాంటి అసౌకర్యమూ లేదు, కాని అనురాగంతో మాట్లాడటానికి ఎవరూ రావటం లేదు. వాస్తవంగా స్వార్థమంటే ఏమిటో దీని నుండి గ్రహించ గల్గుతాము. దీనిని ఒక సామాన్య మానవుడు సరిగా గ్రహించగల్గుతాడా ?

**సుఖమంటే ఏమిటి ?**

సుఖమంటే ఏమిటి? దీని గురించియైనా సామాన్య మానవుడు యథార్థమైన ఊహలు కలిగి యుండగలడా ! లేడా? అనే ప్రశ్న కూడా మన మనసులో ఉదయిస్తుంది. సుఖం కావాలని కోరకోవడం మంచిదే. పాశ్చాత్యులే గాక, మన భావి ద్రష్టలు, ఋషులు, మునులందరూ సంపూర్ణ జీవన లక్ష్యం సుఖమే నని చాటారు. దీనిలో నేమి అనుమానమే లేదు. అట్టి సుఖాన్ని ఎలా పొందాలి ? అనే అంశం మీదనే జీవన సిద్ధాంతం ఆధారపడియున్నది.

జీవితాన్ని ముక్కలు, ముక్కలుగా, విడి విడి భాగాలుగా చేయటం సాధ్యం కాదు. జీవితం అభిన్నము. దానిని గమనించాల్సిన పద్ధతులు వేరు. ఒక పద్ధతి వ్యవహారికమైనదైతే, మరొకటి సైద్ధాంతికము. మన సైద్ధాంతిక దృక్పథం సరిగానే ఉన్నది కాని వ్యావహారికంగా సాధ్యమయ్యేది కాదని కొందరి అభిప్రాయము. కాని ఇది సత్యం కాదు. మన పూర్వులు సుఖ దుఃఖాల గురించి చాల స్పష్టంగానే నిర్వచించారు.

**అనుకూల స్పందనయే సుఖము, ప్రతికూల స్పందనయే దుఃఖము :**

అంటే ఏ కారణము చేతనైనా అనుకూల స్పందనం కలిగితే దానిని సుఖమని, ప్రతికూల స్పందన కలిగితే దానిని దుఃఖమని అంటారు. బుద్ధి వికసించని జీవాలు కూడ గ్రహించగలిగేటువంటి సరళ నిర్వచనం ఇది. ఉత్తర సైబీరియా వంటి అతి చల్లని ప్రదేశాలలో నివసించే పశు పక్ష్యాదులు శీతా కాలంలో వెచ్చని ప్రదేశాలకు వస్తాయని, అక్కడ వేడి ఎక్కువైనపుడు అవి మరల శీతల ప్రదేశాలకు వలస పోతాయని మీరు భూగోళశాస్త్రంలో చదివే యుంటారు. అంటే పక్షులు కూడ ప్రతికూల స్పందన కలిగించు ప్రదేశం వదలి, అనుకూల స్పందన వైపుగా వెళ్ళాలని గ్రహించాయి. మనం పశు పక్ష్యాదులవంటి జీవులము కాము. మనం బుద్ధి నుపయోగించి, ఆలోచించగలం. అందుచేత సుఖాన్ని పొందాలను కొన్నప్పుడు కూడ దాని వైవిధ్యము, తీరు, లోతు, స్థాయిత్వము (ఎంత కాలము కొనసాగ గలిగేదీ) ఎంతెంత ఉండాలి అనే అంశాలను కూడ మనం ఆలోచించాలి.

**తాత్కాలిక సుఖము :**

నాయకుడిగా పేరొందిన మా మిత్రుడొక డున్నాడు. అతనికి మధుమేహం ఉన్నది. అతడు తీపి పదార్థాలను ముట్టుకో కూడదని వైద్యులు నిషేధించారు. కాని అతనికి తీపి పదార్థాలంటే చాల యిష్టం. మేము కూడ అతనితో కలిసి కొన్ని రోజులు పర్యటించాము. అతని ఆనందాన్ని మేము గమనించాము. ఏదైనా స్టేషనులో ఎవరైనా మిఠాయి పొట్లం తీసికొని వస్తే 'ఇదంతా ఎందుకు తెచ్చారు? నాకు మధుమేహం ఉన్నదని మీకు తెలియదా? అసలు మీకు విచక్షణా జ్ఞాన మంటూ ఉన్నదా? నన్ను ఈ విధంగా చంపాలని ఉందా మీకు?' అని వారిపై మండిపడేవారు. కాని అతని అనుయాయులు అతనిని ఎన్నో ఏండ్లనుండి ఎరుగుదురు. వారు ఓపికగా అతడనేదంతా పడేవారు. అతడు వారిని దుయ్యబట్టడం పూర్తి గాకానే, వారాయనతో 'అలా కాదు మహాత్మా! ఈ బర్ఫీ సరి క్రొత్తరకానిది. అందుకే మీ కోసం తెచ్చాము' అని బ్రతిమిలాడేవారు. వెంటనే అతడందుకొని "ఆదియా సంగతి! అలాగయితే ఇవ్వండి. ఇవ్వండంటే పూర్తిగానే ఇచ్చి వెళ్ళండి'' అనేవారు ఒకమారు వారు మాతో భోజనానికి కూర్చొన్నారు. అప్పుడు మాతో మరొక మిత్రుడు కూడ ఉన్నాడు. పాయసం వడ్డిస్తున్నారు. మన నాయకుని ప్రక్కనే కూర్చొన్న ఆ మిత్రుడు తన గిన్నెను ఖాళీచేసి, మరల రెండు మార్లు పాయసం వేయించుకొని త్రాగాడు. కాని, వడ్డించే ఆమె ఒక్కడుగు ముందునకు వెళ్ళి, ఈ నాయకుని కంచం దగ్గరకు వెళ్ళగానే, ఆ మిత్రుడు తన చేతిని అడ్డంగా పెట్టి "వద్దు, వడ్డించవద్దు, ఇతనికి మధుమేహం ఉన్నది". అంటూ నాయకునకు పాయసం వడ్డించకుండా ఆపాడు. పాపం! నాయకుడు అతని వైపు చూస్తూ ఉండిపోయాడు. రెండవసారి కూడ ఇలాగే జరిగింది. కాని, మూడవసారి కూడ ఆ మిత్రుడు గిన్నెకడ్డంగా చేతిని పెట్టగానే, అతడు మిత్రుని చేతిని తన చేతిలో ఎరగగొడుతూ, "ఏయ్, మధుమేహరోగం నీకా? నాకా? నీ వెందుకు పాయసం వేయకుండ అడ్డు తగులుతున్నావు?" అని ఘీంకరించి, ఆ వడ్డించే ఆమెను పేరు పెట్టి పిలచి, ఈ గిన్నె నిండుగా పాయసం వడ్డించాలని ఆదేశించాడు.

తరువాత అతని స్థితి ఏమయిందో కూడ గమనించాము. మిఠాయి తినేటప్పుడేమో అతడు చాల ఆనందంగానే ఉండేవాడు. శరీరంలో చెక్కెర పరిమాణం ఎక్కువయ్యేది. వెంటనే ఇన్సూలిన్ ఇంజెక్షన్ తీసుకొనేవాడు. అప్పుడతని ముఖ

మంతా వంకరలు తిరిగిపోతుండేది. శారీరకంగా కూడ అతడు చాల సున్నితంగా ఉండేవాడు. ఇంజెక్షనులు కూడ అతనికి అనుకూలించేవి కావు. ముఖాన్ని వంకర టింకరులుగా త్రిప్పుతూ అతడు 'ఇదంతా ఎమిటి? మనవారు ఎంతటి మూర్ఖులు? నా కింత కష్టం తెచ్చిపెట్టారు?' అని ఆక్రోశించేవాడు. అంటే అతడు ఇతరుల కోసమే మిఠాయి తిన్నాడని అనుకోవాలా? ఉదయం పాయసం త్రాగితే, రసగుల్లాలు సేవిస్తే, ఆనందం, ఇన్సూలిన్ ఇంజెక్షన్ తీసికోగానే ముఖ కవళికలు మారిపోయేవి! దీనినే సుఖం అంటారా? ఈ సుఖం తాత్కాలికమే ఇలాంటి సుఖమేనా మనకు కావలసింది?

వాస్తవానికి చిరంతనంగా స్థిరంగా ఉండేదే, నిరంతరం కొనసాగేదే, ప్రగాఢంగా ఉండేదే మనం కోరుకోవలసిన సుఖం. పది గంటలకు సుఖం, పావు గంట తరువాత దుఃఖం, మళ్ళీ పదకొండున్నర గంటలకు సుఖం కాదు. వస్తూ పోతూన్న సుఖం కాదు, ఒక్కొక్క క్షణం కన్పించి, వెంటనే అదృశ్యమైపోయే సుఖం కాదు. అలాంటిది కాదు మనం కోరుకునే సుఖం. ఇతర ప్రాణులకంటె మానవుని బుద్ధి అతీతమైనది. కాబట్టి తన సుఖము దేనిలో నిహితమైయున్నదో అతడు గ్రహించాలి సుఖమే గమ్యం. మన సమాజ ద్రష్టలు కూడ మానవ జీవితానికి అంతిమ లక్ష్యం సుఖమేనని నిస్సంకోచంగా స్పష్టీకరించారు. కాని సుఖ మంటే ఏమిటో సరిగా గ్రహించాలని కూడ వారు శాసించారు. ఆ సుఖం దేనినుండి వస్తుందో సరిగా గ్రహించాలి

ఈ రోజులలో ఏవరికీ ఆలోచించ డానికే తీరికలేదంటారు "నిరంతరంగా పని చేస్తూండటంవలన, అసలు జీవించడానికే సమయం లేదు" అని ఒక పాశ్చాత్య గ్రంథకర్త అభిప్రాయం. మన నాయకులలో కూడ ఇలాంటి పరిస్థితియే. "నేనెప్పుడూ మాట్లాడవలసివస్తుంది గదా! అందువలన నాకు ఆలోచించడానికే తీరిక ఉండదు" అని కొందరు నాయకులు అంటూంటారు. అలాగే జన సామాన్యం విషయంలో కూడ "అతడెప్పుడూ పని చేస్తూంటాడు కదా! అందు వలన సరియైన జీవితాన్ని అనుభవించడానికే తీరికలేదు. పాపం!" అని చెప్ప వలసివస్తుంది. ఈ విధంగా మనుష్యుడు కూడ ఇతర ప్రాణులలాగా తాత్కాలిక సుఖాన్ని గురించి మాత్రమే ఆలోచిస్తూంటాడు. కాని అంతమాత్రాన వాస్తవికంగా కావలసిన సుఖం తనకు లభిస్తుందా, లేదా అని ఏ మాత్రమూ ఆలోచింపడు.

తాత్కాలిక సుఖమంటే ఏమిటి ? ఆహారం, నిద్ర, భయం, మైధునం - ఇవన్నీ అన్ని ప్రాణులకు సమానమని అంటారు. అర్థము, కామము అ దంకీ సమానమే. ఇది సామాన్య విషయం. వాటివలన సుఖం వస్తుందని పిస్తుంది. అవి దొరకకపోతే దుఃఖం కలుగుతుందని అందరూ అంగీకరిస్తారు. మన శాస్త్రాలలో కూడ సంపద, కామము లోపించకూడదని స్పష్ట పరచారు. ఇవి లేకపోతే వ్యక్తి బాధపడతాడు. సంపదను గురించి చెబుతూ. "భూఖే భజన్ న హోత్ గోపాలా" (ఆకలితో అలమటించే వారు గోపాలుని భజన ఎలా చేస్తారు?) అని ప్రశ్నించారు. "నీ వద్ద చిల్లి గవ్వకూడ లేకపోతే నీవు ఏమితింటావు? కుటుంబాని కేమిపెడతావు? మరి కుటుంబం వారి బాధలను గురించియే పరితపిస్తూ నీ జీవిత కాలమంతా గడిపితే, జీవిత పరమార్థాన్ని, భగవంతుని గురించి ఆలోచించే దెప్పుడు అని శ్రీ సమర్థ రామదాసు హెచ్చరించారు.

**కామము :**

సంపద అడుగంటితే ఎలాగైతే జీవితం గడపటం దుర్భరం అవుతుందో, కామము లోపిస్తే కూడ జీవితం గడవదు. మనదేశంలో మన కోరికలకు, ఆశయాలకు ఉన్నతస్థానం ఇవ్వబడింది కాని కోరికలను గురించి హిందూ దృక్పథానికి, పాశ్చాత్యుడైన సిగ్మన్డ్ ఫ్రాయిడ్ దృక్పథానికీ చాలా భేదం ఉన్నది. సిగ్మన్ ఫ్రాయిడ్ చెప్పిన "లిబిడో" పూర్తిగా వేరు. దూరదృష్టిగల మన పూర్వులు ఈ చరాచర సృష్టియంతా కోరికల వలననే కలిగిందని విశదీకరించారు. ప్రారంభంలో 'అతడు' ఒక్కడే ఉన్నాడు 'అతని'ని మీరు ఏ పేరుతోనైన గుర్తింపవచ్చు. 'అతడు' ఒక్కడే ఉన్నాడు మరి అతడు ఒక్కడే ఉంటే, ఈ సృష్టియంతా ఎలాగ నిర్మాణం అయింది? 'సహకామ్యక ఏకోహం బహుష్యామి' అని సమాధానం వచ్చింది. నేనొక్కడనే యున్నాను, నేను ఒకటి నుండి అనేకంగా కావాలి, అని అతనికి తోచింది. ఏ వ్యక్తియైనా అనుభవించాలని ఆశిస్తే, వినోదించాలని భావిస్తే, మరొకరి సహవాసం కావాలని కోరుకొంటాడు. అందుకోసమని 'ఏకమేవ అద్వితీయ' అని ఒంటరిగా ఉన్నవాడు 'సహకామ్యక' కావాలని కోరుకుంటాడు. అతనిలో 'కోరిక' కలిగింది ఆ కోరిక 'ఏకోహం బహుష్యామి'— నేనొక్కడుగా నున్నాను, నేను అనేకులుగా అయితే, బాగా ఉంటుంది. అప్పుడు ఆనందం పొందవచ్చు—అని.

సామాన్య జీవితాన్ని గురించి కూడ భగవంతుడు 'ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ' (భగవద్గీత 7-11) (అంటే నేనే కోరికను, కామమును) అని ప్రకటించాడు. ఈ పరిధులను అతిక్రమించి ఏ పాశ్చాత్య మనోవైజ్ఞానికు డైనా ఇంకేమివ్వగలడు? మరేమి చెప్పగలడు? భగవంతుడే "నేనే కామము" అని స్వయంగా ప్రకటించు కొన్నాడు. కాని అది ఎలాగా? 'ధర్మావిరుద్ధో' అంటే ధర్మానికి అవిరుద్ధమైనది లేక వ్యతిరేకం కానిది, అంటే కామము. కామము లేకపోతే పని జరుగదు. కాని దానికొక హద్దు ఉన్నది, కొన్ని నిబంధనలు ఉన్నాయి, కొన్ని విధాల మెరుగులు దిద్దియున్నారు. అవన్నీ కలిపి 'ధర్మం' అవుతుంది. అట్టి ధర్మానికి వ్యతిరేకంకాని 'కామమే నేను అని భగవంతుడు చెప్పి యున్నాడు. భగవద్గీతలో ఇంకా చెప్పిందేమంటే :

'ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః, (భగవద్గీత3/42)

బుద్ధికి అతీతంగా ఉన్నది 'అది'. అది అంటే ఏమిటి? 'అది' అంటే 'భగవంతుడు' అని ఒక ఆచార్యుని అభిప్రాయం. కాని 'అది' అంటే 'భగవం తుడు' అని ఎక్కడ నుండి వచ్చినాడు? అని మరొక ఆచార్యుడు ప్రశ్నించాడు. దానికి పైనున్న శ్లోకాలన్నీ కామ వికారాన్ని గురించి వున్నాయి. అందువలన 'అది' అంటే 'కామ వికారం' అని అనుకోవాలి. బుద్ధియొక్క జాగృత నిద్రాణ స్థితికే 'అది' అని చెప్పబడింది. అదే 'కామము'. ఈ వ్యాఖ్యానము సర్వసమ్మ తము కాకపోవచ్చును. కాని, ఇది లేకపోతే మాత్రము పని జరగదు. సంపదలు కొరవడటంతో మానవుడు కష్టాలపాలైతే, కామము లేకపోయినా, అతడు సుఖంగా ఉండజాలడు.

కాని, అర్థము, కామము ఏ విధంగా సాధించాలనేది కూడ మన ఋషులు తర్కించి యున్నారు. ఇంతకంటె తక్కువగా కూడదని జన సామాన్యానికి నిర్ణ యిస్తూనే, ఇంతకంటె మించి యుండకూడదని గరిష్ఠస్థాయి హద్దును కూడ ఏర్ప రచారు. అర్థ కామములు లోపించకూడదని, కాని వ్యక్తి మనస్సు అర్థకామముల ప్రభావానికి లొంగి పోకూడదని నిర్ణయించుటయే ఆ హద్దులు. ఎందుకంటే అర్థము (సంపద) లేనప్పుడు మానవుడు కష్టాలపాలైనట్లే, చింతలలో మునిగియున్నట్లే,

సంపదలు మితిమీరినప్పుడు కూడ, వాటి ప్రభావానికి లోనైనప్పుడు కూడ అతడు కష్టాల పాలవుతాడు. స్వంత అనుభవాల మీదనే అందరూ దీనిని ఒప్పుకొంటారు. కామ వాంఛలను తీర్చుకోవడం వలననే ఆనందం లభిస్తుందని సాధారణంగా అందరూ నమ్ముతారు. ఒక్కసారిగా ఏదైనా లోపిస్తే చాలా దుఃఖం, కష్టం కలుగుతుందని మన ఋషులు, మునులు చెప్పారు. కాని, కామ వాంఛలకు బానిస లైన వారిలో సుఖంగా ఎంతమంది ఉన్నారని ఉదాహరణగా పేర్కొనవచ్చును? దీనిని గురించి మనమెప్పుడైనా ఆలోచించామా? కోరికలను తీర్చుకోవాలనేది సరియైనదే. కోరికలను తీర్చుకోవటం ఒక విషయం, వాటి ప్రభావానికి లోనై, వాటికి పూర్తిగా దాసుడై పోవటం మరో విషయం. కామ వాంఛలను తీర్చుకోవటం వలననే మానవుడు సుఖంగా ఉండగలుగుతాడని భావించడం కూడ దానికి భిన్నమైనది. ఈ దృష్టితో పరిశీలించి, కామవాంఛలలో ప్రభావితులైన వారు సుఖంగా ఉండగలుగు తారేమో మనం గమనించాలి. మనకు అలాంటిది కనీసం ఒక్క ఉదాహరణమైనా కన్పిస్తుందా? గొప్పవారు వ్రాసియుంచిన స్వీయ అనుభవాలను చూస్తే, విశుద్ధమైన భావాలు కలిగియున్నవారు కూడ కామవాంఛల వలన చివరిలో కష్టాలపాలై నారని గ్రహింపవచ్చును. ఉమర్ ఖయ్యామ్ పేరు అందరూ వినియుండవచ్చును. వాస్తవంగా ఉమర్ ఖయాం వ్రాసినవి రుబాయీలు.

వానిలో చాలా వేదాంతతత్త్వం ఇమిడి యున్నది. అతని రుబాయీల విశేషమేమంటే ఏ మాత్రమూ చదువు లేనివారు, గొప్ప వేదాంతులున్నూ వాటిని చాల ఆసక్తితో గానం చేస్తారు. అధ్యయనం చేస్తూంటారు. కాని మహాజ్ఞానులు దానిలోని వేదాంతాన్ని గ్రహిస్తే, ఇతరులు అందలి భోగలాలసతకు మోహితులౌతారు. ఉమర్ ఖయ్యాం సుఖభోగాలలో మునిగి యుండే వాడని చెప్పవచ్చును. కాని, ఆ భోగాలలో మునకలు వేస్తూ కూడ 'గులాబీ పువ్వు వాడిపోయినట్లే, దానితోబాటే వసంత ఋతువు కూడ కృశించి పోతుంది. యౌవ్వనంలోని సుగంధ గ్రంధి లుప్తమై పోగానే ఈ పూదోటలో బుల్‌బుల్ ఎక్కడి నుండి వస్తుందో, ఎక్కడికి జారిపోతుందో ఏమీ అర్థం కావటం లేదు' అని విచారిస్తాడు. అందుకే అతడు 'నా మధు పాత్రను మద్యంతో నింపు, అలాగైనా నేను గతంలోని దుఃఖాన్ని, రాబోయే చింతలను మరచిపోగల్గుతాను' అని తన కామినిని కోరుతాడు. ఈ గిన్నెను నింపు, భవిష్యత్తులోని చింతలూ వద్దు, గతంలోని చేదు జ్ఞాపకాలూ వద్దు. కావల

సింది ఈనాటి భోగాలే! ఇలాంటి వేదాంతాన్ని అతడు ప్రదర్శించాడు. ఇంకా అతడు తన కామినితో 'అధ్యాత్మిక చింతనం గొప్ప జ్ఞానులకు వదలి వేద్దాం, ఒక్క విషయం మాత్రం యథార్థం. జీవన ప్రవాహం సాగిపోతూంది, అతి తొందరగా చేతి నుండి జారిపోతూ ఉంది. గులాబీ పూవు వికసించేది ఒక్కమారే తరువాత అది శాశ్వతంగా నశించిపోతుంది. అంతే. ఇదే యథార్థం! ఇక బుద్ధి మంతులమని చాటుకొనేవారు సిద్ధాంతాలను గురించి చేసే చర్చలన్నీ వ్యర్థమే." అని విశదీకరించాడు.

ఇదీ ఒక ఆలోచనయే - ఇది మనకు సమ్మతంగా కూడ ఉండవచ్చు. లోతుగా ఆలోచించే ఓపిక లేనివారికి ఇది చాలా ప్రభావం కల్గిన ఆలోచనగా కన్పించవచ్చు. కాని సుఖభోగాలను అనుభవించడమే జీవిత పరమార్థమని భావించే వారు వాస్తవంగా సుఖంగా ఉన్నారా? పాశ్చాత్య ప్రపంచంలో కేసానోవా అనే మహానుభావుని ఉదంతం వస్తుంది. అతడు ఈ మధ్యనే 100, 125 ఏండ్ల ముందు జీవించి యుండేవాడు. అతడు దేనిలోనూ అపజయాన్నెరుగడు— కాని భోగలాల సతకు, కామవాంఛలకు ప్రతిరూప మయ్యాడు. కాని, ఐరోపా నంతటినీ తన భోగ విలాసాలకు గురిచేసినా, దానితో అతని జీవితం సుఖమయంగా గడచిందని మాత్రం కాదు. మనదేశంలో యయాతి మహారాజుకూడ ఇలాంటి ఉదాహరణయే, ఇది మన ప్రాచీన ఇతిహాసంలోని కథ కావచ్చును. కాని జీవితమంతా కామం, భోగ విలాసా లతో గడిపిన జీవితానికది ఉదాహరణం. పూర్తిగా వయోవృద్ధుడైనప్పటికినీ, అతనికి కామ వాంఛలు తీరలేదు. 'నజాతు కామః కామానామ్ ఉపభోగేన శామ్యతే, హవిశాకృష్ణ వర్తతే' అంటే భోగలాలసతతో కామం శాంతించదు అని మన పూర్వులు స్పష్టం చేశారు. నిప్పులో నేయివేసిన కొలదీ నిప్పు చల్లారక, ఇంకను ప్రజ్వలించినట్లే, అనుభవించిన కొలదీ కామ వాంఛలు ఇంకను ప్రబలం అవు తాయి. యయాతి జీవిత కాలమంతా కామభోగాలలో మునకలు వేసినా, అతని కామ వాంఛలు చల్లారలేదు. అందంగా ఉండే శర్మిష్ఠను చూడటంతోటే, ఆమెతో తన కామ వాంఛలు తీర్చుకోవాలని ఉబలాట పడ్డాడు. కాని, పాపం! అప్పటికే ముసలివాడై పోయాడు. ప్రకృతిలో నున్న విపరీతమే ఇది. ఒకవైపున కామవాంఛలు ప్రబలమవుతూంటే, మరో వైపున శరీరం కృంగిపోయి, శిథిల మవుతూంటుంది ! అప్పుడతడు తన కొడుకును పిలిచి, 'నీకు

పితృభక్తి ఉన్నదా?' అని అతనిని అడిగాడట. 'అవును, నాకు పితృ భక్తి అపారంగా ఉన్నది' అని అతడు చెప్పాడు. 'వాస్తవంగా నీకు పితృభక్తి ఉన్నట్లయితే, నీవు నీ యౌవ్వనాన్ని నాకు యిచ్చివేయి, దానితో నేను శర్మిష్ఠతో నా కామాన్ని తీర్చుకొంటాను' అని యయాతి కొడుకును కోరాడు. పితృభక్తుడైన అతని కుమారుడు తన యౌవనాన్ని తండ్రికి ఇచ్చివేశాడు. ఇలాంటి ఉదాహరణం మన పురాణాలలో వస్తుంది. జీవితమంతా యయాతి ఒక ఆటగా అనుభవించినప్పటికినీ, దానికంతులేకుండా పోయింది. అతనికి తృప్తి కలుగకపోయింది' అని సావర్కారుగారన్నారు. పాశ్చాత్యులు ఈ విషయంలో నైపుణ్యం సాధించారు! వారెన్నో విధాలుగా కామవాంఛలను తీర్చుకొనే ప్రయోగాలను చేస్తుంటారు. కాని, చివరకు వాస్తవిక సుఖాన్నీ, శాంతినీ పొందారని చూపించే ఒక్కగా నొక్క ఉదాహరణమైనా కన్పించదు. దానికి పూర్తి భిన్నంగా 'తృష్ణాన జీర్ణా, వయమేవ జీర్ణాః' అనేదే సర్వత్రా కన్పిస్తుంది. కోరికలు ఊరుతున్న కొలదీ, అనుభవించే సామర్థ్యము అడుగంటుతూంటుంది. అందుకే నిరాశా దుఃఖాలు - పాశ్చాత్యుల అనుభవం ఇదే!

**సిరిసంపదలు :**

పురుషార్థాలలో రెండవదైన అర్థం - సిరసంపదల పరిస్థితికూడ ఇంతే. సంపదలను సంపాదించాలి. అర్థం అందరికీ యిష్టమే. అర్థం వలననే అన్నింటినీ సాధించవచ్చునని అంటారు. కాని, కోట్లకు పడగలెత్తిన వారికైనా శాంతి లభించిందా? మహమ్మదు గజనీ జీవితం అందరికీ తెలుసు. అతడు ప్రపంచం నలుమూలల నుండి కొల్లగొట్టి సేకరించిన సంపత్తినంతా తన ధనాగారంలో నింపుకొన్నప్పటికినీ, మృత్యువు సమీపించడంతో చాల దుఃఖించాల్సి వస్తుంది. 'అయ్యో! భగవంతుడా! నేను జీవితమంతా అష్టకష్టాలకోర్చి, ఎంతగానో పరాక్రమాన్ని ప్రదర్శించి, ఈ సంపత్తినంతా సేకరించాను. ఇదంతా ఇప్పుడిక్కడే ఉండి పోతుంది గదా!' అని విలపించాడు. గజనీ యొక్క దయనీయ స్థితిని చూచి, చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుకొనే దశలోనే, అతని అనుచరులతనిని ధనాగారం వద్దకు తీసుకొని పోతారు. అతడు ఏకధారగా కన్నీరు గారుస్తూ, కళ్ళప్పగించి తన ధనాగారాన్నే చూస్తూ, మరణించాడు. అతని ధనమంతా ఈ ధర యందే ఉండి పోయింది. సుఖమూ లభించలేదు. దుఃఖంతో కుమిలి కుమిలి జీవితం ముగించాడు. దీనికి భిన్నంగా కూడ కొన్ని ఉదహరణాలున్నాయి. అపార

సంపత్తిని సంపాదించిన తర్వాత దానితో సుఖం లభించదని గ్రహించగానే ఆ ధనాన్ని గొప్ప నిధులు, ట్రస్టులు, ఫౌండేషన్లుగా మార్చిన ఉదాహరణాలు పాశ్చాత్య ప్రపంచంలో కూడ కన్పిస్తాయి. తమ శక్తి సామర్థ్యాలతో అపార ధన సంపత్తిని సంపాదించిన తరువాత ఫౌండేషన్ ట్రస్టుల నేర్పరచి మానవ కళ్యాణం కోసమని తమ ధన సంపత్తినంతా సమర్పించి, మనశ్శాంతి పొందిన ధీరుల ఉదాహరణాలెన్నో పాశ్చాత్య ప్రపంచంలో ఈనాడు కన్పిస్తాయి.

రష్యా నియంత స్టాలిన్ కుమార్తె శ్వేతలానా భారతదేశానికి వచ్చింది. స్టాలిన్ కుమార్తెకు ధనం వగైరా లోపం ఏముంటుందని మనం భ్రాంతి పడ వచ్చు. ఇక్కడి పత్రికా విలేఖరు లామెతో 'మీరెందుకు వచ్చారిక్కడికి? మీకేం కావాలి? మీరేమి కోరుతున్నారు?' అని అడిగారు. దీనికామె సమాధానంగా 'నాకున్న కోరిక ఒక్కటే పవిత్ర గంగానదీ తీరంలో ఒక కుటీరం కట్టుకొని నా జీవితం చివరి భాగాన్ని ఆనందంగా గడపాలని కోరుతున్నాను'. అని తెలి పింది. 'నేను గంగా తీరంలో ఒక కుటీరం కట్టుకొని నా జీవితం చివరి భాగాన్ని గడపటమే నా చివరి కోరిక' అని స్టాలిన్ పుత్రిక అంటుందని మన దేశంలోని ప్రగతి వాద, రాడికల్ మిత్రులు కనీసం ఊహించగలరా? ఇటీవలనే సుమారు 3 ఏండ్ల పూర్వము ప్రపంచ ప్రఖ్యాతి పొందిన హెన్రీఫోర్డ్ వారసుడొకడు భారతదేశానికి వచ్చినపుడు పత్రికా విలేఖరులు అతనిని కలిసి 'మీరు ఈ హరే రామ, హరేకృష్ణ ఉద్యమ సుడిగుండంలోకి ఎలా వచ్చారు' అని ప్రశ్నించారు. 'దీనియందే నాకు శాంతి లభిస్తుంది' అని అతడు సమాధానం చెప్పాడు. 'మీకు దీనియందే శాంతి లభిస్తే, మరి అపారమైన మీ ధనాగారం అంతా ఏమి కావాలి?' అని మరో విలేఖరి ప్రశ్నించాడు. అందుకాతడు "ఈ సంపద అంతా ఏమి చేసు కోవాలి? అదంతా శ్రీకృష్ణపరమాత్మదే" అని తృప్తిగా అన్నాడు. దీనిని మూర్ఖుని సమాధానమని మన దేశంలోని ప్రగతివాదు లెవరైనా అనవచ్చు. కాని, హెన్రీ ఫోర్డ్ వారసుడైతే తన అభిప్రాయాన్ని స్పష్టంగా ప్రకటించాడు. భౌతికంగా సిరిసంపదలతో సమృద్ధమైన అమెరికా దేశంలోని కోటీశ్వరుని వారసుడును, రష్యా నియంత స్టాలిన్ పుత్రిక శ్వేతలానా ఈ విధంగా ఎందుకు భావిస్తున్నారు, అలా ఎందుకు విస్పష్టంగా ప్రకటించారు. అని మనం ఆలోచించాలి. ఒకరు గంగానదీ తీరంలో కుటీరం కట్టుకొని తన జీవితం చివరి ఘడియలను గడపాలని

కోరుకుంటే, మరొకరు తనకున్న సర్వస్వం శ్రీకృష్ణ భగవానునిదే అంటారు. ఇలాంటి భావాలు ఆ పాశ్చాత్య దేశాలలో ఎందుకు కల్గుతున్నాయి?

అర్థకామములకోసం దేవులాడితే, అవియే పరమార్థాలని నమ్మితే, ఎవరైనా సుఖం పొందగలరా? అని మనం వాస్తవంగా ఆలోచించాల్సిన విషయం. గోస్వామి తులసీదాసు ఒక మంచి పోలికను చూపారు. 'అప ప్రియనిశిబీత్ గయీ సబ్, కబహుఁ న నాథ్ నీంద్ భర్ ఆయీ' అని అన్నారాయన. బాగా నిద్ర పట్టటానికీ, సుఖంగా నిద్రపోవడానికి పరుపు బాగుండాలి. కాని, 'కబహుఁ న నాథ్ నీంద్ భర్ ఆయీ', పరుపును బాగా పరచుకొనడంలోనే రాత్రంతా గడచిపోయింది, పడుకోడానికి అవకాశమే దొరకలేదు! మన జీవితాలను గురించి కూడ ఆత్మావలోకనం చేసికొంటే, పరుపును బాగా పరచుకొనడంలోనే జీవితం గడచిపోతూంది, పడుకోటానికి అవకాశమే దొరకలేదు అని గ్రహించగల్గుతాము. మృత్యువు సమీపించినపుడు ఇంకా ఇది మిగిలింది, అది మిగిలింది, అదొక్కటి సాధించియుంటే బాగుండేది, అని చింతించాల్సి వస్తుంది.

'మానవునకు ఎంత భూమి కావాలి' అనే టాల్‌స్టాయ్ కథ ఒకటి ఉంది. నీవు పరుగెత్త గలిగినంత భూమిని నీకు యిచ్చివేస్తామని' రాజు ఒకనితో అన్నాడట. అతడేమో చాలా దరిద్రుడు. సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు తాను పరుగెత్తిన భూమి అంతా తనదే అవుతుందని అతడు ఆశించాడు. ఇది చాల మంచి అవకాశం. అతడు సూర్యోదయం నుండియే పరుగెత్తడం ప్రారంభించాడు. ఈ ఒక్కరోజే పరుగెత్తాలి కదా, ఈ రోజున పరుగెత్తగలిగిన భూమియంతా శాశ్వతంగా తనదే అయిపోతుందనే ఆశయే-ప్రతి క్షణం అతనిని ముందు కురకడానికి ప్రేరేపిస్తూండేది. తరువాత సుఖంగా ఉండవచ్చుననుకొన్నాడు. అతడు ఎప్పుడూ ముందుకు - ఇంకా ముందుకే - పరుగెత్తుతూనేపోయాడు. అతని ఊపిరితిత్తులలో ఏదో నొప్పి ప్రారంభమయింది. శరీరం అలసిపోయింది. ఊపిరాడకపోయింది. అంతలో సాయంకాలమయింది. అతడు తన వేగాన్ని ఇంకా పెంచాడు. సూర్యాస్తమయం అవుతూండడంతో ఇక చాల తక్కువ వ్యవధి ఉన్నదని, ఎక్కువ భూమిని పొందడానికి ఇంకను ఎక్కువ త్వరితంగా వెళ్ళాలని, మరీ వేగం పెంచాడు ఆ విధంగా వేగం పెంచుతూ పరుగెత్తడతో చివరకు

ఆయాసంతో రొప్పుతూ, ఊపిరాడక, క్రిందపడి ప్రాణాలను వదలవలసి వచ్చింది అతడు మరణించడంతో కళేబరాన్ని పాతిపెట్టడానికి పట్టిన భూమిని కొలవగా అది మూడున్నర గజాలే ఉన్నాయని టాల్‌స్టాయ్ వ్రాశాడు. అంటే ఏ వ్యక్తికైనా కావలసింది మూడున్నర గజాలే అని టాల్‌స్టాయ్ అభిప్రాయం. కాని మన కథా నాయకుడు మాత్రం పరుగెత్తడంలోనే తన జీవితాన్ని పరిసమాప్తం జేసికొన్నాడు.

చిరంతనమైన సుఖం :

అర్ధకామాల ప్రభావంవలననే మానవుడు సుఖాన్ని పొందజాలడు. దానితో దుఃఖమే పెరుగుతుంది. అందువలననే అర్ధకామాలలో లోటు ఉండకూడదని చెబుతూనే, అర్ధకామాలకు దాసులైపోకూడదని మన పూర్వులు స్పష్టంచేశారు. అప్పుడే మానవుడు సుఖంగా మనగలుగుతాడు. అలా లభించే సుఖం అఖండం, చిరంతనం, నిరంతనం, ఘనీభూతం కాగల్గుతుంది. ఆ సుఖం ఈ క్షణం ఉండి, మరుక్షణం అదృశ్యమయ్యేది కాదు. దీనినే మన పూర్వులు మోక్షం అన్నారు. ఘనీభూతం, చిరంతనం, నిరంతరంగా ఉండే సుఖమంటేనే మోక్షం. మానవ జీవిత లక్ష్యం ఇదే. ఈ లక్ష్యాన్ని సాధించడానికి ప్రతి మానవుడును తన యిష్టా యిష్టాలు, ప్రతిభ, స్వభావము, పరిస్థితులు, తన శారీరక, మానసిక, బౌద్ధిక, ఆధ్యాత్మిక స్థాయి మొదలగు వాటి నన్నింటినీ దృష్టియందుంచుకొని, పర్యాలోచించి, తానవలంబించాల్సిన మార్గాన్ని నిర్ధారించుకోవాలి. అందుచేతనే అర్ధకామాలలో లోటేమీ ఉండకూడదు కాని, అర్ధ కామాలకు దాసులైపోయే మన స్తత్వం కూడ లేని విధంగా సమాజ వ్యవస్థను రూపొందించాలని మన పూర్వులు చెప్పారు. లోటు, లొంగి పోవటం, అనే మాటలను సరిగా గమనించడం అవసరం,

అర్ధకామాల లోటు లేకుండ జేయడం సమాజ వ్యవస్థ యొక్క బాధ్యత. అర్ధకామాల ప్రభావానికి లొంగిపోయి, వాటికి దాసులు కానట్టి మన స్తత్వాన్ని రూపొందించు కోవటం ప్రతి వ్యక్తి యొక్క బాధ్యత. ఈ కారణం చేతనే రాష్ట్రీయ శ్రమ ఆయోగ్ (నేషనల్ లేబర్ కమీషన్) కు మేమిచ్చిన విజ్ఞాపన పత్రంలో బోనస్, కరువు భత్యం, పెన్షన్ నియమాలను కోరడంతో బాటు ప్రారంభంలోనే, 'అభావోవా ప్రభావో వా యత్ర నాస్తి' అని స్పష్టపరచాము. అర్ధకామాల లోటు కలుగకూడదు, అర్ధకామాలకు లొంగి పోకూడదు కూడ.

అలాంటి పరిస్థితి ఏర్పడినప్పుడు సమాజం ఆత్మనిర్భరం అవుతుంది. ధర్మచక్ర ప్రవర్తనము ప్రారంభం కాగలుగు తుంది. అంటే బోనస్, కరువు భత్యం, సమ్మెచేసే హక్కుల ప్రతిపాదనలకు ముందుగానే ఈ క్రింది శ్లోకంకూడ పొందు పరచ బడింది.

"అభావో వా ప్రభావోవా యత్ర నాస్త్యర్థ కామయోః
సమాజే ష్వాత్మరూపత్వాత్ ధర్మచక్ర ప్రవర్తనమ్"

ఈ దృష్టితో మనం స్వీయ జీవితాన్నే పర్యాలోకించి సుఖమంటే ఏమిటో ఆలోచిద్దాము. 'నేను ఎలాగ సుఖం పొందగలను? నేనున్న స్థానంనుండి మోక్షం పొందగలిగే మార్గం ఏది? మన యిష్టా యిష్టాలు, స్వభావం, దృక్పథం, శారీరక మానసిక, బౌద్ధిక స్థాయిలను దృష్టి యందుంచుకొని, ఈ విషయంలో మనం చాల గంభీరంగా ఆలోచించాలి.



# 5. తస్మాత్ జాగ్రత్త

మంచి కర్తవ్య పరాయణులైన కార్యకర్తల శక్తిసామర్థ్యాలు విపత్కాలంలో సవాళ్ళను ఎదుర్కొనునప్పుడే ప్రకటితమౌతాయి. బయటినుండి సవాళ్ళు ఎదురైన ప్రతి సమయంలోనూ వారు సమర్థవంతంగా వాటిని ఎదుర్కోగల్గుతారు. రబ్బరు బంతిలాగా ప్రవర్తిస్తారు-మట్టి బంతిలాగా కాదు. ఎవరైనా రబ్బరుబంతిని నేలపై విసరి కొట్టితే, అది వారి తలను దాటి పైకెగురుతుంది. కాని మట్టి బంతిని అదేవిధంగా నేలపై విసరి కొట్టితే, అది విసరి వేసినచోటనే చతికిల బడియుటుంది, లేదా ముక్కలు ముక్కలై నలుదిక్కులా చెదిరి పోతుంది. కాని, పైకి ఎగిరే ప్రయత్నం ఎక్కడా కన్పించదు. మంచి కార్యకర్త రబ్బరు బంతిలాగా పైకి ఎగురుతాడు. సవాలు ఎంత కఠినంగా ఉంటే అతడు దాన్ని సాధించటానికి అంత ఎక్కువగా కృషి చేస్తాడు. షేక్స్పియర్ చెప్పినట్లుగా పిరికివాడు తన ప్రాణం పోవడానికి ముందుగానే ఎన్నోసార్లు చనిపోయి యుంటాడు ! కాని, వీరుడు ఒకే మారు మరణిస్తాడు.

కాయర్ తో జీవన్ మరత్ దిన్‌మే బార్ హీ బార్
ప్రాణ పఖేరూ వీర్‌కే ఉడత్ ఎక్ హీ బార్.

సమస్య ఎంత జటిలంగా ఉంటే, సాహసం కలిగిన మంచి కార్యకర్త యొక్క శక్తి సామర్థ్యాలు, కర్తవ్య పరాయణత అంతే శ్రేష్ఠంగా వుంటాయి. కాని, అదే కార్యకర్త సుఖాలనుభవించు నప్పుడు కూడా అదే విధంగా పని చేయ గల్గుతాడని దృఢంగా జెప్పజాలము. ఆపత్కాలంలో ముందునకు దూకి సవాళ్ళను ఎదుర్కొన్నవారే విజయం పొందిన ఆనందంలో 'ఏదో సాధించాం' అనే తృప్తితో 'మేముకూడ గొప్పవారమే, ఇక మన కృషి చాలు' అని కర్తవ్యవిముఖులౌతారని వ్యక్తుల, సామాజిక, జాతి చరిత్రల వలన స్పష్టమౌతోంది. అందువలన వారికి తెలియకుండగానే అంతకు ముందున్న శ్రద్ధా భక్తులు క్రమంగా అదృశ్యమై పోతాయి. చరిత్రలో ఇలాంటి ఉదాహరణాలు కోకొల్లలుగా ఉన్నాయి - జాతి చరిత్రలోనూ, వ్యక్తిగత, సామాజిక జీవనంలోనూ.

ఫ్రాన్స్ అభివృద్ధి - పతనము :

పదునేడవ శతాబ్దములోని ఫ్రెంచి రాజు లూయీ ఉదాహరణం మనకు తెలియును. అతని సేనానాయకులు చాల పరాక్రమ వంతులు. ఐరోపాలోని దేశాలన్నింటిపై ఫ్రాన్స్ ప్రభావం అంకితమై యుండేది. ఉన్నట్టుండి లూయీ రాజు మనసులో ఒక విచిత్రమైన ఆలోచన చెలరేగింది - ఇతర దేశాలను వారు తమ శౌర్యపరాక్రమముల ద్వారా తమ గుప్పిట్లో ఉంచుకొన్నట్లే, తనకు కూడ ఎప్పుడో యొకప్పుడు కొరకరాని కొయ్యలలాగా పరిణమింప వచ్చును గదా యని! ఆ సేనా నాయకుల నుండి ఏ మాత్రమూ సమస్యలుండ కూడదని రాజు కోరుతున్నట్లయితే, వారిని అణగద్రొక్కడానికి రాజు ఏమాత్రమూ ప్రయత్నించ కూడదని, వారు భోగాలాలసులు అయ్యేలాగా ఏర్పాట్లు చేయాలని ప్రధాన మంత్రి అతనికి సలహా యిచ్చాడు. రాజు అ సలహా మేరకు వారికోసం ఒక దివ్య భవనం కట్టించాడు. దాని పేరు 'వర్సేల్స్ భవనం' దానిలో ఒక విశాలమైన సభా భవనం ఏర్పరచాడు. అందరికీ సకల సౌకర్యాలతో గౌరవ ప్రదమైన నివాసాలను కల్పించాడు. ప్రతియొక్కరును తమ ఉజ్జ్వలజీవితాల కనుగుణంగా నివసించేట్లుగా శ్రద్ధగైకొన్నాడు. అందరికీ గొప్ప పదవుల నిచ్చి, బిరుదులతో సత్కరించాడు. రాజు తనతో సమానంగా వారికి గూడ ఉన్నత స్థానాల నిచ్చాడు. అందరూ సుఖంగా కాలక్షేపం జేస్తూండే వారు. వారి భోగవిలాసాలకు, అన్ని రకాల సౌకర్యాలుఉండేవి. దానిఫలితంగా పది సంవత్సరాలలోగానే కర్తవ్యపరాయణతకు ప్రతిభకు జగత్ప్రసిద్ధులైన ఆ నాయకు లందరూ ఎంతగా పదభ్రష్టులైనారంటే పదునేడవ శతాబ్దంలో ఫ్రాన్స్ ప్రభువుల, వీరనాయకుల వంశంలో కర్తవ్య పరాయణులైన పురుష డొక్కడు కూడా మచ్చునకైన కన్పించకపోయాడు. ఇదెంత విచిత్రమైన విషయం ! వారందరూ పరాక్రమవంతులే, కర్తవ్య పరాయణులే, ప్రతిభావంతులే - కాని, వర్సేల్స్ రాజభవనంలోని రాజభోగాలు, రాజమర్యాదలు, రాచరిక అధికారాలు లభించగానే వారి స్ఫూర్తి, వారి కర్తవ్య భావాలుఅన్నీ అడుగంటిపోయాయి. వారిలో ప్రతిభావంతుడైన వాడుగాని, కర్తవ్య పరాయణుడైన వాడు గాని ఒక్క వ్యక్తి కూడా మనకు కన్పించక పోయాడు. 19 వ శతాబ్దంలోని ఇటలీ దేశపు నాయకులకు కూడ ఇదే దుర్గతి పట్టింది. 19 వ శతాబ్దంలో ఇటలీ నాయక వర్గం నుండి కూడ ఇదే కారణం చేతనే కర్తవ్య పరాయణుడైన వీర పురుష డెవ్వడూ ఆ దేశంలో జన్మింపనేలేదు.

**ఇతర దేశాల ఉదాహరణాలు :**

ఇటువంటిదే ప్రపంచంలోని అతి పెద్ద ఉదాహరణం రోమన్ సామ్రాజ్య వాదం. రోమన్ సామ్రాజ్యం అత్యున్నత వైభవంగా విలసిల్లుతున్నపుడు ఐరోపా ఖండమంతా దానిలో అతర్భాగంగా ఉండేది. క్రీస్తు తరువాత 500 సంవత్సరాల వరకు ఆ సామ్రాజ్య ప్రభావం నెలకొని యుండేది. దశ దిశల విజయపరంపరతో అత్యున్నత వైభవంతో, ఐరోపా ఖండపు యావదైశ్వర్యంతో రోము కళకళలాడుతుండేది. 300 సంవత్సరాల పర్యంతం ఇలాంటి వైభవ స్థితి కొనసాగింది. దీని ఫలితంగా 300 సంవత్సరాల భోగలాలసత్వంలో మునిగి పోయి, వారి కర్మణ్యతయే నశించింది. పరాక్రమము అంతరించింది. ఈ 300 సంవత్సరాలలో ఒక్క మహాపురుషుడు కూడ వెలుగులోకి రాలేదు. రోమన్ సామ్రాజ్యపు అంతిమ దశలో మహత్కార్యమేదీ జరగలేదు-సవాళ్ళను ఎదుర్కో డానికి సమాజమంతా ఒక్క త్రాటి మీద లేచి కృషి చేయటం మనం ఇతర దేశాలలో గమనిస్తూంటాము. ఇటలీ దేశం వైభవస్థితిని పొందడానికి పూర్వం; సవాళ్ళతో సమస్యలతో సతమతమౌతున్న కాలంలో అక్కడి శూరసేనానులు ఆ సవాళ్ళను ఎదుర్కొన్నారు. ధీశాలురు తమ ప్రతిభను సకాలంలో చాటారు-ప్రీ-ఇటాలియన్ యుగము చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయబడింది. ఎలిజబెత్ కాలంలో ఇంగ్లాండు ఒక విషమ సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది. అక్కడి వీర సైనికులు దానికి తగినట్లుగా గట్టి చర్య తీసుకొన్నారు. అందుచేత ఇంగ్లాండు ఇతిహాసంలో ఎలిజబెత్ యుగం స్వర్ణాక్షరాలతో వ్రాయబడింది. సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో (రినైజాన్స్) ఇటలీ ఇతిహాసం కూడ ఇదేవిధంగా స్వర్ణాక్షరాలతో పేర్కొన బడింది. ఫ్రాన్స్‌లోని రాజకీయ విప్లవకాలం నాటి ఫ్రాన్స్ చరిత్ర పుటలు కూడ సువర్ణాక్షరాలతో ముద్రించబడియున్నాయి. సవాళ్ళు, సమస్యలు, ఆపదలు సంక్రమించినపుడెల్లా ఆ దేశ ప్రజల ధైర్యము, పరాక్రమము, కర్తవ్య పరాయణతలు పెల్లుబికి, వారి పేర్లు ఇతిహాసంలో స్వర్ణాక్షరాలతో అంకితమైనాయి.

**కార్యకర్తలలో కూడ పతనం :**

ఈ విధంగా ఆపత్కాలంలో కొంతవరకు శౌర్య పరాక్రమాలను ప్రదర్శించిన వారే - సమాజ వ్యవస్థ కొంత కుదుట పడగానే, పందొమ్మిదవ శతాబ్దంలోని ఇటలీ, పదునేడవ శతాబ్దంలోని ఫ్రాన్స్‌ల లాగా తమకు తెలియ

కుండానే ప్రభావరహితు లగుచున్నారు. ఇది మానవ స్వభావం. ఈ మార్పు మెల్ల మెల్లగా జరుగుతూ ఉండడంవలన కార్యకర్త స్వవిషయంలో అత్యంత జాగరూకతతో ఆత్మ పరిశీలన చేసికొనక పోతే, తన స్థాయిని నిలబెట్టుకోవటం చాల కష్టసాధ్యము. దీనికి మరొక కారణం కూడ ఉన్నది. మనం మంచి కార్యకర్తల మైతే ప్రజలలో మనపట్ల గౌరవ భావం ఏర్పడుతుంది, ఆ గౌరవం కారణంగా వారు మన పనికి అంకితమౌతారు. క్రమక్రమంగా వారు సేవా భావం కూడా పెంచుకుంటారు. అంతవరకు ఇది బాగానే ఉంటుంది- కాని, అదే కారణం చేతనే మన నాయకునికి గూడ సేవలను పొందే అలవాటు కలుగుతుంది. అతని స్వావలంబనము క్రమక్రమంగా అదృశ్యమైపోతుంది. ప్రజలు కానుకలు సమర్పిస్తే, అవి స్వీకరిస్తు, ఆలా చేయడం అవసరమేనని దాని ఔచిత్యాన్ని సమర్థించుకోడానికి ప్రయత్నిస్తాడు. ప్రేమాభిమానాలతో యిచ్చిన కానుకలను తాను తిరస్కరించడం భావ్యంగా ఉండదని, యివ్వదలచుకొన్నవారు బాధపడతారని వాదిస్తాడు. కాని, కానుకలు యివ్వదలచినవారు తమ నాయకుడు వాటిని గ్రహింపక పోయినా వారు బాధ పడరని తెలిస్తే మాత్రం అతడు తన వలలో తానే ఇరుక్కుంటాడు. క్రమ క్రమంగా అతనికి తెలియకుండగనే పతనం చెందుతూంటాడు. దీని విషయంలో ఎక్కువ సావధానంగా, మెళకువతో ప్రవర్తించక పోతే, తన్ను తాను రక్షించుకోజాలకపోతాడు. అతడు ఒక స్థాయిలో నిలదొక్కుకోడానికి ప్రయత్నిస్తున్న కాలంలో ఇది ప్రత్యేకంగా గమనించాల్సిన విషయం. ప్రారంభంలో అతని సద్గుణాలలో ఎక్కడా లోపం కన్పించదు. కాని, అతని నాయకత్వం స్థిరపడుతూన్న కొద్దీ, క్రమ క్రమంగా అతని పతనం కూడ కలిగే అవకాశం ఎక్కువ అవుతూంటుంది. నాయకత్వం అయితే చేజిక్కించుకొన్నాడనీ, అనుకున్నదేదో సాధించేశాడనీ, యిక ఇప్పుడెక్కువగా శ్రమ పడాల్సిన అవసరం లేదనీ భావాలు అతని మనసులో మెదులు తూంటాయి. ఈ విధంగా అతనిలో కృషి చేయాలనే ఆలోచన, తపన క్రమ క్రమంగా లుప్తమైపోయి, నాయకుని హోదాలో తనకు సంక్రమించిన సౌకర్యాలను, పెత్తనాన్నీ వీలున్నంత ఎక్కువగా ఉపయోగించుకోడానికి తగు ఉపాయాన్నీ మార్గాలను అన్వేషిస్తూనే ఉంటాడు

**"అహం" ఆవిర్భావం :**

ఈ కారణం చేతనే మనకు తెలియకుండానే మనలో అహంకారం చోటు చేసుకొంటుంది. వాస్తవంగా ధ్యేయ నిష్ఠాపరుడైన వ్యక్తి మనసులో కూడ క్రమ క్రమంగా నాయకత్వ భావాలు ప్రబలి, కొంత విజయం సాధించగానే తన కృషి, తన నాయకత్వం వలననే అది సిద్ధించిందని విఱ్ఱవీగుతూంటాడు. కాని, అతడు అదంతా వాస్తవంగా సమిష్టి కృషి ఫలితమే ననే అంశాన్ని విస్మరిస్తాడు. తులసీదాసు పేర్కొన్నట్లుగా,

"లాభ్ హానీ జీవన్ మరణ్, యశ్ అపయశ్ విధి హాథ్" జయాపజయాలు, లాభనష్టాలు, చావు పుట్టుకలు - ఇవన్నీ భగవంతుని లీలలే. నీ చేతిలో అవి ఏమీ లేవు అని అర్థము. కాని, తులసీదాసు ప్రతిక్రియావాది (reactionary) యని కొందరంటారు. భగవంతునే నమ్ముకొనియుండి, అన్నీ అతనికే వదలి పెట్టడానికి సాధారణంగా ఎవరూ సిద్ధపడరు. ఒకవేళ ఈ భావమే సరియైనదని ఒప్పుకొన్నప్పటికినీ, ఒక్కగా నొక్క వ్యక్తివలననే విజయం లభిస్తుందనటం సత్యం కానేరదు కదా! ఒక పనిలో విజయం పొందాలంటే దానికెన్నో అంశాలు పోషకంగా ఉండాలి. మన కార్యకర్తల కృషి, సభ్యులందించిన సహాయ సహకారాలు, యాజమాన్యం వారి ఏర్పాట్లు, ప్రభుత్వ విధానాల వలన కలిగే అసంతృప్తి, కోపతాపాలు - ఇవి కూడ ఇతరులతో బాటు ఒకే రకమైన దృక్పథం ఏర్పరచుకోడానికి కారణాలవుతాయి. కాని, విజయం లభిస్తే, బుర్రలో వెఱ్ఱి ఆలోచనలు లేస్తుంటాయి. గొప్ప నాయకుల మెదడులోనే కలవరము ప్రారంభమైతే ఇతరులు రగిలే నిప్పుకు తైలం వేస్తారు. ఒక రసిక కవి కామాన్ని గురించి ఒక చక్కని కవిత్వం వ్రాశాడు. 'కామం' అనే మాటకు బదులుగా 'నాయకుడు' అని అన్వయించుకొంటే, ఆ కవిత్వం ఇలాగ ఉంటుంది.

"పైసే భీతో హోతేహైం లీడరీమేం జనూన్‌కే ఆసార్
లోగ్ ఔర్ భీ దీవానా బనా దేతే హైం"

'శభాష్ లీడర్‌జీ, నిన్నటి రోజున మీరు ఉపన్యాసం ఇచ్చారు కదా! అంత గొప్ప ఉపన్యాసాన్ని నేను ఇంతకుపూర్వం ఎప్పుడూ వినసే లేదు'

అంటూంటారు. దానితో మన లీడర్‌జీ కూడ ఉబ్బి, తబ్బిబ్బయిపోయి "చూశారా, నా తడాఖా" అని అనుకుంటాడు. "నా పనులలో తప్పులు పట్టేవారంతా నా కక్షదారులే. వారికి నేనంటే అసూయ. అయినా నా తడాఖా చూపిస్తా" అని ఆవేశ పడుతూంటాడు. ఇక క్రమ క్రమంగా అతనిలో అహంకారం ప్రవేశిస్తుంది. అంతేకాక నేలను తన్నితే మనకు కూడ అంతే దెబ్బ తగులుతుందనే విషయాన్ని విస్మరిస్తాడు. అతనిలోనే గాక అహంకారం అతని తోటివారిలో గూడ రగుల్కొంటుంది. వారికి అహంకారం లేకపోవచ్చు, నిరహంకారులే గావచ్చు - వారి ప్రముఖ కార్యకర్త నిరహంకారుడని, ధ్యేయ నిష్ఠ గల్గినవాడని, అతడు ధ్యేయం పట్ల సంపూర్ణ ఆత్మ సమర్పణ చేసినవాడని వారికి గట్టి నమ్మకం. అందుచేతనే ఇతర కార్యకర్తలు గూడ ధ్యేయం పట్ల సంపూర్ణ ఆత్మ సమర్పణ చేసినవారై యుంటారు.

**అతి చాకచక్యం వలన అధోగతి :**

కాని, దీనిలో మనం గమనించాల్సిన మరో అంశం కూడ ఉన్నది. ఇటువంటి వాతావరణంలో గూడ కార్యకర్త క్రమ క్రమంగా చాకచక్యాన్ని సంపాదిస్తాడు. "ఇతర కార్యకర్తలైతే కార్య సాధనలో నిమగ్నులై, ఆత్మ సమర్పణ చేస్తూనే యుంటారు కదా! ఈ తరుణంలోనే నా జీవితాన్ని ఎందుకు మెరుగు పరచుకోకూడదు ? నా పెద్దరికాన్ని ఇంకా ఎందుకు పెంచుకోకూడదు ?" అని తనలో తర్కించుకొంటాడు. అంటే వయసు మళ్ళిన వారంతా కార్య సాధనకై ఆత్మ సమర్పణ చేస్తూంటే, మరి వీరు తమ చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ న్నారన్న మాట! కాని, అంత చాకచక్యం ప్రదర్శించే వారొక చిన్న విషయాన్ని విస్మరిస్తున్నారు ! అరరే, మీరు చాతుర్యం నెరిపితే, ఇంతవరకు ఆత్మ సమర్పణా భావంతో నున్న వారిలో కూడ ఇలాంటి చాతుర్యం ప్రవేశిస్తుంది. ఇక వారు ఆత్మ సమర్పణం చేయ జాలరు. వారి ఆలోచనా సరళియే మారిపోతుంది. "మన నాయకుడే తన జీవితాన్ని మెరుగు బరుచుకోడానికి ప్రయత్నిస్తూంటే, మేము మాత్రం మన జీవితాలను మెరుగుపరచుకోకూడదా ?" అని ఆలోచిస్తూ, క్రమంగా ఆ నాయకునితోనే పోటీ పడతారు. నాయకులు కూడ తమ తోటి కార్య కార్యకర్తలలో ఎవరినీ ఏ స్థానంలోనూ నిలద్రొక్కుకోనివ్వరు. తమ కడ్డు తగిలే అవకాశమున్న వారిని తమ దారి నుండి పెకలించి వేయడానికే నిరంతరం

ఎత్తులు వేస్తూంటాడు. ప్రతి నాయకుడును, తన కెవ్వరూ అడ్డు తగల కూడదనే భావమే కలిగి యుంటాడు. ఆలోచనకు వారి యుక్తి తోడయితే దానికి తగిన ప్రయత్నం కూడ ప్రారంభమౌతుంది. ఇదంతా చాల క్రమ క్రమంగా జరుగు తూంటుంది - అతనికి కూడ అర్థం కాని పద్ధతిలో ఇదంతా మార్పు జెందు తూంటుంది. లక్ష్య శుద్ధి కలిగిన కార్యకర్త కూడ ఏ విధంగా విచలితుడై, లక్ష్యానికి దూరమై పదభ్రష్టు డౌతున్నాడో గ్రహింపజాలకయే యుంటాడు. ప్రతి స్థాయిలోను సర్వావస్థల యందునూ, తాను చేస్తున్నదే సక్రమమైనదని నిరూపించుకోవాలని తాపత్రయ పడుతూంటాడు. ఇక, తన సహచరులలో తోటి కార్యకర్తలలో ముందు ముందు తనకు పోటీ పడగలిగే వారిని పసిగట్టి, చాల ముందుగానే వారిని తన దారి నుండి పెకలించి వేయడానికి ఉద్యమిస్తాడు. అలాంటి వారిని గురించి "అసలు అతడు ఏమి చేశాడని ? అతని పని వల్ల ప్రయోజనం శూన్యం. ఈ మాత్రమైతే ఎవరైనా చేసే వారే'' అని పుకార్లు పుట్టిస్తూ, చాడీలు చెప్పిస్తూంటాడు. అంటే ద్వితీయ శ్రేణి నాయకత్వం ఏర్పడ కుండా, క్రొత్త కార్యకర్తలెవ్వరూ ఎదగకుండా అన్ని రకాల ప్రయత్నమూ చేస్తుంటాడు.

దీనికొక మంచి ఉదాహరణం. ఒకడు కప్పలను పట్టి తెచ్చి, అమ్మి జీవించే వాడు. అతడు సముద్ర తీరానికి గంపను తీసుకొని వెళ్ళి కప్పలను పట్టుకొని, ఆ గంపలో వేస్తూండేవాడు. గంపలో కప్పలు చాల చేరాయి, కాని గంపకు మూత పెట్టనే లేదు. అంతలో అతని స్నేహితుడొకడు అతనిని కలుసుకో డానికి వచ్చాడు. అతడు సముద్రంలో ఏదో పని చేస్తూండడం చూచాడు. ఆ మిత్రుడు గంపను కూడ గుర్తించాడు. గంపలో కప్పలుండటం, అవి బయటకు దూకి వెళ్ళటానికి గంతులేస్తుండటాన్ని అతడు గమనించాడు. ఆ వచ్చిన వాడు కప్పలు పట్టే వానిని సమీపించి, ఆతనితో 'అరే, నీవు వాస్తవంగా కప్పలు పట్టాలనుకున్నావా ?" అని అడిగాడు. అతడు 'ఔను' అనగానే, ఆ మిత్రుడు 'కప్పలు గంపలోనే పట్టి ఉంచడానికి కోసం గంప మీద మూత పెట్టలేదే ! మరి అవి గెంతుతూ గంప నుండి బయటకు వెళ్ళిపోవా?' అని సందేహం ప్రకటించాడు. కప్పలు పట్టేవాడు ఏమాత్రమూ తడుముకోకుండానే 'అలాంటి దేమీ జరగదు. దానిని గురించి మీరేమీ కంగారు పడాల్సిన అవసరంలేదు ! ఒక్క కప్పకూడ

బయటకుపోజాలదు. ఎందుకంటే ఒక కప్ప గంప నుండి దూకి తప్పించుకోడానికి ప్రయత్నిస్తే, మిగిలిన కప్పలన్నీ దాని కాళ్ళు పట్టుకొని గంపలోనికి లాగడానికి ప్రయత్నిస్తూంటాయి! అందుచేత ఆ కప్పలను గంపలోనే పట్టి యుంచడానికి మన మేమీ శ్రమ పడాల్సిన అవసర మే లేదు" అని చాలా ధీమాగా సమాధానం చెప్పాడు

కార్యకర్తకు యుక్తి స్ఫురించగానే ఈ తతంగం అంతా జరుగు తూంటుంది నిష్ఠాపరులైన కార్యకర్తల జట్టు క్రమక్రమంగా ఆకాంక్షాపరుల జట్టుగా మారిపోతుంది. స్వార్థంతో మహత్వాకాంక్షాపరుల జట్టుగా మారిపోతుంది. ఇదంతా గుట్టుగా జరిగి పోవటం చేత, అతనికి కూడ ఇది ఏమి బోధపడదు. అడుగడుగునా ప్రతి కార్యకర్తయు 'దీనిలో తప్పేముంది? ఇలా జరగటం సహజమే కదా!' అనుకుంటూ ఉంటాడు. తన ముక్కుకు సూటిగా వెళ్తూ తన స్వార్థాని కనుకూలంగా ఉన్నదే శ్రేష్ఠమైనదని విశ్వసిస్తూ, పూర్తిగా పదభ్రష్టుడై పోతాడు, ఉత్తమ స్థాయికి జేర్చిన సోపానాలను-ధ్యేయనిష్ఠ, ఆత్మ సమర్పణం వంటివి కాలదన్ని వేస్తాడు. అలాంటివి తనకిక అవసర మే కాదంటాడు. మనం కూర్చొనియున్న చెట్టుకొమ్మనే నరికివేస్తే, ఆ కొమ్మ మాత్రమే కాదు, దానితో బాటు మనం కూడ పడిపోతామనే కటు సత్యాన్ని విస్మరిస్తే జరిగేది అధోగతియే! మనం చేసిన పనులన్నీ సమర్థించుకుంటూ దాని ఔచిత్యాన్ని నిరూపించుకోవటం లోనే సతమత మౌతుంటే, దానివలన క్రమక్రమంగా లభించేది అధః పతనమే!

**సంఖ్యాత్మక శక్తి - గుణాత్మక శక్తి :**

మంచి కార్యకర్తగా రూపొందడం కష్టం. తాను స్వయంగా కార్యకర్తగా నిలద్రొక్కుకోవటం ఇంకను కష్టతరం. ఇదంతా తన నాయకత్వాన్ని సుస్థిరం జేసుకొన్నందుకు లేక విజయాన్ని సాధించడంతో ఉత్పన్నమైన అహంకారంవలన ఏర్పడిన గందర గోళమే. అసలు సంఘటన ఎలా లభిస్తుందో, అది ఎలా అంత మౌతుందో, అది ఏ విధంగా పరిణమిస్తుందో ఆలోచిద్దాం. ఏ కార్యకర్త యైనా ఒక పరిశ్రమలో యూనియన్ పని ప్రారంభించా డనుకొందాం. అది క్రొత్త యూనియన్ గదా! ప్రారంభంలో అందులో సభ్యత్వానికి ఎవరూ ముందుకు రారు. ఎవరూ అతనిని ఆదరించరు. పాన్ తినబెట్టరు, టీ వగైరాలు ఇచ్చుకోరు. క్రమక్రమంగా ఎవరో కొందరు మొహమాటంతో అతనికి తమ

సభ్యత్వ రుసుం యిస్తారు అనుకొందాము. సభ్యులెంతమంది యుంటే యూనియన్ శక్తి కూడా అంతే యుంటుంది కదా! దీనినే సంఖ్యాత్మక శక్తి అంటారు. సంఖ్యాత్మక శక్తి అంటే ఒకటి ఒకటి కలిస్తే రెండు అన్నమాట. మొదట్లో ఒకడే సభ్యుడు. ఇంకొకరువస్తే సభ్యుల సంఖ్య రెండు. మరొకరువస్తే మూడు. తరువాత ఒకరు వస్తే మూడు + ఒకటి నాలుగు. సంఖ్యాత్మక శక్తి ఈ విధంగా పెరుగుతుంది.

కార్యకర్త ఆలోచిస్తూంటాడు - నేను ఒకడనే పనులన్నీ ఎంతవరకు చేయగల్గుతాను ? నా లాంటి వారినే మరొక కార్యకర్తను తయారు చేసుకోవాలి అని భావిస్తాడు. మరో కార్యకర్తే తయారైతే, తన పదవికి ఎసరు పెడ్తాడని అప్పట్లో భయమే ఉండదు. భారతీయ మజ్దూర్ సంఘ శిక్షణ శిబిరంలో ఉత్తమ కార్యకర్తల జట్టు ఒకటి తయారు చేయాలని చెప్పారుగాబట్టి, అట్టి కార్యకర్తలను నేను తయారు చేస్తానని దీక్ష బూనుతాడు. ఆ ఉద్దేశంతో మాత్రమే అతడు సంపర్కం ఏర్పరచు కొంటాడు, పెంచుకొంటాడు, సంస్కారం కలిగిస్తాడు. ధ్యేయంపట్ల గొప్ప నిష్ఠను ప్రేరేపిస్తాడు. సాధారణ సభ్యులనుండియే కార్యకర్తల రూపకల్పన చేస్తాడు. అట్టి కార్యకర్తలు ఏర్పడినపుడు వచ్చే శక్తి కేవలం సంఖ్యాత్మక కాదు. అది గుణాత్మకం కూడ. ఆ విధంగా మొత్తానికి శక్తి మరింత పుంజుకుంటుంది. మొదట్లో సభ్యుల సంఖ్య పెరిగితే అది $1+1=2$, $2+1=3$, $3+1=4$ అయ్యేది. కాని, ధ్యేయ నిష్ఠ కల్గిన కార్యకర్తలు తయారైతే, ఒకటితో ఒకటి కలిస్తే పదకొండు అవుతారు. కాని ఇద్దరు కాదు. మూడవ కార్యకర్త కలిసివస్తే నూటపదకొండు (111) అవుతారు. నాల్గవ కార్యకర్తతో కలిసి వేయిన్నూట పదకొండు (1111) అవుతారు. కాని నల్గురు కాదు. ధ్యేయ నిష్ఠ ఉండటం చేతనే ఈ క్రొత్త విధానం ప్రారంభమవుతుంది. నల్గురు కార్యకర్తలు-అంటే వేయిన్నూట పదకొండు మందికి (1111) సమానం అన్నమాట.

**అహంకారం చేతనే శక్తి క్షయము :**

కాని, పరిస్థితి నంతటినీ ప్రభావితం చేయగల ఈ 1111 వ శక్తియే ఇతరులు మనలను పొగడటం ప్రారంభించగానే క్షీణించ నారంభిస్తుంది. ఏదైనా ఒడంబడిక కోసం వెళ్ళామను కొందాం. ఆ పరిశ్రమ యజమానియు, వ్యవ

హర్తయూ మనలను పొగడటం ప్రారంభిస్తారు. కమిటీలలో మనం ప్రాతినిధ్యం వహిస్తూంటాము. క్రమక్రమంగా అహంకారం మనలో చోటు చేసుకొంటుంది. మొదటి కార్యకర్త "ఇదంతా నా కారణంగానే సాధ్యమయింది కదా! నాతో బాటున్న ప్రముఖ కార్యకర్తలనబడే వారి గొప్పతనం ఏముంది కనుక! వారిని ఈ స్థాయికి తెచ్చింది నేనే కదా! ఈ....కార్యకర్త మొదట్లో అయితే చాల జంకుతూండే వాడు, పనికి భయపడి దూరంగా ఉండేవాడు ...ఇలాగ ఉండేవాడు.... అలాగ ఉండేవాడు....ని నేనే కార్యకర్తగా తీర్చి దిద్దాను. అతడు నా కారణంగానే ఈ స్థితికి రాగలిగాడు, కాని ఎప్పుడైనా మా గూటిలోని గువ్వ నన్నే వెక్కిరిస్తే నేనెలా సహించగలను?" అని వితర్కించుకొంటూంటాడు. క్రమక్రమంగా అహంకారం పెరుగుతూంటుంది. ఆ అహంకారం పరిణామం! మొదట్లో ఒక్కొక్క సభ్యుణ్ణి చేర్చుకోవడం చేత నలుగురు సభ్యులైనట్లే - ఒక్కొక్క కార్యకర్తను నిర్మాణం చేయటం చేత వెయిన్నూట పదకొండుమంది అయినట్లే - ప్రముఖ కార్యకర్తల మనస్సులో అహంకారం చోటుచేసు కోవటం చేత శక్తి దశాంశ స్థాయికి దిగజారుతుంది. దశాంశ బిందువు ప్రారంభంలోనే వస్తే అంటే శక్తిని .1111 అని గుర్తిస్తే, దాని వాస్తవిక విలువ ఎంతో మీరే అంచనా వేసికోవచ్చు! .1 శక్తి విలువ ఎంత? ఒక దశాంశము అంటే $\frac{1}{10}$ కి సమానము దానిలోని రెండవ 1 విలువ $\frac{1}{100}$, మూడవ 1 విలువ $\frac{1}{1,000}$ నాలుగవ 1 విలువ $\frac{1}{10,000}$ కాని ఈ $\frac{1}{10}$, $\frac{1}{100}$, $\frac{1}{1,000}$, $\frac{1}{10,000}$ అన్నింటిని కూడినప్పటికినీ, మొత్తము విలువ ఒకటి కూడ కాదు. ఈ విధంగా అహంకారం దశాంశ బిందువు లాగా క్రుంగదీస్తుంది.

**అభివృద్ధి పతనము :**

ఇక్కడినుండియే కార్యకర్త కాలు జారటం ప్రారంభం. అన్ని వేళలా ఔచిత్యాన్ని పాటిస్తే, తన కర్తవ్యం సరిగా బోధ పడుతుంది. అంటే ఏ పనియైనా ఎలా అభివృద్ధి జెందుతుందో, ఎలా పతనమవుతుందో మనం ఊహించ గలుగుతాము. ఇదంతా సృష్టి నియమాలుగా భగవంతుడు ఏర్పరచిందే. అభివృద్ధి జెందుతూ పైకి ఎలా ప్రాకివెళ్ళ గలుగుతారో, క్రుంగిపోతూ ఎలా పతనం జెందుతారో భగవంతుడే విశదీకరించినాడు.

త్రైవిద్యా మాం సోమపాః పూత పాపా యజ్ఞైరిష్ట్వా స్వర్గంతిం ప్రార్థయంతే।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యాం దివి దేవభోగాన్॥

అంటే, యజ్ఞం చేసేవారు, హోమం చేసేవారు, టీ లాంటి పానీయం కూడ సేవించకుండ రోజంతా తపస్సు చేసేవారు స్వర్గానికి వెళ్ళాలని కోరుకుంటారు. ఇంతగా పరిశ్రమించి, దానివలన సంక్రమించే పుణ్యంచేత సురేంద్రులై, స్వర్గ లోకానికి వెళ్ళి అక్కడి భోగాల ననుభవిస్తూంటారు. కాని, అక్కడి సుఖ భోగా లలో మునకలు వేస్తూ వేస్తూ, భగవంతుడన్నట్లుగా

తే తం భుంక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి!

ఇదీ స్వర్గలోకం నుండి లభించే ప్రసాదం! ఏ పుణ్యం చేత మానవుడు స్వర్గానికి వెళ్ళాడో, ఆ పుణ్యం క్రమంగా క్షీణిస్తుంది. ఇంకా 'క్షీణే పుణ్యే' అన్నారు కదా! అతడు అతి భోగలాలసుడౌతాడు - ఈ విధంగానే అవకాశం లభించిన వారందరూ చేస్తున్నదే కదా!' అని తన పనిని పూర్తిగా సమర్థించు కొంటాడు. ఆ విధంగా చెబుతూ చెబుతూ, అతని పుణ్యం తరిగిపోతుంది. క్రమ క్రమంగా పూర్తిగా భోగలాలసుడైపోయి, పుణ్యం సున్న అవగానే "క్షీణే పుణ్యే మర్తలోకమ్ విశంతి" - స్వర్గలోకం నుండి మర్త్యలోకానికి తిరిగి వచ్చేస్తాడు. తన నియోజకవర్గానికి వాపసు వచ్చేస్తాడు. ఇదీ భగవంతు డేర్పరచిన నియమం. దీనిలో రాజకీయపు మినహాయింపు ఏ మాత్రమూ లేదు - ఎవరూ దీని కతీతులు కారు. క్షణక్షణమూ ప్రతి స్థాయిలోనూ తన పనులను సమర్థించుకొంటూంటే- అడుగడుగునా పదభ్రష్టుడవుతూంటే - అంతా తన చేయి జారిపోయిందని అతనికే తెలిసి వస్తుంది అప్పుడిక అతనిని బాగుచేసే వారెవరూ ఉండరు.

### స్వయంగానే సరిదిద్దుకోవాలి :

మనం సామాన్య కార్యకర్తలం. తమ ఉత్తమ జీవితాల చేతను, ఇతర కారణాల చేతను ఆదర్శ పురుషులుగా భావించబడే మహాత్ములు కూడ అంత ర్బాహ్య ప్రపంచంతో మనం రాత్రింబవళ్ళు పోరాడవలసి యుంటుందని చెప్పారు.

బాహ్య ప్రపంచంతో పోరాడటం సులభమే కావచ్చు, కాని మన అంతరాత్మతోనే కుస్తీపట్టడం చాల కష్టంతో కూడుకొన్న పని. మనస్సును మన వశంలో పెట్టుకో లేకపోతే, మనస్సు మనలను ఎక్కడికి లాక్కొని వెళ్తుందో మనం జెప్పలేము. అందుచేతనే, మనకత్యంత సన్నిహితుడైన నేస్తం ఎవరు? అంటే మనమే అని చెబుతారు. మనకెవ్వరూ నష్టం కలిగింపజాలరు. మన నెవ్వరూ పడగొట్టజాలరు. మనలను ఏ కమ్యూనిష్టులు జయింప లేరు. ఏ యాజమాన్యమూ వేధింపజాలదు. ఏ ప్రభుత్వమూ అణగద్రొక్కజాలదు. కాబట్టి మనకత్యంత ప్రబల శత్రువు మనమే అని గుర్తించుకోవాలి - మనలను మనమే సరిదిద్దుకోవాలి. ఈ శత్రుత్వం ఒక నిశ్చితమైన విధి నియమానుసారం ఏర్పడటం చేత మనకు తెలియకుండగనే మెల్లమెల్లగా మనం గోతిలో దిగబడి పోతాము. అందుచేతనే మనం స్వయంగానే ఆత్మ నియంత్రణ కలిగియుంటే బయటివారెవ్వరూ మనల నేమీ చేయజాలరు. మన ధ్యేయ నిష్ఠలో ఏ మాత్రమూ సడలింపులు రాకూడదు. కాని, మనం ఆత్మనియంత్రణ కలిగియుండకపోతే - ఎప్పటికప్పుడు ఆత్మ సమర్థన చేసి కొంటూ ఉంటే - మనం కూడ మాయామచ్ఛింద్రులం కావడానికి ఎక్కువ కాలం పట్టదు అప్పుడు చూచేవారు కూడ "అరెరే! ఇతడేమో చాలామంచి కార్యకర్తగదా ఇతనికేమైపోయింది?" అని విస్మయం ప్రకటిస్తారు. మనం కూడ అలాంటి మన తోటి కార్యకర్త విషయమై "అరే ఇతడు కూడ మచ్ఛిందర్ అయిపోయాడే" అని చెప్పాల్సి వస్తుంది! తన్ను దాను సరిదిద్దుకోవడానికి ప్రతి కార్యకర్తయు మెళుకువతో ఉండి, నిరంతరం పరిశ్రమిస్తూండటం అవసరం. మిగతా ప్రపంచా న్నంతా సరిదిద్దాలి; యూనియన్ స్థితిని మెరుగుపరచాలి, యాజమాన్యంతో సంప్రదింపులు జరపాలి ఇవన్నీ ఉండనే ఉంటాయి. కాని, క్షణక్షణం మన అంత రాత్మతోనే మనం కుస్తీపడుతున్నామా, లేదా? అనేది ముఖ్యం. అడుగడుగునా మనస్సు వికలం జెందే సందర్భాలెన్నో వస్తుంటాయి. ఆత్మపరిశీలన జేసికొంటూ, మనలను మనమే సక్రమ మార్గంలో నడిపించుకోవాలి. ఒక విషయం గుర్తించు కోవాలి - ప్రారంభంలోనే నేను చెప్పినట్లుగా, కార్యకర్త బాగా ఉంటే, కార్య క్షేత్రం కూడ బాగా ఉన్నట్లే దానికోసం ప్రత్యేకంగా కృషి చేయాల్సిన అవసరం ఉండదు. మనలను మనం సక్రమంగా నడుపుకొంటే మిగతా కార్యక్షేత్రాన్ని భగవంతుడే బాగు చేస్తాడు!

# ప్రశ్నలు – సమాధానాలు

ప్రశ్న : రాజకీయ క్షేత్రంలో క్రియాశీలంగా ఉన్న మన మిత్రులు కొందరు కలిసి కేరళలో ఒక కార్మిక సంఘాన్ని [ట్రేడ్ యూనియన్] ప్రారంభించారు. దీనివలన మన కార్యకర్తలలో కొంత అలజడిని నిర్మాణం చేసింది. రాజకీయాలలోని హంగు, ఆర్భాటాల ప్రభావం ఒంటబట్టిన కొందరు వ్యక్తులు కూడా దానిలో చేరారు. ఈ పరిస్థితి నుండి మనం ఎలా బైటపడాలి? ఈ పరిణామాలను నిరోధించడానికి భారతీయ మజ్దూర్ సంఘ్ ఏ ఉపాయాన్ని ఆలోచించాలి?

సమాధానం : ఒకవేళ ఏదైనా రాజకీయ పక్షం కార్మికరంగంలో కూడా ప్రవేశించదలిస్తే ప్రవేశించనియ్యండి. మీరెందుకు బాధపడతారు? మీరు మీ పని చేసుకోండి. వారు వారి పని చేసుకుంటారు. విచారించవలసిన అవసరం ఏమీ లేదు. అసలు ఈ రంగంలో పని ప్రశంశలు లభించని పని. రాజకీయ నాయకులకు అలాంటి పనులుచేసే అలవాటు ఉండదు. వారు చాలా తెలివైనవారు. ఏ మాత్రం శ్రమపడకుండా ప్రధానమంత్రి అయ్యే మార్గం కోసం వెదకుతారు వారు. కనుక ఏ రాజకీయ పక్షం కేరళలో ఏ కార్మిక సంఘాన్ని స్థాపించినా మనం విచారించవలసిన పనిలేదు.

ప్రశ్న : మన కార్యం జరుగుతున్న చాలా స్థలాలలో నిత్యం మనకు పార్లమెంటు సభ్యులు, శాసన సభ్యులు మొదలైన వారితో పని దృష్ట్యా చాలా అవసరం ఉంటూ ఉంటుంది. నా ప్రశ్న ఏమంటే మజ్దూర్ సంఘ్ చాలా పెద్ద సంస్థ కనుక అది స్వయంగా **M.P.** లను **M.L.A.** లను ఎందుకు నిలబెట్టరాదు?

సమాధానం : మీరు చెప్పిన విషయం నాకు చాలా ఆశ్చర్యం కల్గిస్తోంది. ఏనుగు ఉంటుంది. మావటివాడు ఉంటాడు. మన కోరిక మీరు మావటి వాడు కావాలని. ఏనుగు కావాలని మీరు అంటున్నారు. ఎన్నికలలో నిలబడాలని మీరు అనుకోవడంలేదు అన్నది నాకు తెలుసు. భారతీయ మజ్దూర్ సంఘ్ నాయకత్వం అంటే ఆకాశంలో విహరించే రాజకీయ పక్షాల నేతృత్వం

లాంటిది కాదు. పైకి చెప్పకపోయినప్పటికీ ఎవరి మనస్సులో ఏముందో మనకు బాగా తెలుసు. మన గురించి తెలిసి కూడా మన ముందు ఎవరైనా నాటకం ఆడే ప్రయత్నం చేసినప్పటికీ మనకు మావటివాడు కావాలన్నదే ఇచ్ఛ. మీరు ఏనుగు కావాలని ఎందుకు కోరుకుంటున్నారు ?

ప్రశ్న : భా. మ. సంఘ్ ఏ రాజకీయ పక్షానికి లోబడి పని చేయదని మీరు చెబుతూ ఉంటారు. అయినా మన వివిధ కార్యక్రమాలు, ఉత్సవాలలో వివిధ రాజకీయ నాయకులు వేదికలపై కనిపిస్తూనే ఉంటారు. ఇలా ఎందుకు జరుగుతుంది?

ప్రశ్న : రాజకీయాల నుండి, ప్రభుత్వ వ్యవహారాల నుండి దూరంగా ఉండడం ఎలా ముఖ్యంగా బి. యమ్. యస్. విషయంలో ఎలా ?

ప్రశ్న : మానవుని జీవనస్థాయి వృద్ధి చేయడం మన చివరి లక్ష్యం. గత15 వందల సం॥ల చరిత్రను పరిశీలించినట్లయితే వివిధ సంస్కృతులు, జాతుల యొక్క ఉత్థానపతనాలు, ప్రారంభము, ముగింపు మొ॥ అంశాలలో రాజకీయాలు ప్రధాన భూమిక వహించినట్లు స్పష్టమౌతుంది. రాజ్యస్థాపన కారణంగానే కొన్ని రాజ్యాలు ఏర్పడ్డాయి. రాజకీయ పతనం కారణంగా రాజ్యాలు విలీనం కావడం గానీ, కుచించుకుపోవడం గానీ జరిగింది. మరి అటువంటప్పుడు రాజకీయాల కతీతంగా వ్యవహరించాలనుకోవడం పొరపాటు కాదా?

**సమాధానం :** ఇక్కడ అందరూ పాతవాళ్ళే ఉన్నారు కనుక సమాధానం చెప్పడానికి ముందు గతంలో చెప్పిన కొన్ని విషయాలు సంక్షిప్తంగా గుర్తు చేస్తాను. తరువాత సమాధానం విషయం ఆలోచిద్దాం. భా. మ. సంఘ్ నిజమైన (ప్రామాణికమైన) కార్మిక సంఘటన- కార్మికుల యొక్క, కార్మికుల కొరకు, కార్మికులే నడుపుకునే సంఘటన ఇది. కనుక మనం రాజకీయాలకు అతీతులం. కమ్యూనిస్టుల మండలిని మన ముందు 'జ్ఞాపకం తెచ్చుకున్నట్లయితే మనకు ముందున్న ప్రతి సంఘటన ఏదో ఒక రాజకీయ పక్షానికి అంగంగానే ఉంటూ వచ్చింది. మనం మనను రాజకీయాలకు అతీతంగా ప్రకటించుకున్నప్పుడు ఈ విషయంలో చాలా చర్చ జరిగింది. మనకు చాలా ఇబ్బందులు కూడా

ఎదురైనాయి. దీనికి ఒక కారణం భా. మ. సంఘ్ ప్రారంభం చేసిన మొదటి జట్టులో రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ సభ్యులు ప్రముఖంగా ఉండడం. సంఘంలోని వ్యక్తులు మజ్దూర్ సంఘ్‌లో పూర్ణ సమయ, అర్ధ సమయ కార్యకర్తలుగా వస్తూఉండే విధంగా మనం కూడా ప్రయత్నం చేస్తూండే వాళ్ళం.

దీనికి కూడా కారణం ఉంది. నేడు దేశం చాలా ముందుకు పోయింది. ప్రజలందరూ చాలా చతురులు అయిపోయారు. నేడు "సత్తాతురాణాం న దల న రాష్ట్రః" అనే స్థితి ఉంది. 1947 కి ముందు జీవన విలువలు వేరుగా ఉండేవి. రాంప్రసాద్ బిస్మిల్ ఉరి తీయబడే ముందు జైలులో-

'ఖీంచ్‌కర్ లాయీ సబ్‌కో కత్ల్ హోనేకీ ఉమీద్'-

ప్రాణార్పణ చేయాలనే బలమైన కోరికే మమ్మల్ని ఇక్కడి వరకు లాక్కొని వచ్చింది- అని అంటాడు.

నేడు దేశంలో ఎవరైనా ఈ మాటలు అన్నట్లయితే వెంటనే అతడిని పిచ్చాసుపత్రికి పంపిస్తారు. ఒకవేళ ఇవాళ ఈ పంక్తులు అనవలసి వస్తే ప్రజలు వీటిని కొద్దిగా మార్చి మరీ అంటారు.

ఖీంచ్‌కర్ లాయీథీ సబ్‌కో మంత్రి హోనేకీ ఉమీద్ -

మంత్రికావాలనే బలమైన కోరిక మమల్ని ఇక్కడివరకు లాక్కొని వచ్చింది అని. మొత్తం 60 కోట్ల మంది కూడా నేడు ప్రధాన మంత్రి కావాలని కోరుకుంటారు. 47కి ముందు నాటిభావాలతో జీవించేవారిని నేడు పిచ్చివాడు అంటారు మనమయితే దేశంలో అలాంటి 'పిచ్చివారు' ఎక్కడ దొరుకుతారా? అని వెదుకుతున్నాం. దొరకడంలేదు. ఎవరిని చూసినా 'బుద్ధిమంతులే' కనబడుతున్నారు. ఈ వెదుకుతున్న సందర్భంలో ఇలాంటి పిచ్చివాళ్ళను తయారుచేసే పరిశ్రమ ఒకటి ఉందని, అది రాష్ట్రీయ స్వయంసేవక సంఘమని మన దృష్టికి వచ్చింది. ఆ పరిశ్రమనుంచి ఎంత నాణ్యత కలిగిన 'పిచ్చితనం' ఉత్పత్తి వస్తుందంటే అంతటి నాణ్యత మరే పరిశ్రమలోనూ లభించదు అందుకే మనం మనఅవసరాలు వారి ముందుంచి, మిత్రమా! ఉత్పత్తి అవుతూనే ఇటు పంపించండి అని చెబుతూ

ఉంటాం. రా. స్వ. సంఘ్‌కు చెందిన ఇలాంటి వ్యక్తులు జనసంఘ్, విద్యార్థిపరిషత్ లలో కూడా ఉండేవారు. ఇది ఒక అంశం. మరొక అంశం ఏమిటంటే ప్రజల మనస్సులలో ఒకటే విషయముంది - I N T U C కాంగ్రెస్ విభాగం A I T U C కమ్యూనిస్టుల విభాగం, H M S సోషలిస్టుల విభాగం అని కనుక ఒక వేళ ఏదైనా కేంద్రీయ కార్మికసంఘటన ఉన్నా అదికూడా ఏదో ఒక రాజకీయ పక్షానికి అనుబంధం అయితీరాలని ప్రజలు భావిస్తున్నారు. కానీ మనదగ్గర మాత్రం మనకు ఎలాంటి రాజకీయ పార్టీలేనట్లే, అటు వారికి ఎలాంటి కార్మిక వర్గము ఉండదు. మన ఈ రాజకీయాలకు అతీతంగా ఉండే సిద్ధాంతం ఏదైతే ఉందో అది దేశంలో ఇంతకుముందు ఎవరూ విననిది, చూడనిది, అనుభవంలో లేనిది. ఇక సంఘానికి చెందిన వ్యక్తులు రెండింటిలోనూ (కార్మిక రంగం, రాజకీయరంగం) ఉండడం చూసి సహజంగానే ప్రజలు మనం ఎంత చెప్పినా పప్పులో కొంతరాయి తప్పక ఉందని ఊహిస్తారు. కొందరైతే మీరు అన్నీ వివరంగా బైటపెట్టరు. ఇది కూడా రాజకీయమే అనికూడా అంటారు.

ఆచరణలో కూడా కొన్ని ఇబ్బందులు ఎదురౌతూ ఉండేవి. ఇరువైపుల సంఘానికి చెందిన వ్యక్తులు ఉన్నారు. మన మధ్య సైద్ధాంతిక సమానత కూడా ఉంది. వ్యక్తిగత మిత్రత్వమైతే చెప్పనవసరం లేదు. కమ్యూనిస్టులతో స్నేహం చేయవలసివచ్చినా కూడా సంఘవారితో స్నేహాన్ని వదులుకునే ప్రశ్నే లేదు. స్నేహంలో ఒక్కొక్కసారి హద్దులపాలనే జరుగుతుంది. ఒక్కొక్కసారి దాని ఉల్లంఘన కూడా జరుగుతూ ఉంటుంది. స్నేహం అంటే మీ అందరికీ తెలిసినదే ఈ రకమైన ఆత్మీయత చాలా కఠినమైనది. హద్దు మీరకుండా సదా పనిచేయడం అందరికి సాధ్యమయ్యే విషయం కాదు. ఇది చాలా కష్టతరం. అందువల్ల అప్పుడప్పుడు ఈ ఉల్లంఘన జరుగుతూ ఉంటుంది. మనం రాజకీయాలకతీతం అయితే రాజకీయ నాయకులు మన వేదికలపై ఎందుకు కనిపిస్తారు? అని ఇప్పుడే ఒక ప్రశ్న కూడా వచ్చింది. ఈ పశ్న వినగానే నా మనస్సులో ఒక సమాధానం మెదిలింది. శ్రీ జగదీష్ ప్రసాద్ దీక్షిత్ మన అఖిల భారతీయ డి.ఆర్.ఎమ్.ఎస్. ప్రారంభోత్సవానికి వచ్చారు. వారు కాంగ్రెస్ (ఐ) కి చెందిన కార్మిక మంత్రి. వారి విషయంలో కూడా మీరు అలాగే అంటారా ? మన వేదికలపైకి రకరకాల వ్యక్తులు వచ్చారు. కానీ, భా.జా.పా. విషయంలో ప్రశ్నించేవారు జగదీష్

ప్రసాద్ దీక్షిత్ వగైరాల విషయం మరచిపోయారు అని స్పష్టమౌతోంది. మన ఈ వ్యవహార శైలి ద్వారనే మనది నిజమైన రాజకీయాతీత సంస్థ అని చెబుతూ ఉండేవారం. ఇరువైపుల సంఘ వ్యక్తులు ఉండడం వల్ల అప్పుడప్పుడు హద్దుల అతిక్రమణ కూడా జరుగుతూ ఉంటుందన్నది వాస్తమే. ఈ రకమైన ఉల్లంఘన జరగకుండా ఉండడానికి ఆలోచన చేస్తాం మొదట్లో మనం రాజకీయాలకు అతీతులం అని చెప్పినపుడు ప్రజలు నమ్మేవారు కాదు. మనం 'అవును' అనడం వారు 'కాదు' అనడం నడుస్తూ ఉండేది. ఆ రోజులలో కార్యకర్తలకు చెబుతూ ఉండేవారం. 'మిత్రమా! అనవసరంగా వాదోపవాదాల ఝంఝాటంలో దిగవద్దు. నిజంగా మనం రాజకీయాల కతీతంగా పని చేస్తూ ఉంటే ప్రజలకు అన్ని విషయాలు అర్థం అవుతాయి. బాధపడవలసిన అవసరం లేదు.' అని. ఒకవేళ మనం రాజకీయాల కతీతంగా, నిజాయితీగా వ్యవహరించకపోతే, అక్కడ రాజకీయాతీతం అని చెప్పుకుని ఇక్కడ ఒక రాజకీయ పక్షానికి శాఖలాగా పని చేస్తూ ఉంటే ప్రపంచంలో దేనిని దాచిపెట్టడం సాధ్యం కాదన్న భగవంతుని న్యాయం ఉండనే ఉంది. పాపాన్ని దాచిపెట్టలేం. పుణ్యం దాగి ఉండలేదు. ఎవరూ ఎవరినీ ఎక్కువ కాలం మూర్ఖులుగా చేయలేరు. మన వాస్తవిక రాజకీయాతీత వ్యవహారశైలి (Real Non - Political Charecter) దృఢంగా ఉంచుకుంటే అన్ని విషయాలు వాటంతట అవే సర్దుకుపోతాయి. మనం సంఘానికి చెందిన వ్యక్తులం. సంఘ వ్యక్తులు ఇరువైపులా ఉన్నాం. సమాజ రచన విషయంలో సంఘానికి ఒక నిశ్చిత ఆలోచన ఉంది. దానిలో రాజకీయాతీత వ్యవహార మనే అంశం కూడా వస్తుంది. ఆ కారణం కూడా మనం రాజకీయాతీత వ్యవహార శైలిని స్వీకరించడానికి కారణం అయింది.

రాజకీయ పక్షాల పరిధి - ప్రభుత్వం విషయంలో వారి బ్లూ ప్రింట్‌లో పేర్కొన్న మేరకే ఉండాలన్నది సంఘ సిద్ధాంతం. అధికారంలో ఉన్నా లేకున్నా వారి పరిధి ఆ విధంగానే ఉండాలి. అధికారం లభించినప్పుడు అంతా పార్టీ చేతుల లోకి వస్తుందన్నది వాస్తవమే. ప్రతిపక్షంగా ఉన్నప్పుడు అలా రాదు. కానీ విషయాను సారంగా ప్రభుత్వ పరిధి, రాజకీయ పక్షం యొక్క పరిధి కూడా ఒకటిగానే ఉండాలి. కిసాన్ సభ, విద్యార్థి ఫెడరేషన్ కూడా తమ ఆధీనంలోనే ఉన్నాయని కమ్యూనిస్టులు చెబుతున్నారు. వారి ఈ వాదన తర్కబద్ధమైనది కూడా. ఎందు

వల్ల? ఎందుకంటే వారి చివరి బ్లూ ప్రింట్‌లో ప్రొలిటేరియట్, నియంతృత్వం వస్తుందని వారు చెబుతున్నారు. కాబట్టి ఈ నియంతృత్వం ప్రొలిటేరియట్‌దా లేక పార్టీదా లేక వ్యక్తిదా అని మీరడగ వచ్చు. ఇది వారికి సంబంధించిన ప్రశ్న. మనం దానిలోకి వెళ్ళవలసిన పనిలేదు. అయితే నియంతృత్వం అంటే ప్రతి విషయం రాజ్యాధికారానికి లోబడి, ప్రతీదీ రాజ్యం కోసం రాజ్యాధికార పరిధికి బైట ఏదీ ఉండదు అని వారు స్పష్టంగా చెబుతూనే ఉన్నారు. నియంతృత్వ వ్యవస్థకు లోబడి ఏ సామాజిక, ఆర్థిక, ధార్మిక, సాంస్కృతిక, వ్యక్తిగత వ్యవహారాలు నడిచినా అవి అన్నీ రాజ్యాధికారానికి లోబడే ఉంటాయి. కమ్యూనిస్టుల అంతిమ బ్లూ ప్రింట్ నియంతృత్వానికి సంబంధించినది. అంటే వారికి రాజ్యాధికారమే సర్వస్వం. ఇది వాళ్ళు దాచుకోకుండా స్పష్టంగా చెబుతారు. కనుక వారి రాజకీయ పక్షం యొక్క విషయానుసార పరిధి అంతవరకు ఉండాలి. అందువల్లనే వారి బ్లూ ప్రింట్‌లో ఏ విధంగా అయితే అన్ని సామాజిక, ఆర్థిక, ధార్మిక, సాంస్కృతిక వ్యవస్థలు రాజ్యాధికారానికి లోబడి ఉంటాయో అదే విధంగా సామాజిక, ఆర్థిక, ధార్మిక, సాంస్కృతిక సంస్థలు, జన సంఘటనలన్నీ కూడా కమ్యూనిస్టు పార్టీలో ఫ్రంట్ ఆర్గనైజేషన్స్ రూపంలోనే ఉంటాయి. వారి ఈ సంరచన వారి దృష్టిలో పూర్తిగా శాస్త్రీయమైనదే.

ప్రభుత్వాధికారమే సర్వసం అనే విధంగా మనం కూడా కోరుకుంటామా? మనం అలా కోరుకోవడం లేదు. ప్రభుత్వపు పరిధి సాధ్యమైనంత తక్కువ ఉండాలని మనం కోరుతున్నాం. భారతీయ ఆలోచనా విధానంలో ప్రభుత్వ రహిత సమాజ స్థితి మన ఆదర్శం. అయితే పూర్తిగా ప్రభుత్వ రహిత సమాజం ఆచరణ యోగ్యం కాదు కనుక పరిమిత ప్రభుత్వ సమాజం మంచి స్థితిగా మనం పరిగణిస్తున్నాం. దానిలో సామాజిక, ఆర్థిక వ్యవస్థలు తమంతట తామే స్వయం శాసితాలుగా పని చేస్తాయి. ఇది మన భారతీయ సమాజ రచనా శైలి. మన అంతిమ బ్లూ ప్రింట్‌లో ప్రభుత్వాధికార పరిధి నియంత్రితమైనది. సామాజిక, ఆర్థిక వ్యవస్థలు స్వయం పోషకాలుగా, స్వయం శాసితాలుగా ఉండాలన్నది మన సిద్ధాంతం. రాజకీయ పక్షాలు, ప్రభుత్వాధికారం యొక్క కార్య పరిధి మధ్య అంతరం బిందు మాత్రంగానే ఉండాలి. అందువల్ల సమాజ సంఘటనలు, సంస్థలు పార్టీ పరిధికి లోబడి ఉండరాదు.

భారతీయ పద్ధతి ననుసరించి ప్రభుత్వాధికారం గానీ, రాజకీయ పక్షాలు గానీ సర్వస్వం కారాదని మనం భావిస్తున్నాం. జాతీయ భావనతో ప్రేరితాలైన సామాజిక సంఘటనలు తమ సభ్యుల యొక్క, దేశం యొక్క హితాన్ని కాపాడాలి. జాతీయ నిర్మాణ కార్యంలో తమ సభ్యుల శక్తి యుక్తులు ఏవిధంగా వినియోగింపబడాలన్నది ఆలోచించాలి. ప్రభుత్వం మంచి పనులు చేస్తున్నపుడు దానికి సహకరించాలి. పొరపాట్లు చేసినపుడు వ్యతిరేకించాలి. ప్రభుత్వమే దేశంలో ఏకైక శక్తి కేంద్రం కాకుండా చూస్తూ వైకల్పిక శక్తి కేంద్రాలుగా (Alternative Power Center) పని చేయాలి. భారతీయ సమాజ రచన దృష్టిలో ఇది తర్కబద్ధమైన విషయం.

ఈ దృష్టిలోనే అంతా రాజకీయ పార్టీకి లోబడి ఉండడం పొరపాటని సంఘం కూడా భావిస్తోంది. ఎలాగైతే ప్రభుత్వాధికార పరిధి పరిమితంగా ఉండాలని ఆశించబడుతోందో, అలాగే రాజకీయ పార్టీ పరిధి కూడా పరిమితం గానే ఉండాలి. సామాజిక సంస్థలు స్వతంత్రంగా ఉండాలి. ఒకవేళ వెంటనే అవి వైకల్పిక శక్తి కేంద్రాలుగా (Alternative Power Centers) రూపొం దడం సాధ్యం కాకపోయినా, కనీసం ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చే కేంద్రాలుగా (Presser Groups) రూపొందడం సాధ్యం కావచ్చు. మనం రాజకీయాల కతీతంగా ఉండాలని నిశ్చయించుకోవడానికి ఇది కూడా ఒక కారణం

ఈ విషయంలో చాలా పెద్ద చర్చ నడిచింది. అవును, కాదు, అవును, కాదు నడుస్తూ వచ్చింది. కానీ ఇతర పక్షాల వ్యక్తులు అధికారంలోకి వచ్చి 1967 లో మిశ్రమ మంత్రివర్గాలు ఏర్పడినపుడు, ఆ మంత్రి వర్గాలలోని మంత్రులకు వ్యతిరేకంగా కూడా మనం ప్రదర్శనలు చేయడం ప్రజలు చూశారు 1977లో నాలుగు రాష్ట్రాలలో జనసంఘ ముఖ్యమంత్రులు ఉన్నారు. ఆ రాష్ట్రాలలో కూడా మనద్వారా ప్రముఖ ఆందోళనలు జరిగాయి. ఏదైతే మన ప్రఖ్యాత సమ్మెగా చెప్పబడుతూ ఉంటుందో, దేనిద్వారా అయితే మనకు ప్రపంచ ప్రఖ్యాతి లభించిందో ఆ సమ్మె ఢిల్లీలో జరిగింది. అప్పుడు అక్కడ భా. జా. పా. ప్రభుత్వంఉంది. నీటి సమస్యపై భారతీ మజ్దూర్ సంఘ్ అక్కడ హర్తాళ్ చేసింది. అక్కడ తప్పెవరిది ఎవరిది తప్పుకాదు అనే ప్రశ్న వదిలిపెట్టండి. కానీ దాని కారణంగా సి.పి.ఐ.,సి.పి ఐ ఎమ్ వాళ్ళు "మీరు ఇలా ఎందుకు చేశారు ?" అని

మనను ప్రశ్నించడం మొదలుపెట్టారు. మనం చెప్పాం "మేం చేయవలసినది చేశాం" అని. ఇప్పుడు సి.పి.ఐ, సి.పి.ఎమ్, ఎ.ఐ.టి.యు.సి., సి.ఐ.టి.యు, మరే ఇతర సంస్థకు చెందిన బాధ్యతాయుతుడైన వ్యక్తి కూడా భారతీయ మజ్దూర్ సంఘ్ భా.జా.పా. కార్మిక విభాగం అని అనడు. ఢిల్లీ వాటర్ వర్క్స్ హర్తాళ్‌కు ముందు ఎవరైతే మనం భా.జా.పా.కు కార్మిక విభాగంగా ఉండాలని అనేవారో వారు ఇప్పుడు ఆ మాట అనరు. భా.జా.పా. ఎడల సున్నితంగా వ్యవహరించాలని మాత్రం సూచిస్తారు. 'మిత్రమా! ఎవరు ఎవరితో ఎంత మృదువుగా వ్యవహరించాలన్నదానికి కొలమానం ఏదీ ఉండదు' అని మనం వారికి చెబుతూ ఉంటాం. ఇది మనం ఆలోచించవలసిన విషయం.

మన గురించి మనం రాజకీయాలకు అతీతులం అని చెప్పుకున్నప్పుడు ప్రజలు ఇది ఎలా సాధ్యమౌతుంది? అని ప్రశించేవారు. అప్పుడు మనం "గ్రేట్ బ్రిటన్ యొక్క ఉదాహరణ చూడండి. అక్కడి బ్రిటిష్ లేబర్ పార్టీ బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నుండి ఉద్భవించింది. అయినా ఆ పార్టీ మొత్తం దేశానికి సేవచేయాలని వాంఛిస్తూ ఉంటుంది. బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ కేవలం కార్మికుల సేవ మాత్రమే కోరుకుంటుంది. ఆర్థిక శాస్త్ర పద జాలంలో చెప్పాలంటే కార్మికులందరూ బ్రిటిష్ ట్రేడ్ యునియన్ కాంగ్రెస్‌లో వినియోగదారులు. బ్రిటిష్ లేబర్ పార్టీలో కార్మికులు పెట్టుబడిదారులే. కనుక ఎప్పుడైనా ప్రభుత్వపు పొరపాటు విధానాల కారణంగా పెట్టుబడిదారులు, కార్మికుల శ్రేయస్సు విషయంలో సంఘర్షణ ఉత్పన్నమైనట్లయితే పెట్టుబడిదారుల పక్షం వహించి కార్మికులకు వ్యతిరేకంగా పనిచేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఇలాంటి పరిస్థితి బ్రిటన్‌లో అనేకసార్లు నిర్మాణం అయింది కూడా. బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నుండి పుట్టిన సంస్థ బ్రిటిష్ లేబర్‌పార్టీ. దానికి వ్యతిరేకంగా హర్తాళ్ చేయడం బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో అత్యవసరం అని చెప్పబడింది. ప్రారంభంలో ఆ విషయంలో కూడా భ్రమలు ఉండేవి. బ్రిటిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ నుండి బ్రిటష్ లేబర్ పార్టీ విడిపోయి నట్లైతే పదవులు చేజిక్కించుకోవచ్చని తహతహలాడే వ్యక్తులు ఇరువైపులా ఉన్నారు. ఎన్ని సంస్థలకు మనం అధ్యక్షులం కాగలిగితే అంతగొప్ప అని భావించే ప్రజలు మనవద్ద కూడా ఉన్నారు. ఎందుకంటే ఎక్కడా కూడా పనిచేయనక్కర

లేదు కదా! అక్కడ కూడా మనం బ్రిటిష్ లేబర్ పార్టీలో ప్రముఖులుగా ఉందాం దానితోపాటు ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అధ్యక్షులుగా కూడా ఉందాం అని భావించే ప్రజలు ఉండేవారు. అయితే ఆ తరువాత కార్మిక సంఘాలపని ఇరవై నాలుగు గంటలూ ఉండేపని అని అర్థమైంది. రాజకీయ క్షేత్రంలో కూడా ఇరవై నాలుగు గంటలూ పని ఉంటుంది. కనుక ఒకేవ్యక్తి రెండు పనులూ చేయలేడని ప్రజలు గ్రహించారు. అయితే కేవలం కార్మికుల విషయమే ఆలోచిస్తూ పోతే రాజకీయ పార్టీ పని నడవదు. ఎందుకంటే ఎన్నికలలో గెలవాలంటే కార్మికేతరుల వోట్లు కూడా కావాలి, అనికూడా స్పష్టమైంది. అదృష్టాత్ ఇరువైపులా పదవులలో ఒకరే ఉండకూడదు. ఇంగ్లాండులో వారు ఈ పరంపరను ప్రస్తావన చేశారు. వారి రాజ్యాంగంలో అలాంటి నియమమైతే ఏమీలేదనుకోండి.

అమెరికాను ఉదాహరణకి తీసుకున్నప్పటికి అక్కడ ఏ కార్మిక సంఘం ఏ రాజకీయ పార్టీకి అంతర్భాగంగా లేదన్నది స్పష్టంగా గ్రహిస్తాం. అయితే అక్కడ కార్మిక సంఘాలు చాలా శక్తివంతమైనవి. ఇక్కడ మనకు ఒక్కొక్క సంస్థలో ఒకటికంటే ఎక్కువ కార్మిక యూనియన్లు ఉన్న కారణంగా యాజమాన్యం, ప్రభుత్వాలకు ఒకరిని ఒకరు నిందించేందుకు చక్కటి అవకాశం లభిస్తోంది అక్కడ అలాలేదు. దానితో బాటు ఏదైనా రాజకీయ పక్షానికి అనుబంధంగా చెప్పుకునే కార్మిక సంఘం ఒక్కటి కూడా లేదు. ఇక కమ్యూనిస్టు పార్టీ ప్రభావం అయితే అక్కడ లేనేలేదు. 1979 లో నేను అక్కడి వెళ్ళాను. ఆ సమయంలోనే సోషలిస్ట్ పార్టీలో విభజన కూడా జరిగింది. విభజనకు పూర్వం అమెరికాలో వారి మొత్తం సంఖ్య 70 వేలు ఉండేది. మీరు రావడానికి ముందు హిందుస్థాన్ నుండి ఏ సోషలిస్ట్ నాయకుడు ఇక్కడకు రాలేదు. మరి భారత్ నుండి ఎవరూ రానప్పుడు అమెరికాలో సోషలిస్ట్ పార్టీ ఎలా ముక్కలైంది?-అని ప్రజలు నన్నడిగేవారు. ముక్కలు చేయడంలో ప్రఖ్యాతిగాంచిన పెద్దలు మనవద్ద ఉన్నారు. ఇంతకూ అక్కడ రెండు ప్రముఖ రాజకీయ పక్షాలు ఉన్నాయి. ఒకటి డెమొక్రాట్లు, రెండు రిపబ్లికన్లు. రెండింటికీ కూడా అనుబంధ కార్మిక సంస్థలనేవి లేవు. అక్కడ మరి ఎన్నికలలో ఏం జరుగుతూ ఉంటుంది?

అక్కడ ప్రతి జిల్లాలోనూ, పెద్ద పెద్ద పట్టణాలలోనూ కార్మిక సంఘాల మండలులు ఉంటాయి. ఆ మండలి కార్యాలయంలోకి మీరు ప్రవేశించగానే ఎదురుగా గోడపై మీకు ఒక ఛార్ట్ కనిపిస్తుంది దానిపై ఆ మండలి భౌగోళిక పరిధిలోగల అందరు ప్రజా ప్రతినిధుల పేర్లు ఉంటాయి. మన పరిభాషలో చెప్పాలంటే మొదట పార్లమెంటు సభ్యులు, తరువాత శాసనసభ్యులు, కార్పొరేషన్ ప్రముఖులు, మున్సిపాలిటీ అధ్యక్షులు వగైరాల పేర్లన్నమాట. ఆ తరువాతి 'కాలమ్'లో అమెరికా కాంగ్రెస్ (అమెరికా పార్లమెంటులో) కార్మికులకు సంబంధించిన ఏ యే చట్టాలు ఏ యే రోజులలో వచ్చాయో వ్రాసి ఉంటుంది. తరువాతికాలమ్ వివిధ ప్రజా ప్రతినిధులకు ఇవ్వబడే మార్కులకు కేటాయించబడి ఉంటుంది. ఇదే విధంగా మిగిలిన ప్రతినిధుల పట్టిక కూడా ఉంటుంది. ఒకవేళ ఒక సభ్యుడు కార్మిక శ్రేయస్సుకు అనుకూలంగా మద్దతు ఇచ్చినట్లయితే అతనికి + 25 మార్కులు ఇస్తారు. ఒకవేళ అతడు కార్మికులకు వ్యతిరేకంగా మద్దతు ప్రకటించినట్లయితే — 25 మార్కులు ఇవ్వబడతాయి. కొన్ని ప్రత్యేక సందర్భాలలో కార్మికుల కోర్కెలను సాధారణ ప్రజలు వ్యతిరేకించడం జరుగుతూ ఉంటుంది. ఒక్కొక్కసారి ఈ వ్యతిరేకత ఎంత తీవ్రంగా ఉంటుందంటే ప్రజలకు వ్యతిరేకం అవుతామేమోనన్న అనుమానంతో కార్మికులకు వ్యతిరేకంగా ప్రజాప్రతినిధి వోటు వేయవలసి రావచ్చు. అటువంటప్పుడు - 25 బదులు - 23 ఇస్తారు. ఈ విధంగా ప్రతి ఒక్కరికీ మార్కుల జాబితా తయారౌతుంది. రాబోయే నాలుగేళ్ళలో ప్రముఖ పార్టీ నుండి ఏ విధమైన వాగ్దానాలు రావచ్చు అనే విషయం కనీసం ఎన్నికల ముందు తెలిసే అవకాశం ఉంది. ఆ ప్రశ్నల విషయంలో ప్రశ్నావళి తయారు చేయబడుతుంది. ఈ ప్రశ్నావళిని అందరు అభ్యర్థుల వద్దకు పంపి వారి సమాధానాలు సేకరిస్తారు.

వినడానికి చూడడానికి ఇది చాలా తేలికగా అనిపిస్తుంది. మన దేశంలో ప్రతి అభ్యర్థి ప్రతి ప్రశ్నకు 'అవును' అనే సమాధానం చెబుతాడు. తరువాత తనను ప్రశ్నించేవాడెవడూలేడని ఇతడికి తెలుసు. కానీ అక్కడ అలాంటి పరిస్థితి లేదు అక్కడ కార్మికులు విద్యావంతులు, జాగరూకులు. సంఘటితులు కూడా. ప్రజలు కూడా విద్యావంతులు, సంఘటితులు. అందుకే అక్కడ ఇలాంటివన్నీ నడవవు ఎన్నికలకు ముందు అభ్యర్థి లేక పార్టీ ఏవో వాగ్దానాలు చేయడం, తిరిగి

5 సం॥ల వరకు తన క్షేత్రంలో కాలు మోపక పోవడం-అయినా ఏమీ ప్రమాదం లేదు, అనే స్థితి అక్కడ సాగదు, మీరు చేయగలిగితే 'ఊ' అనండి, లేకుంటే కాదని చెప్పండి అని అక్కడ నిలదీసి అడుగుతారు. ఒకవేళ ఎవరైనా 'ఊ' అని దానిని పాలించకపోతే ప్రజలు అతడిని సామాజికంగా బహిష్కరిస్తారు. రోడ్లపై తిరగనివ్వరు కూడా. ప్రజలలోనూ, కార్మికులలోనూ కూడా అక్కడ ఇంతటి జాగృతి ఉంది.

ప్రశ్నావళికి ప్రతి అభ్యర్థి పంపించే సమాధానాలు ముందుగా ప్రచురింప బడతాయి. ఆ తరువాత కార్మిక మండలి సమావేశం అవుతుంది. ఆ మండలిలో ఆ క్షేత్రంలోని వివిధ యూనియన్ల నుండి ఒకళ్ళో, ఇద్దరో ప్రతినిధులు ఉంటారు. ప్రశ్నావళికి సమాధానాలు, అభ్యర్థి యొక్క పూర్వపు నాలుగేండ్ల చరిత్ర పరిశీలించి ఎవరికి ఓటు వేయాలనే విషయం ఆలోచిస్తారు. అప్పుడప్పుడు విడిగా అభ్యర్థులతో కూడా మాట్లాడతారు. ఏదైనా వివరణ కావలసి ఉంటే దానికై ఒక పత్రాన్ని విడుదల చేస్తారు. అయితే దానికి తప్పక విలువ ఇవ్వవలసిన నియమం ఏమీ లేదు. ఆ పత్రం ఎలా ఉంటుందంటే దానిద్వారా ఏమీ తెలియని కార్మికుడికి కూడా ఎవరికి వోటు చేయాలో తెలిసిపోతుంది.

ఈ పద్ధతి మాకు ఆశ్చర్యం కలిగించింది. అందుకే దీనిని మీరు ఎలా ఆచరణలో పెట్టగలుగుతున్నారు? అని మేం వారిని ప్రశ్నించాం. ఎందుకంటే అమెరికన్ కాంగ్రెస్‌లో ఓటింగ్ పార్టీ ఆదేశాన్ననుసరించి జరుగుతుంది. ఎన్నికలలో అభ్యర్థులు చేసే వాగ్దానాల ఆధారంగా అక్కడ ఓటింగ్ జరగదు. పార్టీ ఆదేశం ఎలా ఉంటే అలా జరుగుతుంది వారి సమాధానం ఏమిటంటే 'ఇక్కడ కార్మికుల సంఘటన ఎంత పటిష్టమైనదంటే ఆ క్షేత్రానికి సంబంధించిన అందరు ప్రతినిధులు కార్మికుల సమస్యలకు వ్యతిరేకంగా విధానాలు ప్రకటించవద్దని తమ తమ పార్టీల వారిని కోరుతారు ఆదేశం (విప్) జారీచేసినా దానిని పాటించ గలరని నమ్మకం లేదు. ఆదేశం జారీ చేశాక దాని ఉల్లంఘన కనుక జరిగితే క్రమ శిక్షణ చర్య తీసుకోవలసి ఉంటుంది. కనుక అంతకంటే కార్మికుల సమస్యలపై అసలు ఆదేశాలు జారీచేయడమే మానుకుని ఒక క్రొత్త సంప్రదాయాన్ని రిపబ్లికన్, డెమొక్రాటిక్ పార్టీలు రెండూ స్వీకరించాయి. అక్కడ ప్రతి ప్రతినిధికి తన ఇష్టాన్ననుసరించి వోటు చేసే అధికారం ఉంటుంది.

అందువల్ల 'కాంగ్రెస్' అని పిలువబడే వారి పార్లమెంట్‌లో కార్మికులకు సంబంధించిన అంశాలపై వోటింగ్ జరిగినప్పుడు విచిత్రమైన దృశ్యాలు కనబడతాయి. డెమొక్రాటిక్, రిపబ్లికన్ పార్టీలు రెండింటినుండి కూడా కార్మికులకు అనుకూలంగానూ, ప్రతికూలంగానూకూడా వోట్లు పడతాయి. రెండు పార్టీలవారు అనుకూల వర్గంలోనూ, ప్రతికూల వర్గంలోనూ కూడా కనబడతారు. ఎందుకంటే కార్మికుల శక్తిని చూసి రెండు పార్టీల ప్రతినిధులు ఆదేశం (విప్) జారీచేయవద్దని, చేసినా తాము శిరసావహించగలమన్న హామీ లేదని తమ నాయకులకు చెబుతారు.

కేవలం హిందుస్థాన్‌లో మాత్రమే కూపస్థమండూకాలలాగా 'రాజకీయ పార్టీల ప్రమేయం లేకుండా ప్రపంచంలో కార్మిక సంఘాలు ఎలా ఉంటాయి?' అని మన రాజకీయ నాయకులు భావిస్తూ ఉంటారు. వారికి అమెరికాలో అన్నిటికంటే శక్తివంతంగా జరిగిన కార్మిక ఆందోళనను అధ్యయనం చేయవలసి ఉంటుంది. అంతటి శక్తివంతంగా కావడానికి మనం కూడా ప్రయత్నం చేయాలి. అది సాధ్యం కాదు, జరగదు అని అనుకోవలసిన పనిలేదు.

ఎమ్.పి లు, ఎమ్.ఎల్.ఏ లు వెంటలేకపోతే మనకు ఏమై పోతుందో అని ఇక్కడ మనవారు భావిస్తూ ఉంటారు. ఇది మనం ఆలోచించవలసిన విషయం కాదు. నిజానికి కార్మికులు తమ వెంటలేకపోతే వచ్చే ఎన్నికలలో తాము ఏమౌతామని ఎం.పి లు, ఎమ్మెల్యేలు ఆలోచించుకోవాలి. ఎవరు ఎవరిపై ఆధారపడతారు? మీరు వారిపై ఆధారపడి ఉన్నారా? లేక వారే మీపై ఆధారపడి ఉన్నారా? ఇది కొద్దిగా ఆలోచిద్దాం. పేరు పెట్టి చెప్పడం నాకు ఇష్టంలేదు. అయితే ఇక్కడ కొందరు వ్యక్తులు కూర్చుని ఉన్నారు. మొదట భారతీయ మజ్దూర్ సంఘ్ మన కార్మిక విభాగం అని వ్రాయించుకుని వస్తే అప్పుడు మేం మీకు సహకరిస్తాం అని చెప్పి వారి మిత్రులు వారిని పంపించారు. ఇలా వ్రాసి ఇవ్వవలసిన అవసరం లేకుండానే కావాలంటే ఇతర పార్టీల నాయకులతో మాట్లాడి మనం మన పనులు చేయించుకోగలం. ఇక్కడ మన మిత్రులుగా భావించిన వారు మనలను లిఖిత పూర్వకంగా తీసుకురమ్మన్నారు. అందుకు మనం తిరస్కరించాం. అక్కడ వీరు మన శత్రువులు అని ఎవరినైతే మనం భావిస్తున్నామో ఆ పార్టీల వారు మన పనులు చేసిపెట్టారు. ఎందుకంటే నూటికి నూరు కాకపోయినా కనీసం 40 శాతం వీరి ఓట్లయితే మనకు లభిస్తాయనే ఆశ వారికి ఉంది. పెద్ద బిచ్చగాళ్ళ

వారు. మాకేమౌతుందనే బాధతో మీరు చస్తున్నారు. వారికి మీకంటే ఎక్కువ బాధ ఉంది. మీకు ఫ్లూ, మలేరియా లాంటి జబ్బులు ఉంటే వారికి టి బి, కేన్సర్ లాంటివి ఉన్నాయి. మీరు ఎందుకు అంతగా బాధపడుతున్నారు? నిజానికి మన సిద్ధాంతం ఏమిటి? మన జీవన విలువలు ఏమిటి? అన్న విషయాలు ఎక్కువ ఆలోచించాలి.

మన దేశంలో ఒక సాధువు ఉండేవారు. ఆయనను ఒకసారి అక్బర్ పాదుషా పిలిపించాడు. ఆ సాధువు నేను రానన్నాడు.

'ఆవత్ జాత్ పన్హైయా టూట్ బిసరి జాయ్ హరినామ్' - 'వచ్చి పోవడంలో నా చెప్పులు తెగిపోతాయి. భగవంతుని పేరు కూడా మరచిపోతాను.' నేను నీ దగ్గరకు రాను. కావాలంటే నువ్వే నా దగ్గరకు రా అంటూ అక్బర్ దగ్గరకు వెళ్ళలేదు. మనం మాత్రం 'పిచ్చివాళ్ళ' నామ జపం మాత్రమే చేస్తున్నాం కదూ ! సంత్ తుకారం ఉదాహరణ ఒకటి ఉంది. ఆయనను రాజు పిలిచాడు. రాజు శివాజీ పల్లకీని కూడా పంపాడు. అప్పుడు తుకారం 'నీ దగ్గరకు రావడం వల్ల మాకు వచ్చే లాభం ఏమిటి? వ్యర్థంగా వెళ్ళిన శ్రమ అవుతుంది. అట్లా శ్రమపడడం నాకు ఇష్టంలేదు'అన్నాడు. సికిందర్ సమయానికి సంబంధించిన మరొక ఉదాహరణ కూడా ఉంది. డైజెనిస్ అనే గొప్ప తత్వవేత్త ఉండేవాడు. ఆయన ఎప్పుడూ ఒక తొట్టెలో పడుకుని సూర్య స్నానం చేస్తుండేవాడు అతడి గురించి తెలుసుకున్న సికిందర్‌కు ఇంత గొప్ప తత్వవేత్త తన రాజ్యంలో ఉన్నాడు. ఇది తనకు గర్వకారణం కనుక అతడిని ఒక సారి తన ఆస్థానానికి పిలిపించాలి అనే ఆలోచన కలిగింది. రాజదూతలు అతడిని పిలువడానికి వెళ్ళారు. అయితే అతడు "నేను ఎప్పుడూ ఈ తొట్టెలో కూర్చుని సూర్య స్నానం చేస్తుంటాను. రాజదర్బారుకు రావడంవల్ల ఈ క్రమానికి భంగం కలుగుతుంది. కనుక నేను రాను" అని చెపాడు. విశ్వ విజేత సికిందర్‌కు ఇది విని మొదట కోపం వచ్చింది. కానీ మరల ఈ తత్వకర్తలంతా ఇలాగే పిచ్చి వాళ్ళు. పోనీ మనమే వెళ్ళి ఆయనను కలిసి వద్దాం అని అనుకున్నాడు, సికిందర్ స్వయంగా వస్తున్నాడన్న వార్త డైజెనిస్‌కు చేరింది. "రానివ్వండి. నేనెలా ఆపగలను ?" అన్నాడతడు. సికిందర్‌కు స్వాగతం పలుకడానికి కూడా అతడు ముందుకురాలేదు. చివరికి సికిందర్

ఉదయాన్నే అతడుండే చోటికి చేరుకున్నాడు. అప్పుడే ఉదయభానుడు పైకి లేస్తున్నాడు. సూర్యుడి కిరణాలు అక్కడ ప్రసరిస్తున్నాయి. 'బాద్షా వస్తున్నారు బాద్షా వస్తున్నారు' అన్న కేకలు వినబడ్డాయి. అయినా అతడు లేవలేదు. అలాగే విశ్రాంతిగా కూర్చుని ఉన్నాడు. బాద్షావైపు చూడనైనా లేదు. విశ్వవిజేత వస్తే అతడికేసి చూడనైనా చూడలేదే అని చుట్టూ చేరిన ప్రజలు నివ్వెరపోయారు. "అయ్యా! నేను వచ్చాను. నేను అలెగ్జాండర్‌ను" అన్నాడు బాద్షా. అతడు మాట్లాడలేదు. కేవలం 'ఊ' అన్నట్లు తల ఆడించాడు. అటు చూడనైనా లేదు. చిరునవ్వు కూడా నవ్వలేదు. "మీలాంటి ప్రపంచంలో మేటి అయిన తాత్వికుడు నా రాజ్యంలో ఉన్నందుకు నాకు చాలా గర్వంగా ఉంది" అన్నాడు సికిందర్. అప్పటికీ అతడు మాట్లాడలేదు. బాద్షా మాట్లాడుతూనే ఉన్నాడు. అతడు మాత్రం మౌనంగా కూర్చున్నాడు. ఒక్కవ్యక్తే ఎంతసేపు మాట్లాడుతాడు. చివరకు సికిందర్ "మీరంటే నాకు ఎంతో గౌరవం ఉంది. ప్రపంచంలో నేను తెచ్చిఇవ్వలేని వస్తువు ఏదీలేదు. ప్రపంచంలో ఏ వస్తువైనా మీరు కోరండి. నేను తెచ్చి ఇస్తాను" అన్నాడు అప్పుడు డైజెనిస్" సికిందర్‌వైపు చూసి చిరునవ్వు నవ్వాడు. "నేను ఏదికోరితే అది ఇవ్వగలరా" అన్నాడు. "ఓ! ఇస్తాను" అన్నాడు సికిందర్. అప్పుడు డైజెనిస్ "మీ నీడ నా శరీరం మీద పడుతోందన్న విషయం మీరు గమనించినట్లు లేరు. దానివల్ల నా సూర్యస్నానానికి అంతరాయం కలుగుతోంది. సూర్యకిరణాలు నేరుగా నా శరీరం మీద పడేందుకు వీలుగా మీరు కాస్త పక్కకు జరిగితేచాలు" అన్నాడు. ఒక ప్రక్క ప్రపంచమంతటినీ జయించిన వ్యక్తి నీకేం కావాలో కోరుకోమంటున్నాడు. ఈయన మాత్రం సూర్య కిరణాలు నేరుగా నా శరీరం మీద పడాలి. కాస్త పక్కకు జరగమంటున్నాడు.

మరొక ఉదాహరణ ఉంది. బానిసత్వంలో మగ్గుతున్న ఒక దేశపు ప్రజలను ఎవరో తన శక్తిని, చెమటను ధారవోసి జాగృతులను, సంఘటితులను చేశాడు. అతడిని 'జాతిపిత'గా భావించసాగారు. చివరికి సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ప్రత్యక్ష యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు ప్రత్యక్ష యుద్ధంలో సేనాపతిత్వం తాను నెరవేర్చలేడని భావించి అతడు మరొక యోగ్యుడైన సేనాపతికి నాయకత్వాన్ని అప్పగించి తాను స్వయంగా సైనికుని దుస్తులు ధరించి అతడి ముందు నిలబడ్డాడు. వీరిరువురు ఇటలీకి చెందిన జోసఫ్ మాజినీ, గారిబాల్డీ అని తెలిసే ఉంటుంది.

జార్జ్ వాషింగ్టన్ గురించి కూడా ఒక ఉదాహరణ ఉంది. వాషింగ్టన్ అమెరికన్ స్వాతంత్ర్య యోధుడు. యుద్ధ సమయంలో కొందరు వ్యక్తులు అతడిని వ్యతిరేకించారు. కానీ యుద్ధం పూర్తయిన తరువాత వాషింగ్టన్ ఏకైకనేతగా రూపొందాడు. ఆ సమయంలో అతడికి ప్రత్యర్థులే లేరు. ఆయన గనుక తనను రాష్ట్రపతిగా ప్రకటించుకుంటే అడ్డుచెప్పేవారు కూడా ఎవరూ లేరు. కానీ ఆయన అలా చేయలేదు. ఎన్నికలు జరిపించాడు. ఎన్నికలలో గెలిచి అమెరికాకు మొదటి రాష్ట్రపతి అయ్యాడు. ఇది యోగ్యమైనదే. అయితే ఒక విషయం గమనించాలి. అమెరికాకు యుద్ధపు ఆఖరి దినాలలో ఈర్ష్యాగ్రస్తులైన ఆయన ప్రత్యర్థులు కొందరు యుద్ధ ప్రయత్నాలను వెన్నుపోటు పొడిచే ప్రయత్నం చేశారు. వెన్నుపోటు విషయం తెలిసి అతని మద్దతుదారులైన సైనికులు ఆగ్రహం చెందారు. "విజయం మనకు లభించి తీరుతుందని శత్రువులకు తెలుసు. అందుకే మీ ప్రాబల్యాన్ని తగ్గించడం కోసం యుద్ధ ప్రయత్నాలకు ఆటంకాలు కల్పించే ప్రయత్నం చేస్తున్నారు మీరు ప్రధాన సైన్యాధిపతి. ప్రస్తుత తరుణంలో సైన్యమే సర్వశక్తి కేంద్రం. మేము మీ క్రింది అధికారులం. మేము మిమ్మల్ని ఈ దేశానికి నాయకులుగా ప్రకటిస్తాం" అని వారు అన్నారు. కానీ వాషింగ్టన్ మాత్రం- 'లేదు. ఇది నాకు అంగీకార యోగ్యంకాదు' అని అన్నాడు. యుద్ధం ముగిసిన అనంతరం ఆయన రాజ్యాంగ నిర్మాణం కోసం ఒక సమితిని ఏర్పరిచాడు. రాజ్యాంగానికి లోబడి జరిగిన ఎన్నికల ద్వారా ప్రజామోదం పొంది అమెరికాకు ఎన్నికయిన మొదటి రాష్ట్రపతి అయ్యాడు.

ప్రశ్న : జాయింట్ కన్సల్టేటివ్ మెషీనరీలో ప్రవేశం విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?

**సమాధానము :** జాయింట్ కన్సల్టేటివ్ మెషీనరీ నిర్మాణం జరిగిన సమయంలో దానిలో భాగస్వాములు అయిన కొందరు వ్యక్తులతో మనవారు చర్చించారు. మీరు ఈ మెషినరీలో ఎందుకు చేరుతున్నారు? అని వారిని అడిగాం. దీనివలన ప్రయోజనం ఏమీ ఉండదు. 1960 జూలై ప్రజాందోళన తరువాత శ్రీ గుల్జారీలాల్ నందా నుండి కేంద్ర ప్రభుత్వోద్యోగుల నుండి సమ్మె హక్కును హరిస్తున్నట్లు, దానికి బదులుగా జాయింట్ కన్సల్టేటివ్ మెషినరీ ఏర్పరుస్తున్నట్లు ప్రకటన వెలువడింది. అప్పటికే కేంద్ర ప్రభుత్వ రంగాలలో మనకు ఒక్క

యూనియన్ కూడా లేదు. భారతీయ మజ్దూర్ సంఘ్ చాలా చిన్నదిగా ఉంది. అయినప్పటికీ ఆందోళన చేసే హక్కును హరించడం ప్రజాస్వామ్య వ్యతిరేకం అవుతుంది అనే మన అభిప్రాయాన్ని మనం స్పష్టంగా ప్రకటించాం. మనం జాతీయవాదులం. అందువల్ల ఉత్పత్తిలో తరుగుదల గానీ, ప్రజా జీవనానికి ఆటంకం కలుగడం గానీ మనం సహించం. అయితే పనిచేసే అధికారాన్ని ఏ విధంగా జన్మ హక్కుగా మనం భావిస్తామో. అదేవిధంగా సమ్మె చేసే అధికారం కూడా జన్మ హక్కుగా మనం భావిస్తాం. ఏ అధికారము కూడా సర్వసంపూర్ణం (Absolute) కాదు అన్నది వాస్తవమే. ఏ విధంగా మౌలిక హక్కులపైన నియంత్రణ ఉంటుంటో ఆ విధంగానే దీని పైన కూడా ఉంటుందని మనకు తెలుసు. అయితే ఈ హక్కును పూర్తిగా హరించివేయడం ప్రజాస్వామ్యానికి, కార్మికులకు కూడా వ్యతిరేకం అవుతుంది. సమ్మె చేసే హక్కును హరించే బదులు అసలు సమ్మె చేసే అవసరమే కార్మికులకు కలుగకుండా ఉండేటట్లు ప్రభుత్వం వ్యవస్థ చేయగలిగితే దేశప్రయోజనాలు మరింత కాపాడబడతాయి. "సమ్మె ఆఖరి ఆయుధం" అన్నది ఆ రోజులలో మన నినాదంగా ఉండేది. ఈ భూమికను ఆ రోజులలోనే మనం స్పష్టం చేశాం. జాయింట్ కన్సల్టేటివ్ మెషినరీ ఏర్పడి నప్పుడు ఆనాటి నాయకులందరిలోనూ ఆ మెషినరీలో చేరాలని కోరిక ప్రబలంగా ఉండేది. ఈ మెషినరీ ఏర్పాటువలన కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు సంబంధించిన ఏ అఖిల భారతీయ సమస్యలు కూడా పూరింపబడవని ఆ రోజులలోనే దీని భవిష్యత్తుపై మనం అభిప్రాయం పడ్డాం.

ఈ మెషినరీ నిర్మాణం ద్వారా దేశ విదేశాలలో భారత ప్రభుత్వం గొప్ప ప్రగతిశీల ప్రభుత్వంగా ముద్రవేయించు కోవాలన్న తాపత్రయం ఒక్కటే ఆ సమయంలో భారత ప్రభుత్వపు మనస్సులో ఉంది. దానితోబాటు విదేశాలకు మేము కేంద్ర ప్రభుత్వోద్యోగులతో సలహా సంప్రదింపులు జరుపుతూనే వ్యవహారాలు నిర్వహిస్తున్నామని, మేం కూడా ప్రగతి శీలురమేనని చాటి చెప్పుకోవచ్చు. మరొక విషయం ఇటువంటి మెషీనరీలో చేరడం ద్వారా వీరందరిలోగల భావనా తీవ్రత నెమ్మదిగా తగ్గిపోరాదు. ఈ విషయం ఆనాడు మనం బైటకు చెప్పకపోయి నప్పటికీ మన మనస్సులో ఉంది. ఆ సమయంలో ఈ మాటలు మాట్లాడడం ఉచితం కాదు కూడా.

కన్సెల్టేటివ్ మెషీనరీలో ఎందుకు చేరుతున్నారని మనం ప్రశ్నించడం చాలా మందికి రుచించలేదు. ముఖ్యంగా దాదాఘోష్‌తో విస్తృతమైన చర్చకూడా జరిగింది. మీరు మెషీనరీలో చేరడానికి ఎందుకు వ్యతిరేకిస్తున్నారు? అని ఆయన ప్రశ్నించారు. ఈ మెషీనరీ కార్మికులకు ఎటువంటి ప్రయోజనాలను సమకూర్చ లేదని మనం ఆయనకు చెప్పాం. ఎందుకు సమకూర్చలేదని ఆయన ప్రశ్నించారు. ఇది విట్లేకౌన్సిల్ నమూనాలో ఉంది. బ్రిటన్‌లో విట్లేకౌన్సిల్ చాలా ప్రభావవంతంగా పనిచేసింది. బ్రిటన్‌లో విట్లేకౌన్సిల్ ప్రభావవంతంగా పనిచేసినప్పటికీ మన దేశంలో జె సి.ఎమ్. ప్రభావశాలి కాలేదని మేం చెప్పాం. దీనికి కారణం చెబుతూ జె.సి.ఎమ్ కు విట్లేకౌన్సిల్‌కు మధ్యగల ఒక అంతరాన్ని మేం పేర్కొన్నాం. రెంటింటి స్వరూపం ఒకటే అన్నది వాస్తవమే. అంటే ఉద్యోగుల స్థాయిలో, వివిధ శాఖల అధికారుల స్థాయిలో, కార్మికుల స్థాయిలో ప్రతినిధులు ఏకీకృతమై సలహాసంప్రదింపులు జరుపుతారు. ఇదే రెండింటిలోనూ సమానత. ఈ స్వరూప సమానతతోబాటు ఎప్పుడైనా అధికారులు కార్మికుల మధ్య అభిప్రాయ భేదాలు తలఎత్తినప్పుడు, వాటికి ఆ స్థాయిలో పరిష్కారం లభించనప్పుడు, సమస్యను పై స్థాయిలో విన్నవించుకోవడంలో కూడా రెండింటిలో సమానత ఉంది. కానీ వీటి తరువాత అసలు తేడా కనబడుతుంది. బ్రిటన్‌లోని విట్లేకౌన్సిల్ నియమాల ప్రకారం ఏదైనా ఒక వివాదం పై స్థాయికి నివేదింపబడిన తరువాత పై స్థాయిలో ఇవ్వబడే ఆదేశానికి అటు ప్రభుత్వంగానీ, ఇటు కార్మికులుగానీ తప్పక బద్ధులై ఉండాలి. అయితే విట్లేకౌన్సిల్ మాదిరిగా మన దగ్గిర పై స్థాయిలో నిర్ణయానికి బద్ధులై ఉండాలని లేదు. అందువల్ల పై స్థాయినుండి ఆదేశం ఎలా వచ్చినా దానిని ఆచరణలో పెట్టాలా, లేదా దానిలో ఏవైనా మార్పులు చేయాలా? లేక పూర్తిగా తిరస్కరించాలా? ఈ విషయాల గురించి ప్రభుత్వమే ఆలోచించ గలుగుతుంది. ఆ కారణంగానే విట్లేకౌన్సిల్ ఏ విధంగా పరిణామకారి, ప్రయోజనకారి అయిందో జె.సి.ఎమ్. ఆ విధంగా ప్రయోజనకారి కాబోదు.

కానీ ఆ సమయంలో మన పని చాలా బలహీనంగా ఉండేది. ఆ కారణాన మన మాటలు ఎవరూ వినలేదు. తమ ప్రతిష్ఠ, శక్తి ఆలోచించుకోకుండానే దానిలో చేరడానికి ప్రజలు ఎంతో ఆరాటపడుతుండేవారు. అందువల్ల జె.సి.ఎమ్.

మెషినరీ ప్రారంభించబడింది. మాకు ముందు నుండీ ఒక అనుమానం ఉండేది. అది నెమ్మదిగా నిజం కాసాగింది. మెషినరిలో ఒకసారి చేరిన తరువాత అక్కడ అధికారులు, ఇతర పెద్దలతో కలిసి చాయ్ వగైరా స్వీకరించడం ప్రారంభం కాగానే నెమ్మదిగా నాయకులు కార్మికులు, కార్యకర్తలనుండి దూరం అయ్యేవారు. దానితోనే తమ ప్రతిష్ఠ కలదని భావించేవారు. ఈ ప్రతిష్ఠను ఎలాగైనా కాపాడుకోవాలని ఆలోచిస్తూ ఉండేవారు. మొత్తం దేశానికి సంబంధించిన ఏ సమస్యకూడా జె. సి. ఎమ్. ద్వారా పరిష్కారం కాలేదు. జె. సి. ఎమ్. ద్వారా ఏదైనా ప్రముఖ నిర్ణయం జరిగిందా అంటే అప్పటివరకూ అలాంటిదేమీ లేదు. చివరికి బోనస్ వగైరాల విషయంలో కూడా జె. సి. ఎమ్. ద్వారా ప్రకటన వెలువడ లేదు. మొత్తం చర్చలన్నీ జె. సి. ఎమ్. కు వెలుపలనే జరిగాయి. ఈ కారణాన జె. సి. ఎమ్. లో భాగస్వాములైన వ్యక్తులు కూడా అనేక ప్రముఖ సమస్యల పరిష్కారం కోసం సామూహిక ఆందోళనలకు దిగవలసి వచ్చింది. 1960 సెప్టెంబర్‌లో కేంద్రప్రభుత్వోద్యోగుల యూనియన్లన్నీ సమ్మెకుదిగాయి. 1974 మేలో జె. సి. ఎమ్‌లో భాగస్వాములైన రైల్వే యూనియన్లన్నీ కూడా సమ్మెకు దిగవలసి వచ్చింది. దీనికి కారణం జె. సి. ఎమ్. సంపూర్ణంగా క్రియాశీలం కాకపోవడమే. మనం జె. సి. ఎమ్. ను ప్రత్యేకత కలిగినదానిగా గుర్తించం. అయితే జె సి. ఎమ్. లో మనం చేరినందువల్ల మనకు ఏ విధమైన ప్రయోజనం ఉండదని తెలుసు. కానీ నేడు దానిలో భాగస్వాములుగా ఉన్నవ్యక్తులు కార్మికుల ఎడల ప్రదర్శిస్తున్న విశ్వాసఘాతక వైఖరిని మాత్రం మనం నిరోధించగలుగుతాం. అన్ని ఉదాహరణలు మీముందు ఉంచాలని నేను అనుకోవడంలేదు. కానీ మిషనరీలో చేరిన వ్యక్తులు కొందరు కార్మికులకు ద్రోహం చేస్తున్నారన్నది మాత్రం పచ్చి వాస్తవం. తాత్కాలిక భృతి, ఇంకా ఇతర అంశాలలో వారి ఈ వైఖరి స్పష్టమైంది. కనుక ఒకవేళ దానిలో చేరవలసివచ్చినా ఏదో ఘనకార్యం చేయగలమన్న ఉద్దేశంతో మనం చేరం. వాళ్ళు ఏమీ చేయలేరు మనమూ చేయలేం. అయితే దానిలో ఉన్న కొందరు అయ్యా మేం జె. సి. ఎమ్. లో ఉన్నాం. మీళ్ళు లేరు. అని గిరాలు పలుకుతూ వుంటే మనలో కొందరికి ఏదో మహత్కార్యానికి మనం దూరమైపోతున్నామనే భ్రమ కలుగకుండా, వారి అహంకారాన్ని త్రుంచడం కోసం అది సహాయపడగలదన్నది ఒక అంశం అయితే ఇది పెద్ద గొప్ప విషయం ఏమీకాదు. గొప్పవిషయం ఏమిటంటే మెషినరీలో భాగస్వామ్యం పొందడం ద్వారా మన ఉపస్థితివలన అక్కడ కార్మికులకు ద్రోహంచేస్తున్న వ్యక్తుల,నాయకుల ఆటలు

కట్టించగలుగుతాం. కార్మికుల ప్రయోజనాలకు భద్రత చేకూర్చగలుగుతాం. ఈ దృష్టిలో దానిలో మనం ఉండడం చాలా అవశ్యకమైన విషయం. అన్నీ కాల క్రమేణా సర్దుకుపోతాయి. బాధపడవలసిన అవసరంలేదు. అయితే ఒక్క విషయం మీరు మాత్రం ఇప్పటి నుండి మేం కూడా జె. సి. ఎమ్. లో చేరుతాం అప్పుడు మా పరాక్రమాన్ని ప్రదర్శించి ఇదిచేస్తాం అదిచేస్తాం అని చెప్పడం ప్రారంభిస్తే మీరే ఇబ్బంది పడతారు ఎందుకంటే అక్కడ మనకుకూడా మన పరాక్రమాన్ని ప్రదర్శించుకునే అవకాశం ఉండదు కనుక. కనుక మీరు స్పష్టంగా పైవిషయాన్నే చెప్పండి. దానివిషయంలో ఎక్కువ ప్రాముఖ్యత నివ్వకండి జె. సి. ఎమ్ నిరుప యోగమైనదని మాత్రమే ప్రజలకు చెప్పండి. అయితే మనం అందులోకి వెళ్ళడం వలన నేడు నాయకులు కార్మికుల ఎడల ప్రదర్శిస్తున్న విశ్వాస ఘాతుకత్వాన్ని మాత్రం మనం నివారించగలుగుతాం, కాపలా కుక్కలా పని చేయగలం (Watch Dog) అంతవరకే చెప్పండి. అంతకు మించి అప్పుడే చెప్పవద్దు. ఎందుకంటే జె.సి.ఎమ్. ద్వారా ఎటువంటి ప్రయోజనకరమైన పని జరగదు.

ప్రశ్న : 1984 సెప్టెంబర్ 26 నాడు సమ్మెను నిలిపివేసి మనం మన సంస్థకు, కార్మిక వర్గానికి సాధించిన ప్రయోజనం ఏమిటి? దీనికి సంబంధించినదే మరొక ప్రశ్న. ప్రభుత్వం మనను కేవలం సంభాషణల కోసం పిలిచింది. అంత మాత్రానికే సంతోషపడి మనం సమ్మె విరమించాం. పత్రాలు సమర్పించి కూడా సంభాషణలు సాగించవచ్చు కదా! అటువంటప్పుడు అసలు సమ్మె చేయడానికి పిలుపు నివ్వడం ఎంతవరకు ఉచితం?

ప్రశ్న : 26-9-1984 సమ్మె సందర్భంగా లిఖిత పూర్వక పత్రాలు ఏమీ లేకుండానే కేవలం సంభాషణలతోనే సమ్మె విరమించడం వల్ల మనకు ఇతర సంస్థలకు తేడా ఏమున్నట్లు?

సమాధానం : సెప్టెంబర్ 26 నాటి సమ్మెకు సంబంధించిన అందరు వ్యక్తులకు సూచనా పత్రాలు పంపించడం జరిగింది. వాటిలో సూచన ఇచ్చాం. సూచనలు పంపబడిన వాటిలో ఫెడరేషన్లు, డిఫెన్స్, రైల్వేస్, పి అండ్ టి, ఇంకా కాన్ఫెడరేషన్‌లో భాగస్వాములైన అనేక ఇతర చిన్న, పెద్ద యూనియన్లను కూడా ఆహ్వానించాం. ఢిల్లీలోని కేంద్ర ప్రభుత్వ సచివాలయం కూడా వీటిలో

ఒకటి. ఈ నాలుగు కాన్ఫెడరేషన్‌ల సమావేశం జరిగింది. పరిస్థితిని ఆలోచించాం. బాగా ఆలోచించిన మీదట సెప్టెంబర్ 26 వ తేదీన కొన్ని కోర్కెల సాధనకై సంకేత సమ్మె చేయాలని (Token Strike) నిర్ణయం జరిగింది. సమ్మె ప్రకటన కూడా వెలువడింది. ఆ తరువాత మన కార్యకర్తలు, అధికారుల కదలికలు కూడా వేగం పుంజుకున్నాయి. చాలా కష్టపడ్డాం. ఇంతకు ముందెన్నడూ ఈ యూనియన్లు ఇంత విస్తృతంగా పరిశ్రమించడం ఎన్నడూ జరుగలేదు. ఎక్కడెక్కడ కార్యక్రమాలు జరిగాయో అవన్నీకూడా చాలా బాగా జరిగాయి. ఎలాగైతే మనం సమ్మె ప్రకటించామో అలాగే మిగిలిన ఫెడరేషన్లకు కూడా ఆలోచించక తప్పలేదు. ఆ తరువాత ఆలిండియా రైల్వేమెన్స్ ఫెడరేషన్ కూడా విడిగా సెప్టెంబర్ 28 వ తేదీనుండి నిరవధిక సమ్మెకు దిగుతున్నట్లు ప్రకటించింది. డిఫెన్స్‌లో ఉన్న కమ్యూనిస్ట్ యూనియన్ కూడా 28 వ తేదీ సంకేత సమ్మె (Token Strike) ప్రకటించింది. పి అండ్ టి నాయకులు మనతో ఒక అవగాహనకు రావాలంటూ మన పి అండ్ టి కార్యాలయం చుట్టూ తిరగసాగారు. ఎందుకంటే మన ప్రకటన తరువాత వివిధ రంగాలలో ఎంతో సంచలనం రేగింది. ఒకవైపు మన ఉద్యమంలో కూడా సంఖ్య బాగా పెరిగింది. ఇది సమయోచితము, ఆవశ్యము అయిన అంశం కనుక ఇతర యూనియన్ల సభ్యులపైన కూడా దీని ప్రభావం పడింది. దీనివలన సెప్టెంబర్ 24 నాడు జరిగిన మన కార్యక్రమంలోనూ, ధర్నాలోనూ ఇతర యూనియన్ల సభ్యులు కూడా వచ్చి చేరారు. అనేక చోట్ల 'మీతో సమ్మెలో పాల్గొంటామో లేమో చెప్పలేం. కానీ సెప్టెంబరు 24 కార్యక్రమంలోను, ధర్నాలోనూ మాత్రం తప్పక మీతో ఉంటాం.' అనే అనేక మంది ఆనాడు మనతో చెప్పారు. ఉన్నారు కూడాను.

ఈ అన్ని విషయాలు స్పష్టంగా ప్రభుత్వానికి అందసాగాయి. ఆ కారణంగానే 20 వ తేదీన కార్మిక మంత్రిత్వ శాఖ జోక్యం చేసుకుని నచ్చజెప్పే ప్రయత్నం చేసింది. మన వద్ద నుండి వెళ్ళిన నోటీసులన్నీ కేంద్ర ప్రధాన కార్మిక శాఖ కమీషనర్‌కు చేరవలసి ఉంది. కానీ చాలా నోటీసులు అక్కడకు చేరలేదు. రైల్వేవారు తమ నోటీస్‌ను ప్రాంతీయ లేబర్ కమీషనర్‌కు పంపించారు. ఏ నోటీసు ఎవరి వద్దకు వెళితే వారు మధ్యవర్తిత్వం చేయగలుగుతారు. ఆ విధంగానే పశ్చిమ రైల్వే లాంటి కొన్ని ప్రాంతాల లేబర్ కమీషనర్లు రైల్వేల

విషయంలో మధ్యవర్తిత్వం నెరపడం ప్రారంభించారు. డిఫెన్స్ వారు కూడ తమ అన్ని నోటీసులను చీఫ్ లేబర్ కమీషనర్‌కు పంపించలేదు. పి అండ్ టి చీఫ్ లేబర్ కమీషనర్‌కు పంపించింది. కార్మిక మంత్రిత్వ శాఖ అన్ని విషయాలను రహస్యంగా సేకరిస్తోంది. 'పి అండ్ టి అయినా, కాన్ఫెడరేషన్ అయినా, డిఫెన్స్ అయినా, రైల్వే అయినా మీ అందరి కోరికలు ఒకటే కదా! కనుక నియమానుసారం ఎవరి నోటీస్ మా వద్దకు వచ్చిందో దాని విషయంలో పరిష్కారం మేం ప్రారంభిస్తాం. అందరి కోరికలు సమానమే అయినందువల్ల వారికి ఏ ప్రయోజనాలు లభించాయో అవి అందరికీ వర్తింప జేయవచ్చు' అని వారు మనతో చెబుతూ ఉండేవారు.

సెప్టెంబర్ 22 నాడు ఈ జోక్యం, పరిష్కార యత్నాలు ప్రారంభం అయ్యాయి. మన పతేలాజీ, సుందరదాస్‌జీ వాటికి వెళ్ళారు. అటునుండి కూడా ఇద్దరూ బాధ్యత గలిగిన డైరెక్టర్లు వచ్చారు అన్ని విషయాలపైన నిర్ణయాలు చేయడం మూడు రోజులలో ఏ రకంగా చూసినా అసాధ్యం కనుక సంకేత సమ్మె ప్రతిపాదన విరమించుకోవలసింది' అని వారు విజ్ఞప్తి చేశారు. 'సెప్టెంబర్ 26 నాడు తలపెట్టిన సంకేతసమ్మె (Token strike) ను విరమించు కోవలసిందిగా మీకు విజ్ఞప్తి చేస్తున్నాం' అని మంత్రిత్వశాఖకూడా లిఖితపూర్వకంగా కోరింది. ఈ విజ్ఞప్తిని పరిశీలించడం కోసం ఆ తరువాత మనవారు కలిశారు. పరిశీలన కోసం కూర్చునే సమయానికి దీనిలో ఎటువంటి ఇబ్బందులు రావచ్చునన్న విషయంలో ఒక అంచనా తయారయింది.

అంతకు ముందు కూడా కొన్ని సంఘటనలు జరిగాయి. అనేక చోట్ల బోనస్‌ను ప్రకటించారు. అది ఉత్పత్తిపై బోనస్ అయినందువల్ల తగిన మొత్తంలో ఇవ్వలేదన్న ఆరోపణ ఉన్నప్పటికీ రైల్వే, పి. అండ్ టి. ఇతరులు, అందరికీ బోనస్ ప్రకటించారన్నది వాస్తవం. మన బి.పి.డి.ఇ.ఎఫ్, ఉత్తర ప్రత్యుత్తరాల కారణంగానే ప్రభుత్వం ఇ. డి. ఉద్యోగుల తాత్కాలిక భృతి, డి. ఎ. మొదలైన విషయాలపై ఒక ఏక సదస్య విచారణ సంఘాన్ని నియమించడానికి హామీ ఇవ్వడం జరిగింది. ఇ. డి. ఉద్యోగులు చాలా పెద్ద సంఖ్యలో ఉన్నారని మనకు తెలుసు.

ఇలాంటి పరిస్థితులలో కార్మిక శాఖనుండి విజ్ఞప్తి అందినపుడు దానిపై తప్పక ఆలోచించవలసి వచ్చింది. మన కేంద్ర ప్రభుత్వోద్యోగుల కార్యకర్తల 'విజ్ఞప్తి' యొక్క అర్థం ఏమిటో తెలుసుకోలేదనుకుంటాను. 1947 ఆగస్ట్ 15 నుండి నేటివరకు వామ పక్షాల ఆధ్వర్యంలో జరిగిన ఏ సమ్మెలోనూ కార్మిక మంత్రిత్వశాఖ జోక్యం, పరిష్కార యత్నాలు చేయనే లేదు. అందువలన ఈ పరిష్కార యత్నం వ్యవహారం అందరికి అర్థంకాదు. నిజానికి జూలై 1960 లో జరిగిన సమ్మెలో ఫిరోజ్‌గాంధీ తదితరులు ప్రయత్నం చేసినప్పటికీ కార్మికశాఖ జోక్యం కల్గించుకోలేదు. 1967 లో ఎలాగైనా మధ్యవర్తిత్వం నెరపాలని కొందరు ప్రయత్నం చేశారు. అయితే ఆ ప్రయత్నాలు సాగుతుండగానే వేరొక ప్రక్క అరెస్టులు కూడా జరిగాయి. అప్పుడు కూడా కార్మికశాఖ జోక్యం, పరిష్కార యత్నాలకు ముందుకు రాలేదు. 1974 మే 6 నాటి రైల్వే సమ్మె సమయంలో కూడా మనం దానిలో భాగస్వాములుగా ఉన్నప్పటికీ, చర్చలు జరుగుతున్నట్లు మంత్రిత్వశాఖకు తెలిసి కూడా జోక్యానికి, పరిష్కారానికి వారు ముందుకు రాలేదు. జరుగుతున్న సంభాషణలు కూడా అధికారికమైనవిగా ప్రభుత్వం గుర్తించలేదు. చర్చలు అనౌపచారికమని (Informal) వాటికి రికార్డు ఉండదని వారు చెప్పారు. ఆ సంభాషణల మధ్యలోనే చర్చల్లో పాల్గొంటున్న నాయకులందరినీ ప్రభుత్వం అరెస్టు చేయించింది. ఆ చర్చలకు వారు ఇచ్చిన విలువ అంతే. చర్చలు అధికారికంకావని, అనధికారికమని వారు ప్రకటించారు. ఒక రకంగా ఆ సమ్మె ముందే మొదలయి పోయింది. ఈ సంఘటనలన్నీ మనం దృష్టిలో ఉంచుకోవడం చాలా అవసరం.

భారతీయ మజ్దూర్ సంఘ్‌కు చెందిన కేంద్రీయ ఉద్యోగాల ఫెడరేషన్ ఒకటిగా నిలచి సమ్మెకు పిలుపు నివ్వడం, కార్మికశాఖ దానిలో జోక్యం చేసుకుని, పరిష్కారం సాధించడానికి ముందుకు వచ్చి మనకు ఒక ప్రత్యేకతను, ప్రతిష్ఠను కల్పించడం ఇది మొట్టమొదటి సందర్భం. దీనికి మరొక ప్రత్యేకత కూడా ఉంది. మీలో ఎంతమందికి ఈ విషయం తెలుసో నాకు తెలియదు. కేంద్ర ప్రభుత్వోద్యోగులలో వామపక్షాల వారు ఇన్ని సంవత్సరాలుగా పనిచేస్తున్నారు. ఆ క్షేత్రంలో సి.పి.ఐ, సి.పి.ఎమ్. సోషలిస్టులు పని చాలా పాతకాలం నాటినుండి జరుగుతోంది. ఆశ్చర్యకర విషయం ఏమిటంటే వారెవరికీ ఇలాంటి ప్రతిష్ఠ

ఎన్నడూ లభించలేదు. 'వేరువేరు పరిశ్రమలకు సంబంధించిన అనుభవం మాకు ఉంది గానీ ఇలా సమగ్రమైన (Comprehensive), సామూహికమైన (Collective) దృశ్యం మొదటిసారిగా సెప్టెంబర్ 26 కారణంగానే చూస్తున్నాం అని మన కమ్యూనిస్టు మిత్రులు కూడా కొందరన్నారు. పి అండ్ టి, రైల్వే, డిఫెన్సు మొదలైన వివిధ కేంద్ర ప్రభుత్వ రంగాలలో అనుబంధ యూనియన్లు కలిగిన ఏకైక జాతీయ కార్మికోద్యమం భారతీయ మజ్దూర్ సంఘ్ అని స్పష్టంగా మేం తెలుసుకున్నాం అని కూడా వారు అన్నారు.

కేంద్ర ప్రభుత్వ రంగాలలో ఇన్ని అనుబంధ యూనియన్లు (Affliated Federations) ఏటక్ (AITUC)కి గానీ, సీటూ (CITU)కి గానీ, హింద్ మజ్దూర్ సభకు గానీ లేవు. ఇదొక విశేషం. అయితే ఇది ఎవరి దృష్టికి వచ్చేది కాదు. అలాంటిది ప్రభుత్వం దృష్టిలోకి వచ్చింది. కమ్యూనిస్టులు, సోషలిస్టుల దృష్టిలోకి వచ్చింది. కేంద్ర ప్రభుత్వోద్యోగుల దృష్టిలోకి వచ్చింది. కేంద్ర ప్రభుత్వ రంగంలో అందరికంటే ఎక్కువ అనుబంధ యూనియన్లు భారతీయ మజ్దూర్ సంఘ్‌కు మాత్రమే ఉన్నాయి గనుక ఈ విషయానికి తగిన ప్రతిపత్తిని ఇవ్వాలి అన్నది కేంద్ర జోక్యం యొక్క అర్థంకావచ్చు. మన కోరికలు కేంద్ర జోక్యంతోనే పరిష్కారమైపోతాయని మనం భావించలేదు. అయితే మా ముందు ఉన్న సంశయమల్లా మొదటిసారిగా ప్రభుత్వం ఈ పరంపర ప్రారంభించింది. మనకు ఉచిత గౌరవాన్ని కల్పించింది. దానివల్ల ప్రజల హృదయాలలో, కార్మికుల హృదయాలలో, ప్రభుత్వాధికారుల హృదయాలలో, కమ్యూనిస్టు, సోషలిస్టుల హృదయాలలో కేంద్ర ప్రభుత్వోద్యోగులలో విస్తృతమైన సంఘటన కలిగిన సంస్థ భారతీయ మజ్దూర్ సంఘ్ మాత్రమే అనే విషయం సర్వవ్యాప్తమై బలంగా ముద్రపడింది.

ఇక్కడ మరొక విషయం కూడా గుర్తించాలి. విజ్ఞప్తిని ఖాతరుచేయకుండా చివరివరకు ఎందుకు పోరాడకూడదని ఇక్కడ కొందరు ప్రశ్నించారు. కానీ పరిష్కార యత్నాలు ప్రారంభం అయిన తరువాత సమ్మె చేయడం నియమోల్లంఘనం కాగలదన్న విషయం వారికి తెలియకపోవచ్చు. ఇది పెద్ద విశేషాంశం కాదనుకోండి. ఎందుకంటే ఒకవేళ మనం సమ్మె చేయాలన్నదే నిశ్చయించుకుంటే నియమోల్లంఘన - నియమపాలన అనే ప్రశ్నే తలఎత్తదు. మన శక్తినిబట్టి ఏది

పద్ధతికాదో అదే పద్ధతిగా చేయవచ్చు. అయితే ఎవరితో మనకు పోటీ ఉందో ఆ కమ్యూనిస్టులు, సోషలిస్టులకంటే సాంకేతికంగా, యోజనాబద్ధంగా ముందుకు పోగలగాలి (Technical and Stratagic Advantage) కేంద్ర కార్మికశాఖ జోక్యంతో మనం ఆ విధంగా వారికంటే ఎక్కువ పాయింట్లు సంపాదించగలిగాం.

మధ్యవర్తిత్వానికి ముందు మధ్యవర్తిత్వం నెరపగోరేవారు ఈ విషయంలో మీరు కొంత ఆలోచన చేస్తారా? లేకుంటే మా ప్రతిష్ఠ మంటగలిసిపోతుంది అని మనతో అన్నారు. మనం కూడా బాగా ఆలోచించిన మీదట మీరు మధ్యవర్తిత్వం కావాలంటే చేయవచ్చు కానీ మీరు చెప్పే విషయాలు అంగీకరించాలా? వద్దా? అన్నది మాత్రం మా ఫెడరేషన్‌కు చెందిన వ్యక్తులపై ఆధారపడి ఉంటుంది అని చెప్పాం. ఆ సమయానికి ఏవైనా అంశాలు తలఎత్తినట్లయితే చర్చించడానికి వీలుగా 20 వ తేదీన డిఫెన్స్, పి అండ్ టి, రైల్వేలకు చెందిన ప్రముఖ కార్యకర్తలందరికీ కలిపి ఒక సమావేశం ఏర్పాటు చేశాం.

మధ్యవర్తిత్వం అనే విషయం వచ్చినపుడు దానివలన భారతీయ మజ్దూర్ సంఘ్‌కు లాభం కలగాలని, భారతీయ మజ్దూర్ సంఘ్‌కు నాయకత్వం లభిస్తేనే ముందు ముందు కార్మికులకు మేలు జరుగగలదని ఆలోచించడం జరిగింది. ఎందుకంటే మనపని మన సిద్ధాంతాలకు అనుగుణంగానే ఉంటుంది. ఇక మనమార్గం మరింత సుగమం చేసేపని కార్మిక మంత్రిత్వశాఖ యొక్క మధ్యవర్తిత్వమే చేసిపెట్టింది. కేంద్ర ప్రభుత్వ రంగంలో మన ఘనత మరింత పెరిగింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు కూడా మన శక్తిని గుర్తించసాగారు. ఇది మరింత గొప్ప విషయం.

నాగపూర్‌లో జరిగిన సమావేశాల సందర్భంలో ఎట్టి పరిస్థితులలోనూ మనం సమ్మెను ఉపసంహరించుకోబోమని అనుకున్న మాట వాస్తవమే. కానీ మొత్తం మీద పరిస్థితులలో ఒక అనుకూలమైన మార్పు నిర్మాణం అయిన కారణంగా ఈ నిర్ణయం తీసుకోవలసివచ్చింది. కార్మిక మంత్రిత్వ శాఖకు ఈ విషయం ఫోన్ చేయవలసివచ్చినపుడు సమ్మె నిలుపు చేస్తున్నామన్న పద ప్రయోగంకాక, సమ్మెకొనసాగించి విరమిస్తున్నట్లుగా ప్రకటించాలని నిర్ణయించాం. అయితే ఈ ప్రకటన జరిగితే చాలమంది మన కార్యకర్తలకు ఆగ్రహం కలుగు

తుందని అప్పుడే అక్కడ ఉన్నటువంటి అనేక మంది మన పెద్దలతో నేను చెప్పాను. చర్చలతో అక్కడి వాతావరణంకూడా ఉద్రిక్తంగా తయారయింది. అయితే ఏదైనా ఒక విషయం ఆలోచించేటప్పుడు ఉద్యోగులు, కార్మికులు, దేనివలన సంస్థకు అత్యధికంగా ప్రయోజనం కలుగుతుంది..... మొదలైన అన్ని విషయాలు ఆలోచించవలసి ఉంటుంది. కార్మిక శాఖకు సూచన తెల్పేముందు పేరు పేరున కొందరు ప్రముఖ కార్యకర్తలను పేర్కొని వారు కోపంగా ఉన్నారని నేను చెప్పాను. ఈ విషయాలు మీ అధికారుల ద్వారా మీరు తెలుసుకోవచ్చు. మన నాయకత్వం ఆకాశంలో ఎగిరే నాయకత్వంకాదు. మనం తరచు కలుసుకోలేక పోయినప్పటికీ ఎక్కడ ఏమి జరుగుతుందో, ఎవరు ఏమనుకుంటున్నారో ? మొదలైన విషయాలు మేం తెలుసుకుంటూనే ఉంటాం. అందుకే ఈ క్షేత్రంలో మీకు కొంతకష్టం తప్పదు. అయితే దీనిద్వార చాలా ప్రయోజనంకూడా ఉంటుం దని నేను చెప్పాను. ఈ సంభాషణల ద్వారా ఏమౌతుంది?, మన కోరికలు ఎంత వరకు నెరవేరుతాయి అనేంతవరకే కాదు. మరింత ప్రముఖమైన విషయం కూడా ఇందులో ఉంది. ఇప్పుడు ప్రభుత్వపు మనస్థితి వేరేవిధంగా ఉంది. ఎక్కడ మనం బలహీనంగా ఉన్నామో అక్కడ మన మానసిక స్థితి, ఇతరుల, ప్రభుత్వపు, యాజమాన్యం యొక్క మన స్థితి వేరుగా ఉంది.

అఖిల భారతీయ స్థాయిలో ఏదైనా నిర్ణయం చేయవలసి వచ్చేటప్పుడు, అందరూ కలిసి ఆలోచిస్తున్నప్పుడు మనం బలహీనంగా ఉన్నచోట వారికి అనుకూలంగా ఏదైనా నిర్ణయం జరిగితే మనం బలంగా ఉండే చోట ఆ నిర్ణయాన్ని మన స్థితిని మరింత దిగజార్చేదిగానూ, ఇబ్బందికర పరిస్థితులలో మనను ఇరికించేదిగానూ భావించడం సహజం. ఒక వేళ నిర్ణయం బలంగా ఉన్న వర్గానికి అనుకూలంగా జరిగితే, బలహీనంగా ఉన్న వర్గం వారు వారికి అన్యాయం చేశామని భావిస్తారు. ఇరువైపులా అనుకూలంగా ఉండే విధంగా ఏ నిర్ణయము సాధ్యం కాదు. అఖిల భారతీయ స్థాయిలో జరిగే నిర్ణయాలు ఒక వర్గాన్ని దృష్టిలో ఉంచుకుని కాక సమగ్ర దృష్టి కోణంలో జరుగుతాయి. అఖిల భారత స్థాయిలో జరిగే నిర్ణయాలను అన్ని విభాగాలలోని అందరు కార్యకర్తలు అర్థం చేసుకోవాలి అన్న అవసరం కూడా లేదు. కొండ ఎక్కడానికి సంబంధించిన ఒక ఉదాహరణ చెబుతాను. పర్వతాన్ని అధిరోహిస్తున్నప్పుడు మొదట్లో పరిసరాలలో కొంత భాగం మనకు దృష్టిలోకి వస్తుంది. పైకి ఎక్కుతున్న కొద్దీ మరింత ఎక్కువ భాగం కనబడుతుంది. శిఖరాన్ని చేరుకున్న తరువాత మరింత విశాల

మైన పరిసర దృశ్యం మనకు కనబడుతుంది. దాని అర్థం ఆ సమయంలో మన కళ్ళ యొక్క చూసే శక్తి పెరిగిందని కాదు. దర్శన శక్తి అంతే ఉంటుంది. దృశ్యం మాత్రం విశాలం, స్పష్టం అవుతుంది. అదే విధంగా పని చేస్తూ ఉంటే కార్యకర్తయొక్క దృష్టి కోణం, గ్రహణశక్తి పెరుగుతాయి. ఇప్పుడు మీకు ఒక గుర్తింపు లభించింది. ప్రతిష్ఠ కూడా వచ్చింది: ఇప్పుడు ఈ ప్రతిష్ఠను ఉపయోగించుకుని కేంద్ర ప్రభుత్వోద్యోగుల సంక్షేమం కోసం మరింత మంచి మార్గాలను అన్వేషించే అవకాశం లభించింది. ఇంతకుముందు ఇలాంటి అవకాశం లభించలేదు. ఈ సాంకేతిక, వ్యూహాత్మక ప్రయోజనం మనకు లభించింది. సెప్టెంబర్ 26 సమ్మె విషయంలో ఇంతవరకు గ్రహిస్తేచాలు.

నా ఉపన్యాస సమయంలో పునాలోని అభ్యాసవర్గ విషయం ఒకసారి ప్రస్తావించాను. దానిని మరొక్కసారి గుర్తు చేయడానికి ప్రయత్నం చేస్తాను. సెప్టెంబర్ 26 సమ్మె విషయంలో దీనికి ఏమీ సంబంధం లేదు. అయినా శాశ్వతంగా అది గుర్తుండాలి. అందుకే మరొకసారి చెబుతున్నాను. అఖిల భారతీయ ఫెడరేషన్ ఉన్నచోట ప్రతి విషయంలోనూ అన్ని విభాగాలకు అనుకూలంగా నిర్ణయం చేయడం సాధ్యం కాదని మనం గ్రహించాలని అక్కడ నేను చెప్పాను. అదే మరల నేను చెప్పదలచు కుంటున్నాను. ఆ స్థితి రావడానికి ఇంకా 10, 12 ఏళ్ళు పడుతుంది. 10, 12, ఏళ్ళ తరువాత మనకు అన్ని శాఖలకు అనుకూలంగా ఉండే విధంగా నిర్ణయాలు చేయడం సాధ్యం అవుతుంది. దీనికి కారణం ప్రతి ఫెడరేషన్‌లోనూ కొన్ని కేంద్రాలలో మనం శక్తివంతంగా ఉన్నాం. కొన్నిచోట్ల బలహీనంగా ఉన్నాం. మనం బలంగా ఉన్నచోట మన యొక్క, ఇతరులయొక్క మానసిక స్థితి వేరుగా ఉంటుంది. కనుక శాఖా స్థాయి దృష్టితో ప్రతి విషయాన్ని ఆలోచించడం సాధ్యం కాదు. మనం కేవలం 'యూనియన్ వాదులం' (**Union Minded**) కాదు. మనం భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యకర్తలం. దాని ద్వారా అప్రత్యక్షరూపంలో యూనియన్‌లో కార్యకర్తలం. భా. మ. సం. దృష్టితో ఉన్నట్లయితే మనం బలమైన కేంద్రానికి చెందినా, బలహీనమైన కేంద్రానికి చెందినా, నిర్ణయాలు మనకు ప్రతికూలంగా జరిగినా కూడా మనం విచలితులం కాకుండా ఉండగలం. కొందరికి ఇబ్బంది కలిగినప్పటికీ ఇది ముందు చూపుతో చేసిన నిర్ణయమే అని గ్రహించగలగుతాం.

ప్రతి సంస్థకు కొన్ని శాశ్వత సిద్ధాంతాలు, కొన్ని వ్యావహారిక నియమాలు ఉంటాయి. మనం మన సిద్ధాంతాల వెలుగులో ఆలోచిస్తాం. ప్రజాస్వామిక పద్ధతులలో ఆలోచించి నిర్ణయాలు చేస్తాం. అందరితో మాట్లాడడం అవసరమే, మన దృష్టికోణం వారికి తెలియజెప్పడం ఒక ఆరోగ్యకరమైన సాంప్రదాయం. భారతీయ మజ్దూర్‌సంఘ్ ఒకవ్యక్తి లేదా అయిదుగురు వ్యక్తులు లేదా కార్యకారిణి మాత్రమే కాదు. మనమంతా కలిసే భారతీయ మజ్దూర్‌సంఘ్.

ప్రశ్న : ఈ శిక్షణ శిబిరంలో భారతీయమజ్దూర్ సంఘ్‌కు సంబంధించిన యూనియన్లకు చెందిన సాధారణ సభ్యులందరినీ ఎందుకు పిలువలేదు ? కేవలం ప్రముఖ కార్యకర్తలనే కలపడం ఎందువల్ల ?

సమాధానం : ఇది ప్రముఖ కార్యకర్తల కోసం ఉద్దేశించబడిన సమ్మేళనం కనుక సాధారణ సభ్యులను పిలువలేదు. అయితే ఈ విషయంలో ఇంకొంత చెప్పవలసి ఉంది. భారతీయ మజ్దూర్‌సంఘ్ ఒక కుటుంబం లాంటిదని మనకు తెలును. అయితే మన సంస్థ అనేకచోట్ల విస్తరిస్తోందని, కొత్త కొత్త వారు అనేకులు సభ్యులౌతున్నారనే ప్రత్యక్ష వాస్తవం కూడా మనకు తెలుసు. పూర్తిగా కొత్త సభ్యుడు భా.మ.స. మానసిక దృష్టి నేకలిగి ఉంటాడని చెప్పడం చాలాకష్టం. ఎక్కడ క్రొత్త యూనియన్ ప్రారంభమైనా దానిలో కొందరు ఇంటక్ నుండి, కొందరు ఏటక్‌నుండి వచ్చిచేరుతారు. వారి వారి పాతయూనియన్ల మనస్తత్వాలతోనే మన యూనియన్లలో ప్రవేశిస్తారు. కొందరైతే భౌతికంగా మనతో ఉన్నప్పటికీ వారి ప్రవర్తన, ఆలోచనా విధానం అన్నీ పాత పద్ధతిలోనే ఉంటాయి. ఇలాంటి వారు భారతీయ మజ్దూర్‌సంఘ్ కుటుంబంలోకి వచ్చిన తరువాత పూర్తిగా లీనం కావాలి. వారి ప్రవర్తన, ఆలోచనా తీరు అన్నీ ఆ విధంగా పరివర్తన చెందే విధంగా ప్రయత్నం మనం చేయాలి. మానసికంగా భారతీయ మజ్దూర్ సంఘ్‌తో పూర్తిగా కలువని వ్యక్తులను ప్రస్తుతానికి ఇక్కడకు పిలువరాదని నిర్ణయించాం. బాధ్యత కలిగిన ప్రముఖ కార్యకర్తలనే ఇక్కడకు పిలిచాం. దీనిని మరింత స్పష్టపరచాలంటే రైలుబండి ఉదాహరణ తీసుకోవచ్చు. రైలుబండిలో ఒక ఇంజన్, మిగిలిన పెట్టెలు ఉంటాయి. అందరు బొంబాయి నుండి ఢిల్లీ వెళ్ళవలసి ఉంది. కానీ ఒక రైలులో కూర్చున్నప్పటికీ ప్రయాణీకులందరూ ఢిల్లీ వెళ్ళాలనిగానీ, రైలును ఢిల్లీకి చేర్చాలనిగానీ అనుకోరు. అయితే డ్రయివర్, గార్డ్‌ల ఉద్దేశ్యం

మాత్రం రైలును ఢిల్లీ చేర్చాలనేదే ఉంటుంది. రైలులో కూర్చున్న వారిలో కొందరు పెళ్ళికి వెళ్తుంటారు. కొందరు మిత్రులను కలువడానికి వెళ్తుంటారు. కొందరు డబ్బు వసూలు చేసుకోవడానికి వెళ్తుండవచ్చు. ఎవరి ఉద్దేశ్యం వారికి వేరుగా ఉంటుంది. కానీ అందరూ ఒకే రైలులో ప్రయాణం చేస్తున్నారు. ఒక రైలులో ప్రయాణిస్తున్నంత మాత్రాన అందరి ఉద్దేశ్యం ఒక్కటిగా ఉండదు. డ్రయివర్, గార్డ్ మాత్రం రైలును ఢిల్లీ చేర్చాలని ఏకలక్ష్యం కలిగి ఉంటారు. అక్కడ ఏదో ఖరీదు చేయాలనే ఉద్దేశంతో వారు రైలులో ప్రయాణం చేయరు. అదే విధంగా ఈ సంస్థ అనే రైలుబండిని అంతిమ గమ్యానికి చేర్చాలనే విశుద్ధ మైన లక్ష్యం ఎవరి హృదయాలలో ఉన్నదో అలాంటి కార్యకర్తలనే ఇక్కడకు పిలువడం జరిగింది. మిగిలిన వ్యక్తులు కూడా డ్రయివర్, గార్డ్‌ల స్థాయికి రావడం కోసం వేరే స్థలాలలో మనం అభ్యాసవర్గలు నిర్వహిస్తూనే ఉన్నాం.

ప్రశ్న :- మన గమ్యం మోక్షం అని చెప్పారు. కానీ స్వామీ వివేకానంద ఈ దేశంలో ఒక్క కుక్క ఆకలితో ఉన్నంతవరకు నేను మోక్షాన్ని కోరను అని చెప్పారు. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ మొదటి సర్ సంఘచాలక్ పూజనీయ డా॥ హెడ్గెవార్ జీ కూడా శ్రీ గురుజీ యొక్క జీవనదిశను మరల్చే ప్రయత్నంలో సమాజ కార్యమైనా చేయాలి లేదా మోక్షాన్ని గురించిన ఆలోచన నైనా విడనాడాలని మార్గదర్శనం చేశారు. ఈ రెండు విషయాలను సమాధానం చేయడం ఎలా?

**సమాధానం :-** మీరు ఏ మహాపురుషుల పేర్లు ప్రస్తావించారో వారు మోక్ష సాధన చేసిన అత్యంత శ్రేష్ఠవ్యక్తులు. ఇట్లాంటి మహాపురుషులు మరి కొందరు ఉన్నారు. ప్రజల దుఃఖాన్ని దూరం చేసేటంతవరకు, లక్ష్యాన్ని సాధించే వరకు నాకు మోక్షం అక్కరలేదని వారు అన్నారు. ఇది వారి వైయక్తిక ఘన తకు సూచకం. మోక్ష సాధన లక్ష్యానికి ఈ విషయంవల్ల ఆటంకం ఏమీరాదు. ధ్యేయం సిద్ధించకపోతే మోక్షం కూడా వద్దనేవారు కూడా ఉన్నారనే విషయం దీని ద్వారా స్పష్టమౌతుంది. సంత్ తుకారాం చెప్పిన ప్రసిద్ధ వాక్యాలు ఉన్నాయి.

'నకో ముక్తి ధనసంపదా, సంత్ సంగతి దేయీా సదా'

'నాకు మోక్షం వద్దు. సాధు పురుషుల సాగత్యం చాలు' అని ఆయన అనాడ్ను. ఇదే పరంపరకు చెందిన మహాపురుషులకు ఈ భూమిలో కొరతలేదు.

అయితే ఈ సందర్భంలో తాత్కాలికమైన సుఖం యొక్క ప్రభావం మనస్సుపై అధికంగా ఉంటుందన్న విషయం గుర్తుంచుకోవడం అత్యంతావశ్యకం. ఇప్పుడు ఏమేం చేయాలో అదే చేద్దాం. మోక్షం విషయం తరువాత ఆలోచిద్దాం అనే భావన కూడా కలుగుతూంటుంది. ఇలాంటి వారికోసం 'సెంట్' ఒక ప్రార్థన చెప్పాడు.

**'lord! Make me good, but not yet.'**

భగవంతుడా! నన్ను మంచివాడిని చెయ్యి, కానీ అప్పుడే కాదు. 'కొద్దిగా ఆగు. నాకు ఇంకా కొన్ని పనులు ఉన్నాయి' అవి అయిపోయిన తరువాత నన్ను మంచివాడిని చెయ్యి, ఇది 'సెంట్' రచించిన ప్రముఖ ప్రార్థన. అయితే ఏ మహా పురుషుల గురించి ప్రస్తావించారో వారు మోక్షాన్ని కూడా కోరనంతటి శ్రేష్ఠమైన వ్యక్తులు. ఫ్రాస్ట్ అనే గొప్ప కవి ఉన్నాడు. ఆయన కవిత జవహర్‌లాల్‌జీ ఎప్పుడూ తన టేబుల్‌పై పెట్టుకునే వారు.

**Woods are lovely dark and deep**
**But I have pramises to Keep**
**Miles to go before I sleep**
**And miles to go before I sleep.**

స్వామి వివేకానంద, డాక్టర్జీ, గురూజీల ఉదాహరణలు ఈ కోవకు చెందినవి.

ప్రశ్న : మనం కార్యకర్తల నిర్మాణం విషయంలో ఎంతో శ్రద్ధ వహిస్తాం. ఇది అవసరం కూడా. కానీ ఇది ప్రచార యుగం. మన ప్రభావం పెరగాలంటే ప్రచారం ఒక మంచి మాధ్యమం. మనం ఈ అంశాన్ని నిర్లక్ష్యం ఎందుకు చేస్తున్నాం?

సమాధానం : కొన్ని కాలెండర్లలో పైన ఏదైనా సుందరమైన దృశ్యం ఉండి క్రింద దాని ప్రతిబింబం నీటిలో కన్పడుతున్న చిత్రాలు ఉంటాయి. పైన తాజ్ మహల్ ఉంటే క్రింద నీటిలో తాజ్‌మహల్ ప్రతిబింబం ఉంటుంది. కార్యకర్త, కార్య క్షేత్రాల మధ్య సంబంధం కూడా ఇలాంటిదే. కార్యకర్త ప్రతిబింబం కార్యక్షేత్రంలో కనబడుతుంది. మంచి కళాకారుడు పైన తాజ్ మహల్‌ను చూసి క్రింద నీటిలో దాని ప్రతిబింబం ఎలా ఉంటుందో ఊహించ

గలుగుతాడు. లేదా నీటిలో ప్రతిబింబాన్ని చూసి పైన తాజ్‌మహల్ ఏ విధంగా ఉంటుందన్నది కూడా కల్పన చేయగలుగుతాడు. అదే విధంగా సంఘటనా శాస్త్రం, గురించి అవగాహన ఉన్న ఏ వ్యక్తి అయినా కార్యకర్తను చూసి అతడి కార్యక్షేత్రంలో ఉండే గుణదోషాలు అంచనా వేస్తాడు. కార్యకర్తను చూడకుండానే కార్యక్షేత్రాన్ని ఒక్కసారి చుట్టివస్తే కార్యకర్త స్వభావం ఎలాంటిది? అనేది అంచనా వేయగలుగుతాడు. ఇలా కార్యకర్త, కార్యక్షేత్రాల మధ్య అవినాభావ సంబంధం ఉటుంది. కార్యకర్త ఎలా ఉంటే దాని ప్రతిబింబం కార్యక్షేత్రంలో కనబడుతుంది.

కార్యకర్తల విషయంలో భారతీయ మజ్దూర్ సంఘ్ చూపించే శ్రద్ధ మరే ఇతర జాతీయ కార్మిక పక్షం చూపించదు. 1977 లో 'కోట'లో భారతీయ మజ్దూర్ సంఘ్ కార్యకర్తలకు ఒక స్వాధ్యాయ వర్గ ఏర్పాటు చేయబడింది. అందులో ఈ విషయం విన్న 'సీటూ' నుండి వచ్చి మనతో చేరిన ఒక వ్యక్తి మీరు కార్యకర్తల విషయంలో ఎందుకింత శ్రద్ధ తీసుకుంటారని ప్రశ్నించాడు కార్యకర్త ఎప్పుడూ కార్యకర్తగానే ఉంటాడు కదా అని అతడి అభిప్రాయం అలా కాదని మనం చెప్పాం. మనం కార్యకర్త మరింత శ్రేష్ఠంగా కావాలని కృషి చేస్తాం. ఆ కారణాన కార్యక్షేత్రం స్వతహాగానే శ్రేష్ఠంగా అవుతుంది. ఇవన్నింటి తరువాత కూడా వ్యక్తికి తన స్వభావం ఉండనే ఉంటుంది. వేరువేరు టెంపర్‌మెంట్స్ ఉంటాయి. నాకు ఒక మంచి మిత్రుడున్నాడు. అతడు మజ్దూర్ సంఘ్ వాడు కాదు. వేరేక్షేత్రంలో పని చేస్తున్నాడు నాయకుడు కూడా. అతడికి ఒక స్వభావం ఉంది. ఎవరినైనా ఏదో అనడం, తరువాత నేను మొహమాటం లేకుండా అంటాను. మనసులో ఏముందో అది బైటకు అనేస్తాను. రెండు నాలుకలతో మాట్లాడడం నాకు చేతకాదు అనడం అతడి స్వభావం. ఇలాంటి వారి మనస్సులో తెలియకుండ 'నేను ఇలాగే ఉంటాను. నన్ను ఉపయోగించుకో గలిగితే ఉపయోగించుకొండి లేదా విడిచిపెట్టండి. నాలో మార్పు సంభవం కాదు' అనే భావన దాగి ఉంటుంది. వారు సరిగ్గా చెత్తబుట్టలాంటి వారు. చెత్తబుట్టల మీద అప్పుడప్పుడు 'యూజ్ మీ' (use me) అని వ్రాసి ఉంటుంది. నేను ఉన్న స్థితిలో నన్ను ఉపయోగించుకోండి అని. 'నేను ఇలాగే ఉంటాను' అని చెత్తబుట్ట చెబుతుంది. నాలో ఏం సంస్కరణ రాదు. ఉపయోగించుకో గలిగితే ఉపయోగించుకోండి, లేదంటే వదిలివేయండి. ఒక్కొక్కసారి చాలా నిజాయితీ కలిగిన వ్యక్తులు కూడా

ఇలానే ఆలోచిస్తూ ఉంటారు. వారి నిజాయితీని ఏ మాత్రం శంకించలేం. కానీ నా స్వభావం ఇలాగే ఉంటుంది. అది మారదు అనే భావన వారిలో బలంగా ఉంటుంది. మనం చెత్తబుట్టలాంటి వారం కాదని వారు గ్రహించరు.

ఇందులో రెండు రకాల వ్యక్తులను మేం చూశాం వారిలో ఒక రకం మహాబద్ధకస్తులు. అయితే నిజాయితీపరులు. అందువల్ల పని చేయడం ఇష్టంలేదని చెప్పేస్తారు. వీరి విషయం అయితే వదిలేయక తప్పదు. వారెప్పటికీ కార్యకర్తలుగా తయారు కానేకారు. అయినప్పటికీ నిజాయితీ పరుడైన కార్యకర్త కూడా ఇలా మాట్లాడడం బాధాకరమైన విషయం. దీనికి కారణం ఒక్కటే. వారు చాలా సూటి అయిన, సరళమైన స్వభావం కలవారై ఉంటారు. కేవలం బద్ధకం కారణంగానే తమలో మార్పు రావడానికి వారు వ్యతిరేకిస్తారని భావించడం సరి కాదు, వారి ఆలోచనా విధానమే వేరుగా ఉంటుంది. ఒక ఉదాహరణ ఇస్తాను. మాకు ఒక మిత్రుడు ఉన్నాడు, మేం ఇద్దరం కలిసి ఒక చిన్న కార్యకర్తతో మాట్లాడడానికి వెళ్ళాం. అతడికి అవగాహన కల్గించాలి. నేను అతడితో మాట్లాడడం ప్రారంభించాను. నేను అడుగుతున్నాను, ఎదుటి వ్యక్తి సమాధానాలు చెబుతున్నాడు. నేను ఏం అడిగినా అతడు ఒకటే సమాధానం చెబుతున్నాడు. ఒకే విషయాన్ని అనేకసార్లు పలికే అలవాటు కొందరికి ఉంటుంది. ఆ కార్యకర్తకు కూడా అలాంటి అలవాటే ఉంది. అతడు మూడు నాలుగుసార్లు ఒక విషయం చెబుతున్నా నేను వింటూనే ఉన్నాను. కానీ నా మిత్రుడి సహనం మాత్రం పోయింది. 'దత్తోపంత్! ఇతడితో మాట్లాడడం అర్థంలేని పని, పద,' అన్నాడు. తరువాత అతడిని పిలిచి "నువ్వు మొదటిశ్రేణికి చెందిన మూర్ఖుడవు" అని కూడా అన్నాడు. మొత్తం వ్యవహారం కాస్తా చెడిపోయింది. మేం ఇంటికి తిరిగి వచ్చేశాం. ఇంటికి వచ్చిన తరువాత నువ్వు అతడిని మొదటి తరగతి మూర్ఖుడివని ఎందుకన్నావని నా మిత్రుడిని ప్రశ్నించాను. అతను "దత్తోపంత్! నీ గురించి నాకు బాగా తెలుసు. నువ్వు నాకు పాఠాలు చెప్పాలనుకుంటున్నావు" అన్నాడు. "ఏమిటి?" అని నేను అడిగాను" నా మనస్సులో ఏముందో అదే మీ మనస్సులో కూడా ఉంది. భేదమల్లా అతడు మూర్ఖుడని నేను పైకి అన్నాను. మీరు అనలేదు. అంతే! నేను నిర్మొహమాటంగా మాట్లాడుతాను. మీరు బైటపడరు". అన్నాడు. ఇక అతడికి ఎలా నచ్చజెప్పాలి! నిజానికి అతడికి నచ్చజెప్పడానికి ఒక బౌద్ధిక్ తయారు చేసుకున్నాను. తీరా అతడలా అనేసరికి అది కాస్తా ఎగిరి

పోయింది. ఇక నేనేం మాట్లాడాలి. ఇక మాలో ఎలాటి పరివర్తన సాధ్యంకాదు అనుకునే స్వభావం ఇలాంటి వారిది. ఇది ఒక జబ్బులాంటిది. దీనికి మందే లేదు.

ఇది ఎంతవరకు ఉచితమని ప్రతి కార్యకర్త ఆలోచించుకోవాలి. నేను సూటిగా మాట్లాడుతాను, ఎవరికీ భయపడను, అనే స్వభావం అహంకారానికి ప్రతీక అవుతుంది. "మేము కూడా మనుష్యులమే కదా! మాకు కూడా కోపం వస్తుంది కదా!" అని కొందరు అంటూంటారు. కోపం రావడం మానవ సహజమైన స్వభావం కావచ్చు. మనిషిగా పుట్టినందువల్ల ఈ గుణాలన్నీ మీలోనూ రావడంలో దోషం, ప్రమాదంలేదు. కానీ పది మందీ నన్ను అనుసరించాలి, నన్ను నాయకుడిగా లేదా కార్యకర్తగా గుర్తించాలి అని మాత్రం మీరు ఆశించవద్దు. మిగిలిన పది మందితోబాటే మీరు కూడా జీవించండి. అంతేగానీ పదిమందికీ నాయకత్వం వహించాలనుకుంటే మాత్రం ఇది మానవ సహజ స్వభావం అని నచ్చజెప్పుకోవడం పనికిరాదు. జె. కృష్ణమూర్తి కవిత ఒకటి ఉంది. పర్వత శిఖరంపై నిలచి ఉన్న ఒకే చెట్టునుద్దేశించి ఆయన అంటారు.

**Stand alone**
**Like a solitary tree on the mountain**
**We want a tree stand a love.**

నీవు ఒంటరిగానే నిలబడు. సుఖం వస్తుంది. దుఃఖం వస్తుంది. ఆశనిరాశలు ఎదురౌతాయి. ఎవరితోనూ వాటిని పంచుకోక అన్నీ నీవే జీర్ణించుకుంటూ ఒంటరిగా నిలబడు. పర్వత శిఖరం మీద చెట్టులా ఒంటరిగా నిలబడు. శిఖరంపై ఒంటరిగా నిలువ గలిగినవాడే ఎంత పెద్ద పనయినా చేయగలుగుతాడు. ఒంటరి తనం గొప్పదనానికి మూల్యం. ఈ మూల్యం చెల్లించలేకపోతే క్రింద వేలాది చెట్లు ఉన్నాయి. వాటితోబాటే నిలబడు కానీ శిఖరంపై ఒంటరిగా నిలబడిన చెట్టుగా నిన్ను గుర్తించాలని మాత్రం ఆశించకు. నాయకత్వం వహించాలంటే కార్యకర్తగా నిలబడాలంటే దానికి తగిన మూల్యం తప్పక చెల్లించవలసి ఉంటుంది.

ఈ రోజులలో ఆలోచనలు వేరే విధంగా సాగుతున్నాయి. ఏయే క్షేత్రాలలో రాజకీయకరణం (Politicalisation) ఉంది అని కొందరు ముఖ్యంగా ఆ క్షేత్రంలో పనిచేసే కార్యకర్తలు ఆలోచిస్తారు. నిజానికి 'పొలిటిసైజేషన్' అనే

పదం సరియైనది కాదు, పొలిసైజేషన్ (**Policisation**) అనే పదం ఉచితమైనది. కానీ 'పొలిటికలైజేషన్' శబ్దమే నేడు ఎక్కువ వాడుకలో ఉంది. ప్రజలకు ఇవన్నీ అక్కరలేదు. వారి విషయాలు సరి చేసుకోవడమే వారికి చాలా కష్టంగా ఉంటుంది. ప్రజలను జాగృతులను చేయడానికి ఉపదేశాలివ్వడం సులభమే. అయితే ఎక్కడ రాజకీయకరణం ఎక్కువ ఉంటుందో అక్కడ ప్రజలు ఎందుకింత శ్రమపడాలని ఆలోచిస్తారు. మన వ్యవహారం ప్రభావం కలిగించేటట్లుగా ఉంటేనే పని నడుస్తుంది. అవకాశం లభించినప్పుడు ప్రభావవంతమైన మాటలు మాట్లాడడం, తియ్యగా మాట్లాడడం ప్రజలపై మరింత ప్రభావాన్ని కలిగిస్తుంది. మనకు నాయకత్వం లభిస్తుంది. మనలో సద్గుణాలు వికసింప చేసుకోవలసినంత కష్టం పడవలసిన అవసరం ఏముంది? ఇదంతా ఎవరు పడతారు ? కనుక ఏమీ చెల్లించకుండా సులభంగా నాయకత్వం చేరిక లభించాలని, అనుచరులు దొరకాలని ఇతరులు భావిస్తూంటారు. పైగా రాజకీయాలలో ఇవన్నీ నడుస్తూనే ఉంటాయంటారు. నాయకుడు ఎలాంటి వాడైనా ఫర్వాలేదు. వేదికెక్కి కాస్త ప్రభావవంతంగా మాట్లాడగలిగితే చాలు ప్రజలు ఆయనకు జేజేలు కొడతారు. ఉపన్యాసంలో సారం ఏముంది ? ఇది కేవలం మనస్సుకు ఆనందం కలిగించే ఉపన్యాసం మాత్రమేనా? అనే విషయాలు ప్రజలు ఆలోచించరు. చప్పట్లు మాత్రం మార్మోగుతూనే ఉంటాయి. అయితే ఆత్మ సమర్పణకు, త్యాగానికి ప్రేరణ కలిగించలేని ఏ ఉపన్యాసాన్ని అయినా ప్రభావశాలి అయిన ఉపన్యాసం అని అనగలమా? ప్రేరణదాయకమైనదని అన గలమా? లేకపోతే మూడు గంటలు సినిమా చూడడానికి, నేతాజీ ఉపన్యాసం వినడానికి మధ్య తేడా ఏముంది ? ఇలాంటి ఉపన్యాసాలకు ప్రజలు ప్రేరణ పొందడానికి కాక కాలక్షేపానికి, విని ఆనందించడానికి మాత్రమే వస్తూంటారు. రాజకీయ నాయకులు కూడా పైపై మెరుగులతోటే పనికానిచ్చేయాలని ప్రయత్ని స్తారు. తమనుతాము సంస్కరించుకునే ప్రయత్నం చేయరు. ఎందుకంటే అది కష్టం కనుక కార్యకర్తలను సమీపానికి రానివ్వకుండా ఉంటే వాళ్ళు మనలోని మంచి చెడ్డలు ఏమిటన్నది గ్రహించలేరు కదా! కనుక వారిని దగ్గరకు రానివ్వ కుండా జాగ్రత్త పడతారు. బహిరంగ వేదికలపైకి మాత్రమే వారు వస్తారు. వారి వ్యక్తిగత శీలం, వ్యవహారం ఏమిటి? అన్నది ఎవరికీ తెలియదు. తనలోని దోషాలను దాచుకున్నట్లయితే తన గురించి చెడు భావన కలిగే ఆస్కారం ఉండదని వారు అనుకుంటుంటారు. ఇవాళ రేపు ప్రజలలో ఈ రకమైన ఆలోచనా ధోరణి బాగా కనబడుతోంది.

ప్రజలపై ప్రభావం పడాలంటే చిన్న చిన్న తమాషాలు కూడా చేయవలసిఉంటుంది. మన కార్మిక రంగంలో కూడా ఆ రకంగా చేసేవారు కొందరు ఉన్నారు. ఉత్తరప్రదేశ్‌లో ఒక పెద్ద పట్టణం ఉంది. అక్కడ ఒక పెద్ద నాయకుడు ఉన్నాడు. ఇలాంటి తమాషాలు చేయడంలో అతడు సిద్ధహస్తుడు. ఆ రోజులలో తన ప్రభావాన్ని ఆయన బాగా ప్రస్థాపించుకున్నాడు. కానీ ఇలాంటి పద్ధతులలో సంపాదించుకునే ప్రతిష్ఠ కొద్ది సమయం వరకు నిలబడవచ్చునేమో కానీ దీర్ఘకాలం మాత్రం అది నిలబడదని ఆయనకు తెలుసు. ఆయన ఎన్నికలలో గెలిచి శాసనసభలో ప్రవేశించాడు. ఆయన నాయకుడుగా ఉన్న చోట అనేక ఫ్యాక్టరీలు ఉన్నాయి. ఇక ఫ్యాక్టరీలో ఒక రోజు ఏదో ఘర్షణ జరిగింది. వెంటనే ఈయన ఇంటిలో ఫోను మ్రోగింది. కార్మికులంతా ఫ్యాక్టరీ గేట్ల వద్ద చేరారు. ఫోన్‌లో విషయం తెలియగానే ఈయన ఫ్యాక్టరీ వద్దకు బయలుదేరాడు. కార్మికులను సమావేశపర్చి ఉపన్యాసం ప్రారంభించాడు. "సోదరులారా! నిజానికి ఇక్కడికి రావడానికి నాకు ఎంతో ఇబ్బంది ఉండింది. ఈ రోజు ఉదయమే మా తల్లిగారు స్వర్గస్థులయ్యారు. వారి శవం వాకిట్లోనే ఉంది. మా బంధువులు, ఇరుగు పొరుగు వారు అందరూ వచ్చి ఉన్నారు. ముందు శవదహనం జరిపించి ఆ తరువాతనే వెళ్ళమని వాళ్ళు బలవంతం చేశారు. లేదు లేదు. అమ్మగారి శవం కావాలంటే కొద్ది సేపు వేచి ఉండగలదు. కానీ నా కార్మికులు ఈ సమయంలో ఎంతో కష్టంలో ఉన్నారు. నేను ఆగలేను. వెళ్ళివస్తాను" అని చెప్పి నేను బయలుదేరాను" అని చెప్పాడు. నిజంగా నాయకుడంటే ఇలా ఉండాలి. చప్పట్లు మార్మోగాయి. ఆ రోజు ఫ్యాక్టరీలో గొడవ జరిగింది అన్న విషయం తెలిసి చుట్టుపక్కల ఫ్యాక్టరీల కార్మిక ప్రముఖులుకూడా కొందరు అక్కడకు వచ్చారు. ఎక్కువ లేరు. 10, 15 మంది ఉంటారు. వారిపై కూడా మంచి ప్రభావం పడింది.

ఇలా ప్రతిష్ఠ పెంచుకునే (**Image Building**) వ్యక్తుల పరిస్థితి అప్పుడప్పుడు చాలా విచిత్రంగా ఉంటుంది. తప్పుచేసే వ్యక్తికి ఒకసారి అది జీర్ణించుకుపోతే ధీమా పెరుగుతుంది. ధీమాతో రెండవసారి మరింత పెద్ద తప్పు చేస్తాడు. మరల ధీమా మరింత పెరుగుతోంది. దాంతో ఇంకా పెద్ద నేరం చేయడానికి సిద్ధపడతాడు. ధీమా పెరుగుతున్న కొద్దీ అశ్రద్ధ కూడా పెరుగుతూ ఉంటుంది. నిర్లక్ష్యం కారణంగా కొన్ని విషయాలను పట్టించుకోవడం మానివేస్తాడు.

ఈ నిర్లక్ష్యం, అశ్రద్ధల కారణంగానే చివరికి అతడు అందరి ముందు దొరికి పోతాడు. బహుశః ఈ విషయం ఆ పెద్ద మనిషికి తెలియదనుకుంటాను. ఒక నెల రోజుల తరువాత ఆయన ఢిల్లీనుండి తిరిగి వచ్చాడు. ఆ సమయానికి మరొక ఫ్యాక్టరీలో గొడవ జరుగుతోంది. ఆయన అక్కడకు చేరుకున్నాడు. ముందుసారి ఇచ్చిన ఉపన్యాసం సంగతి మర్చిపోయాడు. ఇక్కడ ఉపన్యాసం ప్రారంభించాడు. మళ్ళీ పాత రికార్డు ప్రారంభించాడు. "సోదరులారా! ఈ రోజు మా తల్లిగారు స్వర్గస్థులయ్యారు. ఎలా వెళ్తావు? అని అందరూ అన్నారు. కార్మికులు కష్టాలలో ఉన్నారు. నేను ఎలా ఆగగలను అని నేను అన్నాను. తల్లిగారి శవం వాకిట్లో పడి ఉంది. నేను పరిగెత్తుకుని వచ్చాను" వగైరా వగైరాలన్నీ చెప్పాడు. మొదటిసారి మీటింగ్‌కు ఎవరైతే 10, 15 మంది బైటనుండి వచ్చారో వాళ్ళు ఈ మీటింగ్‌లో కూడా ఉన్నారు. ప్రజలు చప్పట్లైతే కొట్టారు. కానీ ఆ తరువాత 'ఈయన తండ్రిగారు రెండు పెళ్ళిళ్ళు చేసుకున్నాడా?' అని అడగడం ప్రారంభించారు. 'నెల ముందే ఒక తల్లిగారు మరణించారు. ఇప్పుడు మరొక తల్లి చనిపోయింది. ఏమిటా సంగతి? అని చెవులు కొరుక్కోసాగారు. బండారం బట్ట బయలైంది. అభూతకల్పనల ద్వారా తమ ప్రభావాన్ని ప్రస్థాపించుకోగలమనే వారికి ఇలాగే అవుతుంది.

మరొక నాయకుడి ఉదాహరణ కూడా ఉంది. ఆ సమయంలో నేను రాజ్యసభ సభ్యుడిగా ఉన్నాను. తన నియోజక వర్గంనుంచి ఎవరు వచ్చినా వారికి తప్పక సమయం కేటాయించాలని ఆయన ఇంట్లో అందరికీ గట్టిగాచెప్పాడు. కార్మికులలో రెండు వర్గాలు వేరు వేరు సమస్యలు తీసుకుని వారి వద్దకు వచ్చాయి. ఆయన భార్య ఒక వర్గానికి మధ్యాహ్నం 2 గం. లకు, మరొక వర్గానికి సా॥ 4 గం॥లకు సమయం ఇచ్చింది. పార్లమెంటు సభ్యుడు పార్లమెంట్ నుండి 12.30 గం. లకు ఇంటికి వచ్చాడు భోజనం చేశాడు. విశ్రాంతి తీసుకున్నాడు. బెల్ మ్రోగగానే నిద్రగది నుండి నేరుగా తలుపు దగ్గరకు ఆయన రాలేదు. ఆయనకు ఒక పద్ధతి వుంది. నిద్రగదినుండి నేరుగా భోజనాల గదిలోకి వెళ్ళినీ ఆయన బైటకురాడు. భోజనాలగదిలో ఒక కంచంలో అన్నం, పప్పు ఎప్పుడూ పెట్టి ఉంటాయి ఆయన ఆ కంచంలో చేయిపెట్టి కలిపాడు. తరువాత తలుపుతెరిచాడు. తలుపుతెరిచి రండి, రండి అని ఆహ్వానించాడు. ఆ వర్గంతో కూర్చున్నాడు చేతికి, అన్నం, పప్పు అంటుకునే ఉంది ఆయన భోజనం చేస్తున్నాడని అందరికీ స్పష్టమైంది. పాపం ! ఆ అమాయక కార్మికులు "అయ్యా! మీరు భోజనం కానివ్వండి.

తరువాత మాట్లాడుకుందాం" అంటున్నారు. ఈయన మాత్రం "లేదు లేదు మీరు ఇంత దూరం నుంచి వచ్చారు. నా భోజనం కోసం నేను మీ సమయం ఎలా వ్యర్థం చేయగలను. ముందు మీరు మీ సమస్యలను చెప్పండి." అన్నాడు. కార్మికులపై మంచి ప్రభావం పడింది. పార్లమెంటుకు వెళ్ళి కార్యదర్శితో మాట్లాడ వలసిన సమస్య అది. సాయంత్రానికి ఆ కార్మికులు తిరిగి వెళ్ళవలసి ఉంది. "సరే! మీరు 5 గం.లకు రండి. నేను ఇప్పుడె వెళ్ళి సెక్రటరీతో మాట్లాడతను" అని చెప్పి ఆయన లోపలికి వెళ్ళి పోయాడు. తరువాత 4 గం. ల వర్గం వారు వచ్చారు. అప్పటికి అయన నిద్రలో ఉన్నాడు. గంట మ్రోగగానే, ఆయన లేచి భోజనాల గదిలోకి వెళ్ళి, అన్నం-పప్పులో చేతులు కదిలించివచ్చి తలుపుతీశాడు. "రండి కూర్చోండి. నేను ఇప్పుడే పార్లమెంట్‌నుండి వచ్చాను. చాలా సుదీర్ఘంగా సమావేశం జరిగింది. అయినా ఏం ఫర్వాలేదు. చెప్పండి. మీకేం సేవచేయగలను" అన్నాడు. ముందు మీ భోజనం పూర్తి చేయండి అన్నారు కార్మికులు. 'లేదు లేదు ముందు మీ విషయం విందాం. మీరు దూరం నుండి వచ్చారు. భోజనం తరువాత అయిన చేయవచ్చు' అన్నాడు, అప్పుడు కూడా వారిపై మంచిప్రభావం పడింది. ఈ విషయం నాదృష్టికి ఎలా వచ్చిందంటే ఆ సమయానికి నేను ఎం.పి. క్యాంటిన్‌లో చాయ్‌కోసం కూర్చుని ఉన్నాను. ఆయన 5 గం. ల సమయం ఎవరికి ఇచ్చాడో వాళ్ళు కొద్ది ముందుగా వచ్చారు. సమయం గడపడం కోసం వారుకూడా క్యాంటిన్‌లో కూర్చున్నారు. నేను వారికి సమీపంలోనే వేరే టేబుల్‌వద్ద కూర్చుని ఉన్నాను. ఇంతలో 4 గం ల వర్గం కూడా అక్కడికి వచ్చింది. ముందు వచ్చిన వర్గం వారిని చూసి 4 గం ల వర్గం వారు "మీరు ఎప్పుడొచ్చారు ? అని ప్రశ్నించారు. మాటలలో నాయకుడి ప్రస్తావన వచ్చింది' 4 గం. ల వర్గం వాళ్ల 'అయ్యో! ఇంత మంది ఎమ్. పి.లు ఉన్నారు, కానీ ఇంత కష్టపడే ఎమ్. పి.ని మరొకరిని మేం చూడలేదు. కార్మికులపై ఆయనకు ఎంతో ఆపేక్ష." అంటూ చెప్పసాగారు. మొదటివర్గం "ఏమైంది?" అని ప్రశ్నించారు. "మేం వెళ్ళేటప్పటికి పాపం ఆయన భోజనం చేస్తున్నాడు. అప్పుడే పార్లమెంట్ నుండి వచ్చాడట. భోజనంకూడా పూర్తిచేయకుండా ఆచేతులతోనే మేం చెప్పేది వినడానికి కూర్చుండి పోయాడు-" అంటూ వారు చెప్పారు. వాళ్ళు ఈ విషయం చెబుతూ ఉంటే 2 గం. ల వర్గం వారు ఒకరి మొహం ఒకరు చూసుకోసాగారు. రెండవ వర్గం వారు ఇది చూసి "ఏమైంది? మీరు ఎందుకలా ఒకరినొకరు చూసుకుంటున్నారు?"

అని అడిగారు. "విచిత్రంగా ఉంది. మేం2 గం॥లకు వెళ్తే అయన అప్పుడే పార్ల మెంట్‌నుండి వచ్చి భోజనం చేస్తున్నాడు. మీరు 4 గం॥లకు వెళ్ళేటప్పటికి కూడా భోజనం చేస్తున్నాడు. రెండు సార్లుభోజనం ఎలా చేయగలడు" అన్నారు వారు. బండారం బైటపడింది.

ఒక నాయకుడు విదేశీ యాత్రకు బయలుదేరాడు. ఆయన తరువాత కొద్ది రోజులకు ఆ దేశంలో నా పర్యటన జరిగింది. అక్కడి భారతీయులను ఆయన కలుసుకున్నాడని తెలిసింది. అక్కడ ఒక ఇంజనీర్ ఉన్నాడు. ఆయన ఒక అభివృద్ధి పథకాన్ని చెప్పాడు. ఈ నాయకుడు ఆ విషయాలలో ప్రముఖుడేంకాదు. కానీ రకరకాల ప్రశ్నలు వేసి అతడు ఆ పథకాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. నిజానికి ఆయన చాలా పెద్ద నాయకుడు. ఆయనకు పటాటోపం ప్రదర్శించవలసిన అవసరం లేదు. అక్కడి నుండి వేరే పట్టణానికి ఆయన వెళ్ళాడు. అక్కడి భారతీయులు కూడా ఆయనను కలుసుకోవడానికి వచ్చారు. వారితో మాట్లాడుతూ మాట్లాడుతూ ముందు నగరంలో ఇంజనీర్ చెప్పిన పథకాన్ని వాళ్ళకు వివరించాడు- "ఇలాంటి పథకం రూపొందిస్తే ఎలా ఉంటుందని నాకు అనిపించింది." అని అన్నాడు. ఈ నాయకుడు ఎంత ఆలోచన కలిగినవాడు! అని ప్రజలు ఆశ్చర్య చకితులై పోయారు. ఆయినను సాంకేతిక పరిజ్ఞానం కూడా చాలా ఉందని వారు అనుకున్నారు. ఆయన 8, 9 స్థలాలకు వెళ్ళవలసి ఉంది. అన్నిచోట్ల ఇలాంటి ప్రభావాన్నే కలిగించాడు. కానీ పర్యటన హడావుడిలో ఈ పథకాన్ని తనకు చెప్పిన వ్యక్తి ఎవరన్న విషయాన్ని ఆయన మరిచిపోయాడు. హిందుస్థాన్ తిరిగిరావడం కోసం మొదట ఎక్కడ దిగాడో అక్కడికి రావలసివచ్చింది. అలవాటు ప్రకారం మాటల సందర్భంలో తన ఎదుట ఉన్న వ్యక్తితో "నా మనస్సులో ఒక ఆలోచన ఉంది. మీకేమనిపిస్తోందో చెప్పండి" అంటూ మొత్తం పథకాన్ని అతడికి వివరించాడు. ఆ తరువాత నేను అక్కడికి వెళ్ళినపుడు అదే వ్యక్తి ఇంట్లో నా నివాసం ఏర్పాటయింది. ఆయన నాకు అంతా వివరించాడు. చివరికి అన్నాడు, "నాకు చాలా బాధకలిగింది. కోపం కూడా వచ్చింది. ఇంత పెద్దమనిషి ఎందుకిలా ప్రవర్తిస్తాడని."

కనుక ప్రతిష్ఠ పెంచుకోవడం **(Image Building)** అనేది చాలా ప్రమాదకరమైన ఆట. ఒకటి అది సఫలంకాదు ఒకవేళ అయినా ఎక్కువకాలం

నిలువదు. జీవితాంతం నిలిచే సుదీర్ఘమైన మన అనుబంధంలో ఈ అసత్యపు ప్రతిష్ఠ ఎంతకాలం నిలుస్తుంది? ఒక్కరోజు నాయకత్వం వహిస్తే చాలా? ఒక చప్రాసీ తన స్థాయి ఎక్కువ చెప్పుకుని వివాహం చేసుకున్నట్లు పేపర్లలో వార్త వచ్చింది. అమ్మాయి బంధువులకు తానొక బ్యాంకు ఆఫీసర్‌ననీ అతడు చెప్పుకున్నాడు. పాపం వారికి నిజంతెలియదు. వివాహం అయిపోయింది. తరువాత అసలు విషయం బైటపడింది. పెద్ద రాద్ధాంతం జరిగింది.

అమెరికా అధ్యక్ష ఎన్నికలలో ఇలాంటి అనుభవం ఎదురౌతుంది. అభ్యర్థి ప్రతిష్ఠను పెంచేందుకు అక్కడి ప్రచార సంస్థలు రకరకాలుగా ప్రయత్నాలు చేస్తాయి. కాని సగంకంటే ఎక్కువమంది అధ్యక్షుల విషయంలో అనుభవం ఏమిటంటే వారి పదవీ కాలం కంటే ముందుగానే వారి ప్రతిష్ఠ మంటగలిసి పోయింది. కేవలం ప్రతిష్ఠ పెంచడం వల్ల పని జరగదు. జీవితాంతం పనిచేయవలసి వచ్చినపుడు స్వయంగా ఉత్తమస్థాయికి చేరేందుకు కృషిచేయాలి. అందుకే మహానుభావులైన వారెవరూ ఈ ప్రతిష్ఠ పెంచుకునే (**Image building**) పరిభ్రమణంలో చిక్కుకోరు. అలాంటి వారిలో ఆలివర్ క్రామ్‌వెల్ ఒకరు. ఇంగ్లాండులో ప్రముఖుడిగా గుర్తింపబడిన తరువాత తన చిత్రపటం ఒకటి వేయించాలని ఆయనకు మనస్సులో ఆలోచన కలిగింది. ఒక చిత్రకారుడిని పిలిపించి తన చిత్రాన్ని గీయమని కోరాడు. ఆ రోజులు ఫొటోలు తీసే విజ్ఞానం ఇంకా లేదు అయితే ఆ కళాకారుడు ఒక్కసారి చూడడంతోనే గీయగల సమర్థుడు. కానీ కళాకారుడు ప్రాణసంకటస్థితిలో పడ్డాడు క్రాంవెల్ ముఖం మీద మచ్చలు ఉంటాయి. ఆ మచ్చల కారణంగా అతడి ముఖం కురూపిగా కనబడుతుంది. ఇంగ్లాండ్ అధినాయకుడి యొక్క చిత్రంలో మచ్చలు గుర్తిస్తే కురూపిగా తయారవుతుంది. అది చూసి అతడికి కోపం రావచ్చు. ఆయన ఉరిశిక్ష విధించినా విధించవచ్చు. కనుక ఎందుకైనా మంచిదని మచ్చలు లేకుండా చిత్రం గీసి క్రాంవెల్‌కు బహూకరించాడు అప్పుడే ఆయన తన ప్రసిద్ధ వాక్యం '**worm and all thal**' అనేది చెప్పాడు "లేదు లేదు, మచ్చలతోనే నా చిత్రాన్ని చిత్రించు. నేను ఎలా ఉన్నానో అలాగే చిత్రంలో చూపించు. దానిని ఏమాత్రం సంస్కరించవద్దు నేను ఎలా ఉన్నానో అలాగే ప్రజల ముందు కనబడతానని ఆత్మవిశ్వాసం, సాహసం గల వ్యక్తులు అంటారు. నకిలీ స్వరూపం ఎక్కువ కాలం నడువదు" అని ఆయన అన్నాడు.

మరొక విషయం కూడా దృష్టిలో ఉంచుకోవడం అవసరం. పటాటోపం ద్వారా ప్రతిష్ట నిర్మాణం చేసుకోగలమని ఎవరైనా భావిస్తే అది కేవలం భ్రమ మాత్రమే. ఒకవేళ దోషాలను దాచిపెట్టడంతో మనం నూటికి నూరుశాతం సఫలం అయినా భగవంతుడి న్యాయస్థానం ముందు మాత్రం మనం చెప్పే తీయని ఉపన్యాసాలు ఏ మాత్రం పనిచేయవు. ఈ సందర్భంలో ఒక మంచి సంఘటన జ్ఞాపకం వస్తోంది. ఉమర్ అనే ఖలీఫా ఉండేవాడు. అతడు చాలా ఔదార్యం కలిగినవాడు. ఎవరైనా ఎప్పుడైనా అతడిని కలుసుకునే వీలుండేదని చెబుతారు. ఒకసారి ఒక వృద్ధురాలు తన మనుమడిని తీసుకుని ఆయన వద్దకు వచ్చింది. ఇతడు అనారోగ్యంగా ఉన్నాడు. వైద్యుడు చూసి మందు ఇచ్చాడు. తీయటి పదార్థాలు తినడం మానివేయమన్నాడు. కానీ వీడు మా మాట వినడం లేదు. మీరు కాస్త నచ్చజెప్పండి అని ఆమె ప్రార్థించింది. సరే వీడిని 15 రోజుల తరువాత తీసుకురమ్మని ఉమర్ ఆమెతో చెప్పాడు. 15 రోజుల తరువాత ఆమె తిరిగి వచ్చింది. అప్పుడు ఉమర్ "చూడు నాయనా! తీయటి వస్తువులు తినవద్దు" అన్నాడు. ఆ కుర్రవాడు సరే, తినను అన్నాడు. ఆ వృద్ధురాలికి ఆశ్చర్యం కలిగింది కేవలం ఈ ఒక్కమాట చెప్పటం కోసమే అయితే 15 రోజులు ఎందుకు ఆగవలసి వచ్చింది అని. ఉమర్ చెప్పాడు. ''దానికి కారణం ఉంది. నువ్వు తియ్యటి వస్తువులు తినవద్దన్న విషయం చెప్పేనాటికి నాకు కూడా తీయటి వస్తువులంటే చాలా ఇష్టం ఉండేది. కనుక ఆ రోజు నేను తీయటి పదార్థాలు తినవద్దని చెప్పినా ఆ మాటలకు విలువ ఉండేదికాదు. తీపి తినడం నేను మానివేయడంకోసం ఈ 15 రోజుల సమయం తీసుకున్నాను. నేను మానివేశాను ఇప్పుడు వీడు నేను చెప్పినది తప్పక వింటాడు. వీడిపై నా మాటల ప్రభావం తప్పక ఉంటుంది. మనలో కూడా గుణ దోషాలు ఉంటాయి. మనం వాటిని దాచిపెట్టడానికి ఎంతైనా ప్రయత్నం చేయవచ్చు. కానీ మన మాటలో, ఆచరణలో వాటి ప్రభావం తప్పక కనబడుతుంది. దగ్గర దారిలో ప్రతిష్ట పెంచుకోవాలనే తాపత్రయాన్ని విడిచి పెట్టమని నేను మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. అప్పుడే పనిలో విజయం లభిస్తుంది. స్వయంగా మనలను సంస్కరించుకోగలిగితేనే ప్రయోజనం ఉంటుంది. అదే ఉత్తమమైనది. మన ప్రతిష్ఠను ఎలా పెంపొందించుకోవాలనిగానీ, మన వ్యక్తిత్వాన్ని ఎలా బాగుచేసుకోవాలని ఆలోచించాలి. ఇది ఉంటే మిగిలినవన్నీ భగవంతుడే చేసిపెడతాడు.

ఆత్మ వికాసానికి వేరే వికల్పం (Alternative) లేదు ఈ విషయం మనం స్పష్టంగా గ్రహించాలి. అయితే ఆత్మవికాసాన్ని సాధించడం ఎంతకష్టమో దానిని నిలుపుకోవడం అంతకంటే చాలా కష్టం. ఎందుకంటే మనిషి ఆత్మ వికాసాన్ని పొందుతున్నకొద్దీ అతడి ప్రభావం పెరుగుతుంది. పని పెరుగుతుంది. ప్రతిష్ఠ పెరుగుతుంది గౌరవం పెరుగుతుంది. కనుక మనస్సులో పరివర్తనకూడా ప్రారంభం అవుతుంది. ఈ పరివర్తన చాలా నెమ్మదిగా జరుగుతుంది. ఒక్కసారిగా మార్పు వస్తే గుర్తించగలుగుతాం. మొదట్లో ప్రతిష్టలేదు. ఇప్పుడుఉంది. మొదట్లో ధనంలేదు, ఇప్పుడు ఉంది. మొదట్లో కార్యాలయంలేదు ఇప్పుడుంది. మొదట్లో పత్రికలలో ప్రచారంలేదు ఇప్పుడుంది. మారిన పరిస్థితులలో మన మంచితనాన్ని అలాగే నిలబెట్టుకోవడానికి విశేషంగా కృషి చేయవలసి ఉంటుంది. ఇది ప్రజల దృష్టిలోకిరాదు 'మేం మంచి కార్యకర్తలం. అలాగే ఉంటాం' అని వారు అంటూంటారు. కానీ నెమ్మది నెమ్మదిగా మార్పు ప్రారంభమౌతుంది ఒక ఉదాహరణ చెబుతాను చాలా రోజుల క్రితం ఒక సినిమా వచ్చింది. దాని పేరు 'మాయా మశ్చీంద్ర' స్వామీ మశ్చీంద్రులు నాథ్ సాంప్రదాయానికి మొదటి ప్రవర్తకులు. వారు ఒంటరిగా భిక్షమెత్తుకుంటూ ఉండేవారు. భిక్షమెత్తుకుంటూ ఒక రాజ్యపు రాణీగారి దగ్గరకు వెళ్ళారు. రాణీకి ఆయనపై మోహం కలిగింది. "యోగిరాజా! మీరిక్కడే ఉండిపోండి" అని ఆమె అడిగింది. "నేను యోగి పుంగవుడను, ఇక్కడ ఉండడం నాకు తగదు" అని ఆయన సమాధానమిచ్చాడు. రాణీ చాలా చతురురాలు. "సరి! అదీ విషయం. మీకు మీమీద నమ్మకం లేదన్న మాట ఇక్కడ ఉన్నంత మాత్రానే మీకు స్ఖలనం అవుతుందన్న మాట" అంది. ''అలా ఎన్నటికీకాదు, నేను యోగులకే గురువును' అన్నారు మశ్చీంద్రులు. ''మరి అంత ఆత్మవిశ్వాసం ఉంటే ఇక్కడే ఉండండి" అంది రాణీ. ఆయన అక్కడ ఉండేందుకు అంగీకరించాడు. మూల కథలో ఏమని ఉన్నదంటే అక్కడ ఉండి ఉండి, 'నేను యోగి పుంగవుడను. నేనెలా పతన మౌతాను ?' అనుకుంటూ అనుకుంటూనే ఆయనలో నెమ్మది నెమ్మదిగా మార్పు ప్రారంభమైంది. ఆయన బైటకు వెళ్ళే అవకాశం లేకుండా, బైటివారు ఆయనను కలిసే అవకాశం లేకుండా రాణి ఏర్పాట్లు చేయించింది. ఫలితంగా వారి వ్యవహారమంతా వేరే విధంగా మారిపోయింది. ఇక్కడ వారి శిష్యులు తమ

గురువు ఏమై పోయాడో తెలియక ఆందోళన పడుతున్నారు. వెతుకుతూ వెతుకుతూ ఒక శిష్యుడు మశ్చీంద్రులు నివశిస్తున్న గ్రామంలో ప్రవేశించాడు ఆయన రూపురేఖలు వర్ణిస్తూ ఎవరైనా సన్యాసి ఇటు వచ్చారా? అని భోగట్టా చేయడం ప్రారంభించాడు. సన్యాసి రాలేదు కానీ ఒక యాచకుడు వచ్చాడు ఆయన రాణీ గారి ఇంట్లో విడిది చేశాడని గ్రామస్థులు చెప్పారు. శిష్యునికి చాలా బాధ కలిగింది. ఇప్పుడు ఆయనను ఎలా కలవాలి? అని మార్గాన్ని వెదకసాగాడు. ఆయన ఎవరినీ కలువకుండా ఉండే విధంగా రాణి వ్యవస్థ చేసింది. అయితే ఆ శిష్యుడు సన్యాసి. కనుక భిక్షాటక వేషం వేయడంలో సంకోచం ఏముంటుంది? భిక్షకుల వేషంలో వారి శిష్యుడు, గోరఖ్‌నాధ్, తదితరులు భిక్షాటనకై రాజద్వారం వద్దకు వెళ్ళారు, భిక్షాటనకై లోపలకు ప్రవేశించిన వారిని అక్కడి పూల తోటలో మశ్చీంద్రులు, రాణి వారితో కలిసి ఊయలపై కూర్చుని ఊగుతున్న దృశ్యం దిగ్భ్రాంతులను చేసింది. తమ గురువు యొక్క ఈ పరిస్థితి చూసి వాదు దుఃఖించారు. భిక్షార్థమై ఢమరుకలను ప్రయోగించ సాగారు. ఆ ఢమ ఢమ శబ్దాల మధ్య గోరఖ్‌నాధుడు "గోరఖ్ వచ్చాడు-మశ్చీంద్ర నడు. గోరఖ్ వచ్చాడు మశ్చీంద్రా నడు" అని పలుకసాగాడు నా శిష్యుడు, నా 'గటనాయక్' నన్ను ఇక్కడ కూడా వదిలిపెట్టేటట్లు లేడు. నేను సుఖంగా విశ్రాంతి తీసుకుంటూంటే అతడు ఇక్కడకు కూడా వచ్చాడు. అని మశ్చీందుర్రిలు అనుకున్నారు. కానీ అంతలోనే పశ్చాత్తాపం కలిగింది. రాణిగారి వద్దనుండి శిష్యులతో కలిసి పారి పోయారు. ఇలా మనిషి పతనం మనం గమనించ లేనంత నెమ్మదిగా జరుగుతుంది. మార్చ్‌హిమ్ అనే ఒక కథ ఉంది; మంచి వ్యక్తి ఏ రకంగా అధఃపతనం చెందుతాడన్నదే అందులో కూడా చెప్పబడింది. 'దీనివల్ల ఏమై పోతుందిలే' అని ప్రతిసారి అతడు అనుకుంటాడు. ఈమాత్రం దిగజారక తప్పదు అనుకుంటూ తనకుతానే న్యాయం చెప్పుకుంటూ చివరికి మనిషి ఎంత దిగజారి పోతాడంటే మనం ఊహించలేం. గౌరవం, అధికారం లభించిన తరువాత మంచి కార్యకర్తగా నిలబడడం కోసం సహేతుకంగా ప్రయత్నం చేయకపోతే మంచిగా జీవించడం కష్టం.

ఇతరులు ఏం చేయకపోయినా వారికి ప్రచారం లభిస్తోందే! అనిపిస్తుంది. భారతీయ మజ్దూర్ సంఘ్ అయితే పనిచేయాలని గట్టిగా చెప్తుంది. కానీ ప్రచారం

లేకుండా పనిచేయలేం. ఎలాగైతే మనం మొదటినుండి అవసరాలకు తగిన కనీస భత్యం ఉండాలంటున్నామో అదేరకంగా అవసరాలకు మించనటువంటి ప్రచారం కూడా తప్పక కావాలి. పని వృద్ధి చెందడానికి ప్రచారం అవసరం అన్నది సరియైన ఆలోచనే. అయితే నెమ్మదిగా ప్రచారం లభిస్తున్న కొద్దీ మన గురించిన వార్తలు రోజూ చదవాలి అనే అభిలాష ప్రారంభం అవుతుంది. నెమ్మదినెమ్మదిగా మన ఫోటో పేపర్లలో పడాలనే కోరిక పెరుగుతుంది. మన కంఠం కాసెట్‌లో వినాలనే భావం జాగృతమౌతుంది, దానినే 'నార్సిసస్ భావన' అంటారు. గ్రీకు పురాణాలలో ఒక కథ ఉంది. నార్సిసస్ అనే 18, 19 సం.ల కుర్రవాడు ఉండేవాడు. అతడు అత్యంత సుందరుడు. అతడి అందం ఆడవారివలె ఉండేది. ఆ రోజుల్లో బహుశః అద్దాలు ఉండి ఉండకపోవచ్చు. అతడెప్పుడు తన సౌందర్యాన్ని చూసుకోలేదు. ఒకరోజు ఆ యువకుడు ఒక వంతెన మీదుగా వెళ్తు పై నుండి క్రింద నీటిలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు తన సౌందర్యానికి అచ్చెరువొందాడు. తనకు తనతోనే సంభోగం జరగాలని అతడికి కోరిక పుట్టింది. ఇదైతే సాధ్యమయ్యే విషయం కాదు. ఈ ఆలోచనలతో, విరహవేదనతో అతడు మరణించాడు. యూరప్‌లో నది ఒడ్డున పెరిగి, నీటిలో వాటి నీడపడే పువ్వులను 'నార్సిసస్' పూలు అని పిలుస్తారు. అలా తనలో తాను విలీనం కావాలనే కాంక్షను 'నార్సిసస్ భావం' అంటారు. నా ఫొటో కనిపించాలి. నా గురించి వార్త పడాలి. నా కంఠం వినిపించాలి - ఇదంతా నార్సిసస్ భావం యొక్క రూపమే. చివరికి నెమ్మది నెమ్మదిగా ప్రచారం అనేది కార్య వృద్ధి కోసం అవసరం అనే మౌలిక అంశాన్ని మరచిపోతాం. అంతేగాక ప్రచారానికి ఎంత అవసరమో అంతే పని చేస్తాం. నెమ్మది నెమ్మదిగా తెలియకుండానే ఈ పరివర్తన మనలో వచ్చేస్తుంది.

మొదట్లో మనవద్ద ధనం లేదు. ధనం లేని కారణంగా మనం పోస్టర్స్ ముద్రించలేక పోయేవారం. కరపత్రాలు పంచిపెట్టలేక పోయేవారం. చాలా అవసరమైన వస్తువులను కూడా సమకూర్చలేని పరిస్థితి ఉండేది. ధనాభావంతో పని నిలిచిపోతున్నందుకు చాలా బాధ కలుగుతూ ఉండేది. నెమ్మదిగా పని పెరిగింది. ధనం వచ్చింది, మంచి బాంక్ బాలన్స్ తయారయింది. ధనం తిరుగాడుతూ ఉంటే నెమ్మది నెమ్మదిగా ఆలోచనలలో మార్పు వస్తుంది.

'న్యాయంగా అయితే ఫస్ట్ క్లాస్‌లో ప్రయాణం చేయకూడదు కానీ ఆరోగ్యం బాగుండడం లేదు. కనుక అలా వెళ్ళక తప్పదు' అని మనిషికి అనిపిస్తుంది. రెండవ తరగతిలో ప్రయాణిస్తే జ్వరం పెరుగుతుంది. ఆరోగ్యం మరింత చెడి పోతుంది అనిపిస్తుంది. కార్యం దృష్ట్యా మొదటి తరగతిలో ప్రయాణం చేయడం అవసరం అయితే తప్పక చేయవచ్చు. కానీ ఒక్కొక్కసారి ఎలా అవుతుం దంటే రేపు ఢిల్లీకి చేరాలి. ఈ రోజు ఇక్కడ ప్రత్యేకంగా పనేమీ లేదు. ఇంతలో ఎవరో మిత్రులు వస్తారు. తరువాత బయలుదేరుదాం అనే ఆలోచన ఇతడికి ప్రారంభమౌతుంది. ఇవాళ మిత్రులతో కులాసాగా గడపవచ్చు. రైలులో కాకుండా రేపు తీరికగా విమానంలో వెళ్ళవచ్చు. యూనియన్ వద్ద ధనం ఉంది, మిత్రులతో గడపడం కూడా అవసరమే కదా! అంటే దానికి కూడా ఒక ఔచిత్యాన్ని వెదుకుతాడు. రైలులో కాక విమానంలో వెళ్ళడం అవసరంగా మారుతుంది, ఇలా ఔచిత్యాన్ని చేసుకుంటూ నేటి విలాసకర విషయాలు నెమ్మదిగా రేపు అత్యవసర విషయాలుగా మారిపోతాయి.

మా మిత్రుడొకరు మాతోబాటు రోజూ ఉదయం ఒక డబ్బాతో నీరు తీసుకుని నిత్య కర్మల కోసం సమీపం లోని అడవికి వస్తూండేవాడు. కానీ పార్లమెంట్ సభ్యుడైన తరువాత ఆయన పద్ధతి చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అత్యవసర పరిస్థితి కాలంలో వేషాలు మార్చుకుని మేము తిరుగుతూ ఉండేవాళ్ళం ఆయన కూడా మాతో ఉండేవాడు. ఆయనకు ఫ్లష్ లాట్రిన్ లేకుండా మల విసర్జన జరిగేది కాదు. ఇప్పుడాయనకు ఫ్లష్ లాట్రిన్ జీవితావసరంగా మారి పోయింది. ఈ పరివర్తన ఏదో నిజాయితీ లోపం లేని కారణంగా మాత్రమే జరగదు. ఈ పతనం తెలిసి తెలిసి కూడా జరగదు మనను మనం సమర్థించు కుంటూ, ఔచిత్యాలను వెదుక్కుంటూపోవడంవల్ల నెమ్మది నెమ్మదిగా ఈ మార్పు సంభవిస్తుంది. మొదట్లో మనకు కార్యాలయం పేరున ఒక్క గది కూడా లేదు. చాలా కష్టంగా ఉండేది. మేం పదిచోట్లకు వెళ్తూఉంటాం. అక్కడివా రెవరైనా ఇక్కడకు వస్తే వారికి కనీసం పడుకోవడానికి వసతి కూడా చూపించలేకపోయే వారం. మాకు అనేక సత్కారాలు వారు చేసేవారు. తినిపించేవారు. కానీ మన తరఫున వారికి భోజనం పెట్టడానికి మనకు ఒక్క వంటిల్లు కూడా లేదు. చాలా బాధ కలిగేది. నెమ్మదిగా యూనియన్ కార్యం పెరిగింది. ధనం, ప్రతిష్ఠ పెరిగాయి. కార్యాలయం ఎలాగూ అవసరమే! ఎవరు దానిని వద్దంటారు?

మొదట కార్యాలయం కావాలి అనిపిస్తుంది. నెమ్మదిగా కార్యాలయం ఇంకా కొద్దిగా పెద్దదిగా ఉంటే బాగుండునని అనిపిస్తుంది. ఆ తరువాత నివసించడానికే అయి నప్పుడు దీనిలో అన్ని సౌకర్యాలు సమకూర్చుకోవడంలో తప్పేమిటి అనిపిస్తుంది. మన కాగితాలు సురక్షితంగా, వ్యవస్థితంగా పెట్టుకోవడంకోసం వేరుగా ఒక గది ఉండాలి అనిపిస్తుంది. మన బట్టలు వేరుగా పెట్టుకుని, తాళంవేసుకుంటే ఏగందర గోళం జరగదు. మనస్సుకు కూడా ఆందోళన ఉండదు. కనుక మనకు వేరే గది, వేరే పక్క ఉండాలి. అంటే వ్యవస్థతోబాటు వ్యవస్థాజన్యప్రవృత్తి (**Establishment Mentality**) కూడా వస్తుంది. మనిషి నిజాయితీపరుడే. చైనావాళ్ళతో యుద్ధం వస్తే, పైవారి ఆదేశం లభిస్తే అందులో ముందుకు దూక డంలో ఆయన పేరు ముందుంటుంది. కానీ తన పక్కమీద మాత్రం వేరేవాళ్ళను కూర్చోనీయడు. యుద్ధరంగంలో చావడానికి సిద్ధమే. పక్కమీద వేరేవాళ్ళను కూర్చొననివ్వడానికి మాత్రం సంసిద్ధత లేదు. నెమ్మది నెమ్మదిగా మనిషిలో తెలియకుండానే ఈ మార్పు వచ్చేస్తుంది. ఇది సహజం. ఇది సాధ్యమైనంత తగ్గించాలనే ఉద్దేశంతోనే మనం ప్రచారానికి సాధ్యమైనంత దూరంగా ఉంటున్నాం. ప్రత్యక్ష కార్యంమీద మన దృష్టి ఎక్కువ ఉంటుంది. ప్రత్యక్షంగా పనిచేస్తేనే కార్యకర్త తనపై నియంత్రణ ఉంచుకోగలుగుతాడు.